

# పరమామృతము



శ్రీ దరియా హుస్సేనలీషా దేశికేంద్రులవారి
ప్రియ శిష్యులయిన

షేక్ ఖాశీమలీషా ఖాదరి దేశికేంద్రులవారిచే
రచింపబడినది.

కుందురువారిపాలెం
సత్తెనపల్లి తాలూకా – గుంటూరు జిల్లా



ప్రచురణకర్తలు:
వారి శిష్యబృందము
1959

# విషయ సూచిక



పేజీలు


1 శ్రీ గురుస్తోత్రము 1

2 ప్రార్థన పద్యములు 2-9

3 గురుశిష్య సంవాదము 9-35

4 శ్రీరామ శతకము (కందములు) 37-58

5 శ్రీరామ శతకము (సీసములు) 59-113

6 చిత్రశతకము 115-137

7 గురుస్తోత్రములు 139-166

8 బోధామృతము 167-184

9 దండకము 185-186

10 గురుదేవ స్తోత్రములు 186-191

11 గురునామ స్తోత్రములు 191-196

12 గురుని నామము 196-197

13 తోహరలు 197-205

14 ద్విపదలు 205-208

15 తత్త్వములు 209-294

16 మంగళహారతులు, పూజపాటలు,
జోలపాటలు, మేలుకొలుపులు, మొదలగునవి. 294-300



షేక్ తంగెళ్ల ఖాశీమలీషా దేశికేంద్రులవారు



పత్నీసమేత షేక్ తంగెళ్ల ఖాసీమలీషా
దేశికేంద్రులవారు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః
శ్రీ సద్గురుభ్యోన్నమః

# శ్రీ వారి జీవిత చరిత్ర

భక్తాగ్రేసరులగు పాఠకమహాశయులారా !

శ్రీమదఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపులును, పరబ్రహ్మ ధ్యానానంద వికసిత హృదయారవిందులును, కేవల సత్వగుణ సంపన్నాలంకారులును, యీ గ్రంథరచయితలునగు శ్రీ హజరత్ షేక్ తంగెళ్ల ఖాశీమలీషా ఖాదరిగారి జీవిత చారిత్రమును విపులముగా వ్రాయుట మావంటివారి కసాధ్యమైనను మా తెలిసినంత యథార్థ విషయములను క్లుప్తముగా తెలుపుచున్నాము.

ఈ ఋషిపుంగవులు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా, గోళ్ళపాడు శివారు కుందురువారిపాలెము అను నొక కుగ్రామమున పరమ పవిత్రమగు మహమ్మదీయ వంశంబున షేక్ ఆదంసాహెబ్ చాంద్బీ లను పుణ్యదంపతులకు నొక సుముహూర్తమునందుద్భవించి బాలశశాంకునిం బోలె దినదిన ప్రవర్ధమానులై ప్రకాశించుచుండిరి. వీరికైదారు మాసముల వయసునందొక దినంబున తల్లిగారు స్నానాది క్రియలు గావించి నుయ్యాల యందూచుచుండ నచటికి శ్రీకొమ్మాలపాటి వాస్తవ్యులు పరమ గురుసార్వభౌములగు హజరత్ ఖాదర్మస్తాన్షా అవులియాగారు వీరి గృహమున కేంచేసి యీ బాలుని గాంచి శుభలక్షణము వీక్షించి, పరమానంద సంభరితులై యీ శిశువు మున్ముందు నాగురువంశంబు నుద్ధరించి, శాశ్వత సత్కీర్తివంతు డగునని సర్వ శుభాస్పదముగా దీవించి చనిరట.

తదనంతరము నైదవ వత్సరమున యేతద్గ్రామ మందే పాఠశాలయందు ప్రవేశించి శ్రీ శేషయ్యా పంతులుగారియొద్ద ఆంధ్రగీర్వాణ హుణాదివిద్యల నభ్యసించి, అచటికి చేరువలో నున్న ముప్పాళ్ళ గ్రామమున కొన్ని వత్సరములు అక్కౌంట్సు మునసబు వుద్యోగము సక్రమముగా నెరవేర్చి, సర్వేపరీక్ష యందుత్తీర్ణులై, గోవిందపుర నివాసులైన షేక్ ఖాశిం సాహేబు బడేబీబి యను పుణ్యదంపతుల సుపుత్రికా రత్నమగు సుబహాన్బి అను నన్నేబీబీ గారిని వివాహమాడి సుఖముగా కాలముగడుపుచు, తదుపరి వ్యాక్సనేటరు వుద్యోగమున ప్రవేశించి వినుకొండ తాలూకా గ్రామాందులలో పని చేయుచు యల్లలచెరువు, అడవిపాలెం గ్రామస్థులగు కొందరిఅభిమానాహ్వానములపై సకుటుంబముగా అడవిపాలెం నివాస మేర్పరుచుకొని కొంతకాలము పనిచేయుచు నొక దినంబున తనలో శరీర మస్థిరమనియు శాశ్వితమగు మోక్ష మార్గమునకై పాటుబడుటయే మానవ జన్మమునకు ముఖ్యాంశమని మనంబు దృఢపరచుకొని ఆసమయముననే కొమ్మాలపాటి వాస్థవ్యులును శ్రీ వేదవేదాంత ఆత్మార్ధ తత్వవేత్తలగు శ్రీదరియా హుస్సేనలీషా ఖాదరిగారి వలన మాతృ పితృ పత్నీ యుతముగా గురు కటాక్షము పొంది మంత్రాది యోగముల నభ్యసించి కొలది కాలము వరకు వినుకొండ గుహాలయందును అడవిపాలెం గ్రామసామీప్య మున నొక ఆశ్రమము యేర్పరుచుకొని అచటను తపమాచ రించుకొనుచు గృహస్థాశ్రమ ధర్మముల నెరవేర్చుచు తమ మనస్ఫూర్తిగా యా వ్యాక్సనేటరు వుద్యోగమునుండి

విముక్తులై బాలురకు విద్యగరపుచు 1 ముస్తాక్‌బి, 2 ఖాశింబి,
3 సుల్తాన్బి యను ముగ్గురు కుమార్తెలను, దరియాహుస్సే
నలీషా యనునొక కుమారుని బడసి గురు సేవాదురంధరులై
యున్నంత, కొంత కాలమునకు అనగా ది 28-9-1914
తారీఖున వీరి స్వగురుమూర్తిగారగు దరియా హుస్సేన్
అలీషా ఖాదరిగారు మోక్ష సామ్రాజ్య మలంకరించిరి.
తదాదిగా వత్సరమున కొక పర్యాయము వారి ఆరాధనాది
గురు కార్యముల జరుపుకొనుచుండగా నరసరావుపేట
తాలూకా కురకపాలెం వాస్తవ్యులగు హాజరత్ మీరా
సాహెబు అవులియా గారి తనూభవుండును వేదవేదాంత
శాస్త్ర ప్రవీణులగు హాజరత్ అబ్దుల్ రజాకుషా అవులియా
గారు శ్రీ వీరి నడవడికకు, శాంతశమదమమాది గుణములకు,
గురు భక్తికి, కడుంగడు సంతసించి గురువంశంబు వృద్ధిజేయు
నను నమ్మకముతోచి వీరికి ఖిలాఫతు నీయ నుద్దేశించి స్వ
గురువులు నిర్యాణ మగుటచే ఏతత్ గురువంశులైన వీరే
ఖిలాఫతునామా వ్రాసి భక్తబృందము వారి సమక్షమున
నొసంగి దీవించియుండిరి. అప్పటినుండి తమరి నాశ్రయించు
భక్తాదుల యొక్క మనంబు పరిశీలించి సద్బోధనాది యోగ
ముల నుపదేశించుచు భక్తుల, శిష్యుల హృదయానంద
మొనర్చుచుండిరి. అప్పుడప్పుడు భక్తుల శిష్యుల కోరిక నిర్వ
ర్తించుటకై మానికొండ, నెల్లూరు మొదలగు గ్రామా
దులలో ఆశ్రమముల యందు నివాస మొనర్చుచు పర్యటన
చేయుచుండెడివారు. తుదకు జన్మస్థానమైన కుందురువారి
పాలెము నందే స్థిరనివాసమై యుండ దలంచగా గోళ్ళపాడు
నివాసులగు గోళ్ళపాటి వెంకటప్పయ్యగారు గ్రామసామీప్య

మందున్న తమతాలూకు కొంత భూమి నుచితముగా నొసంగిరి. అందులో ఆశ్రమము నేర్పరచుకొని నివసించుచు భక్త జనోపయుక్తమగు యీగ్రంథమును రచించిరి. ఇట్లు 75 సంవత్సరముల ప్రాయము వరకు బహ్మానంద మగ్నులై కాలము గడుపుకొనుచు శ్రీదుర్ముఖినామ సంవత్సర శ్రావణ శుద్ధఏకాదశీలు గురువాసర మూలా నక్షత్ర మర్ధరాత్రింబున స్వగురు సాన్నిధ్య మలంకరించిరి.

ఈ పరమామృతమను గ్రంథమున గల భావామృత మును భక్తులగు వారంద రనుభవించి పవిత్రులగుట శ్రేయ స్కరమని యెంచి శ్రీ గుంటూరుజల్లా వినుకొండతాలూకా గంటావారిపాలెం వాస్తవ్యులును పతివ్రతామ తల్లులును చిలకూరి బ్రహ్మయ్యగారి ధర్మపత్నియు గోగినేని నాగార్యుల వారి ప్రియశిష్యురాలు నగు చంద్రమ్మగారును, చిలుకూరి రాఘవయ్యగారి ధర్మపత్నియు యీ గ్రంథ రచయితగారి ప్రియ శిష్యురాలునగు హనుమాయమ్మగారు యీ యిరువురు ద్రవ్య సహాయమొనర్చి ముద్రింపజేసిరి. గాన పరమేశ్వరుడీ ఉభయ వంశములను ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధిగాను సర్వశుభాస్పదములొసంగి రక్షించుచుండుగాత.

మ॥ కవితా మార్గ మెరింగి సందులకు సత్కారంబు యోచించి యా
సవిశేష స్థితి శాస్త్రభావముల చర్చించేసి తత్వార్థముల్
వివిధోపాయములన్ గ్రహించి యొకలున్ వేదాంత విజ్ఞానముల్
భువిలో నేర్పగ తత్త్వగేయము జగత్పూజ్యంబుగా వ్రాసితా
రవి చంద్రుల్ గలకాలముండు గద శ్రీ రామా కృపన్ శ్రేయమై.

గీ॥ శ్రీకరంబుగ పదునాల్గు లోకములను నిండిపరిపూర్ణుడై భక్త నికరములను
బ్రోచుపరమేశ్వరుండు తాభూరి కరుణనేలుగావుత నీకృతి నిక్కవముగా.

ఇట్లు, **భక్తబృందము**

శ్రీ షేక్ తంగెళ్ళ ఖాసింషా అయ్యలవారి నిర్యాణమును గురించి వ్రాయబడిన

# తత్వము

కీర్తన: బేగడ-ఆటతాళం

(1) దివికి జేరెనుగా మహాత్ముండు ఖాశింషా ఆర్యులు
రవియు గ్రుంకు తెరంగు ననఘుండు - భువిజనుల పావనము
జేయుచు పొందుగా బహుకాలముండిన దివిజులగు మము
బ్రోచు టెప్పుడని దివ్యముగు ఆహ్వానమంపగ ॥దివికి॥

(2) శాంత శమదమామాది గుణములను ఐశ్వర్యముగ గాని
భ్రాంతి రహితుండయ్యు నిరతమును - చింత సంతసములును
రెండొక స్థితిగ పరివర్తనలో నుంచుక అంతరంగమునందు
యోగానందసుధ గ్రోలిన ఋషీంద్రుడు ॥దివికి॥

(3) సత్యవాగ్భూషణ దురంధరుడు పరమార్థచింతన నిత్య
మాచన్త్రైక తత్పరుడు - సత్యాసత్యంబుల ఫలమ్మును
స్పష్టంబుగ బోధించి దేహమనిత్య మాత్మయె నిత్యమని
సుస్వానుభావము జేయు నమలుడు ॥దివికి॥

(4) భక్తి హృత్కమల ప్రపూర్ణుండు దీప్త స్వరూపను-
రక్తితో సౌజ్ఞనిధు విమలుండు - శక్తిపంచక భూతపంచక
సరణి విపులముగా నొసర్చియు ముక్తిమార్గము కరతలామ
లకముగ జూపు గురుప్రభుండిదె ॥దివికి॥

(5) ఇల సుఖముల నసహ్యముగ జూచి అధికారదర్పము
చలన బాధితములని కడద్రోచి - తలపులచె దగులక
మనంబున కలత యను టెరుగ బోకెప్పుడు విలసితానందాబ్ధి
దేలుచు విజయ ఘంకా ఘమఘమా యన ॥దివికి॥

(6) అరయ నరిషడ్వర్గదూరుండు వాటి దరిజేర్చక శర నిహంతి జక్కఁడు శూరుండు - హరిహర బ్రహ్మాది సురలకు నసాధ్యం బగు మహాతత్త్వము పరమసత్త్వ గుణంబుచే యనుభవము జేసిన పుణ్యపురుషుడు ॥దివికి॥

(7) సార హీనంబైన సంసారబంధమున జిక్కక ధీరుడై వైరాగ్యమింపార-మేరుశిఖరమునం త్రికూట విహార మొనరించుచు స్థిరంబుగ తారక బ్రహ్మంబు తానై తత్వమస్యాది లక్ష్యంబున ॥దివికి॥

(8) ధరను దరియా హుస్సేన్ షా ఆర్యులను గురువరను తన హృత్సరసిరుహమున నిలిపి గొలుచుచుచు-విరివిగా వాక్యత్రియమ్ముల వివరమును భక్తులకు దెలుపుచు పరమ గుహ్యంబైన యోగభ్యాసములు శిష్యులకు జూపియు ॥దివికి॥

(9) వాసి దుర్ముఖ వత్సరంబునను శ్రీమించు శ్రావణ మాస మేకాదశియు శుద్ధమును- భాసమానంబైన యా గురు వాసరము నర్ధరాత్రంబున బాసి భౌతిక శరీరంబు నివాసమే మక్కాలో జేయగ ॥దివికి॥

(10) దండిగా ముప్పాళ్ళ పురమందు భక్త సంఘమ్ము నఖండ ప్రేమతో నేలి తా ముందు - అండ పిండాండాదిగా బ్రహ్మాండ కళలచే దోచు మాయను ఖండనము గావించి బయలును గాంచుమని ఖాశిమునుఁ బోధియు ॥దివికి॥

ఇట్లు, భక్తజన విధేయుడు.

**వి. మహమ్మదు ఖాశిం, ఆరేపల్లి ముప్పాళ్ళ.**

శ్రీ దరియాహుస్సేన్ షాఖాదరి గురుభ్యోన్నమః

# పరమామృతము

  

## శ్రీ గురుస్తోత్రము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మా తస్మైశ్రీగురువేనమః.

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితంయేన తస్మైశ్రీగురువేనమః.

మన్నాథ శ్రీజగన్నాథః మద్గురుశ్రీజగద్గురుః
మమాత్మసర్వభూతాత్మా తస్మైశ్రీగురువేనమః.

అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరం
తత్పదం దర్శితం యేన తస్మైశ్రీగురువేనమః.

చైతన్యంశాశ్వతం శాంతవ్యోమాతీతం నిరంజనం
నాదబిందుకళాతీతం తస్మైశ్రీగురువేనమః.

ఉ॥ శ్రీకరు సర్వపూర్ణుబుధ సేవ్యు పరాత్పరు భక్తపాలు సు
శ్లోకు నిరామయుఁ సకలశోభితు నిత్యనిరంజనుఁ గురుఁ
ప్రాకట వైభవోన్నతుని భాగవతాధిపు పాదపద్మముల్
చేకొని నాశిరంబునను జేర్చుకగొల్తు నభీష్టసిద్ధికై.

శా॥ సర్వానందమయుండవీవనుచు నే సర్వాత్మ భావింతురా
నిర్వైరుఁ దరియాగురు ప్రభువరుఁ నిర్వాచ్యునిర్వాణుఁ
గర్వగ్రంథులుబాపు భక్తవరదుఁ కళ్యాణసంయుక్తు నీ
యుర్విన్ బ్రార్థనజేతు నాదుమదికిన్ యుత్సాహమున్
గూర్పగన్.

ఉ॥ శ్రీరమణీమనోహరుని చిత్తమునన్ తలపోసి వేడెదన్
సారవిహీనమైన భవసాగరమీదు విధంబుదెల్పియున్
వారనిభక్తిచేసుజన వాంచితమా పరలోకవాసమున్
జేరిచి నిత్యసౌఖ్యమును జెందగజేయునటంచు నాత్మలోన్.

కం॥ గురుదేవరుండని తమలో
గురిగల్గినవారికెల్ల గోప్యంబౌ నా
పరమార్థమందిరని సు
సుస్థిరమతితో కారణార్యు సేవింతుభువిన్.

కం. దరియా గురుదేవునిపద
సరసీరుహములకు మ్రొక్కి సన్నుతిజేతుఁ
నిరతానందము నొందెడు
తెరవున నను జేర్చు దేవదేవుండనుచున్.

## విఘ్నేశ్వరు ప్రార్థన.

కం॥ విఘ్నములు దీర్చుకొరకై
విఘ్నేశ్వరుపాదపద్మ వినుతియొనర్తున్
భగ్నముగాకను గురుపద
లగ్నంబై సర్వమయుని లక్షింపభువిన్.

ఉ॥ చక్కని వాక్సుధారసము జాలగనిత్తువటంచు నిన్ను నే
మక్కువతోడ నమ్మియును మానక గొల్తు ననారతంబు నీ
పక్కనునిల్చిభావమున భక్తిజనించెడు వాక్యసంపదల్
గ్రక్కునవివ్వనీవె ఘన కారణకర్తవుగావె భారతీ.

## మాతృపితృల ప్రార్థన

కం॥ జననీ జనకులసేవయె
ఘనమని శ్రుతులెల్లబలుకు కారణమున నా
మనమున తలిదండ్రులనతి
వినయముతో దలచుచుంటి విడువక నెపుడున్.

కం॥ తలిదండ్రులె దైవంబని
తలపులలో దలచిదలచి ధర్మేతరమా
ములకలుజేర్చక నిత్యము
విలసితమా పరునిగలసి వెరుపక మనసా.

కం॥ పెద్దల సేవించెద పెడ
బుద్ధులకున్ బోక మనసు సూక్ష్మరూపమా
పద్ధతిదెలిసియు ననిశ మ
నర్థములన్ బాపజూపు నవ్వయులవుటన్.

కం॥ విద్యాభ్యాసమొనర్చిన
సద్యశులాశేషయార్యు సన్నుతిజేతున్
మిథ్యజగంబాబ్రహ్మము
తథ్యంబను శాస్త్రపఠన దయచేయుటచే.

కం॥ లక్షణములేవొ యెరుగను
రక్షించెదుమూర్తి గురుడు రాజైయుండన్
శిక్షమరేమియులేదను
దీక్షయె మహనీయులార దీర్చెడి నెపముల్.

## గాంధీజీస్తోత్రము నిర్యాణసమయము

ఉ॥ శ్రీకరమై సుధీజనవశీకరమై సకలార్థసంపదల్
చేకురుధర్మవాక్యములజేయములై జెలువొందురీతుఁన్
లోకములోనబల్కి పరలోకముజేరిన బాపుజీ యిదే
మీకునమస్కరింతు మముమీదదయజూపియుబ్రోవనీభువిన్

సీ॥ భరతదేశమ్మున ప్రఖ్యాతిగాంచిన
ధీరులు మీకంటె వేరుగలరె
సమమతితో నిట్లు సుమతులజేయంగ
విమలురు మీకంటె నెరుగబడిరె
ఆగమార్థంబుతో త్యాగంబు సలిపిన
యోగులు మీకంటె యొరులుఁగలరె
ఆశాపిశాచంబు నణగద్రొక్కినమహా
దేశికుల్ మీకంటె దెలియబడిరె

గీ॥ అన్నిలోకంబులను మిమ్మెయెన్నగలరు
వున్నతోన్నతులెవరు మీకన్న వేరె
చింతలేమియులేనట్టి సిద్ధమూర్తి
శాంతియుతవర్తి గాంధిజీ చక్రివర్తి.

సీ॥ దేశాభిమానమున వేసటలేకను మీసరిదిరిగినమిత్రులెవరు
జాతిమతంబులు జడతగాభావించి స్వతిబోధించిన నేతలెవరు
దుర్మదంబులదృంచ తాలిమివై చాటుచును ధర్మంబుఁగరపిన ధన్యులెవరు
యుర్విలోజరిగినదుర్వివాదంబుల నిర్వహించినమహనీయులెవరు

గీ॥ అన్యమేమియులేనట్టి యనుభవమున
మాన్యులై సత్యసంకల్ప మహిమగలిగి
ధన్యులనుజేయనీవె పరదైవమెత్తి
శూన్యులకుదోచవైతివో శుద్ధగాంధి.

## సరస్వతి ప్రార్థన

శా॥ తల్లీ నీపదపద్మముల్ శిరముపై దాల్తుఁ సదా నీవే యీ
ముల్లోకంబుల సర్వవిద్యలొసగన్ మూలంబటంచుఁ బుధుల్
యుల్లాసంబున గొల్చుచుండెదరు యీయుర్విఁ బ్రశంశింపగా
కల్లల్ గావని నమ్మియుంటి కరుణఁ గాపాడగఁ భారతీ.

ఉ॥ భూవలయంబునఁ పరమపూజ్యులునై నుతిగాంచుసత్కవుల్
త్రోవయి భక్తసంఘమున దోడ్పడి నిర్మల నీతియుక్తమా
భావముతోడ బంధముల బాపెదరంచు నిరంతరంబు యీ
కేవలసాక్షిమూర్తులకు కేలునుమోడ్చి నమస్కరించెదఁ.

కం॥ లక్ష్మియు వాణియు పార్వతి
రక్షింపగ గలిగియున్న రక్షితమని యా
పేక్షజనియించి గొలిచెద
కుక్షిని సర్వంబునిలుప కోమలులగుటన్.

కం॥ సృష్టిస్థితి లయములకును
స్పష్టంబుగ బ్రహ్మ విష్ణు శంకరులుండన్
నష్టంబేమిక నీవా
దృష్టిని విడబోకు మది యదృష్టంబవనిన్.

# హనుమాన్ ప్రార్థన

చ॥ జలనిధిదాటి లంఖిణిని జంపియు లంకకు నేగి యంతటన్
నిలువక వాయువేగమున నిశ్చలుడై పురమెల్ల వెదికి తాన్
కలతజనించి యంతటను గాడ్పువిధంబున వెదకిగానకన్
నిలువక శోకవృక్షమని నీడనునిలచిన సీతనెరిగియున్
తలపులలోను రాముపద దాస్యముజేయు సీతవార్తయున్
సుళువుగదెల్పినట్టి ఘనశూరుని కేసరి సూతు గొల్చెదన్.

కం॥ పెద్దలగని సేవింపుచు
వద్దికతో వారిపాద వనజములందున్
హద్దుగ దృష్టియొనర్చియు
ముద్దుగ జరియింపవలయు మురయుచు జీవా.

చ॥ నిరతము నిత్యసత్యవ్రతు నీతివిధాను పరాత్పరుఁ బ్రభుఁ
పరమ మునీంద్రు నెల్లెడలఁ బాయక గొల్చెడు భక్తపోషణుఁ
దురితవిదూరు సత్కృపులతోడయి బ్రోచెడు దేశికావ్యయుఁ
దరియ గురున్ దలంతునిటు ధన్యుని జేయునటంచు నాత్మలోఁ

మ॥ సతతంబుఁ హృదయాబ్జమందు గనియుఁ సాధించు సర్వా
త్మునిన్ । మదికినిదోచక నన్నిలోకములనుఁ మన్నించు
దైవంబునై । గతినీవేయని నమ్మియున్న ఘనులఁ కళ్యా
ణులఁ జేయుగా। ప్రతిలేకున్న పరాత్పరున్ మనసకే బ్రార్థింతు
నశ్రాంతమున్.

ఉ॥ భంగముగాని మార్గమున భాగవతుల్ జనుచంద్రుగాన ని
స్సంగుడవై జరింపుచును సాధనల్ గడతేరగావలెఁ
నింగితులైనవారలకు యీప్సితముల్ సమకూడు నీవు నీ
సంగతెఱింగి సర్వసముసాక్షిగనెంచుట జాలు నీధరఁ.

చ॥ సుమతులునిర్విచారులయిసూక్ష్మశరీరముభంగపరచియుఁ
సమతజరింపుచుండెదరు సత్యము నీడకఁ సర్వకాలముఁ
కుమతులకందరాని గురుగోప్యము దీని నెరుంగగోరియుఁ
విమలము విశ్వసింపు మదిపీడకనున్న విచారమేటికిఁ,

ఉ॥ కామవికారముల్ బహుళకాంక్షలకుఁ జొరబారునీవు నిఁ
బాములపాలుజేసుకొన భావ్యముగాదు గెల్వభవాబ్ధినీదగా
నీమముగల్గి కామమతి నీచమటంచు మదిందలంచియుఁ
స్వామిపదంబు లాత్మనిడ జన్మఫలంబని గాంచగావలెన్.

ఉ॥ ధర్మవిరుద్ధమౌ పనులఁదాల్చిన నీఖిలసంబువీడు నే
కర్మవిలక్షణుండు మృతకార్యములెల్లను గాంచుచుండఁగా
నిర్మలమెట్లుగల్గు నిక నీతివిధానము నేర్చియుండి నీ
జన్మము సఫలమౌను పరసౌఖ్యము జెందగవచ్చు దెలియుమా.

కం॥ నిన్నెరుగకున్న బోవునె
యెన్నటికీ మాయభ్రాంతి యెఱుగుము నీవే
కన్నంత గలుగుచుండును
భిన్నముగాజూడకున్న బ్రియముగు మనసా.

గీ॥ జీవునెరుగకున్న దేవునిగనలేవు
జీవభ్రాంతివీడ చిక్కులిడును
త్రోవగానకున్న భవమువీడదునీకు
కావరములబట్టి గాల్చవలదె.

చ॥ దినకరచంద్రవహ్నులకు తేజమొసంగుచు సర్వకాలముల్
జననవినాశముల్ గనక జాడయు దేదొ దెల్యరాక స
ద్ఘనమయ్యి దేశదేశములగల్గి వెలుంగుచునున్న చిన్మయుఁ
డనిశము గొల్వఁజూచుటయె మోక్షము రేమియు లేదు లేదికన్.

కం॥ నిజమెరయలేక భువిలో
గజిబిజియైకలువరింప కరుణాన్వితుడై
సుజనుల రక్షణజేయను
నిజరూపముదాల్చి గురుడు నిశ్చయపరచెన్.

కం॥ గురుడే పరుడని తెలియక
చరియించిన తెలియబోదు జననరహితమా
తెర వెవ్వడైన సద్గురు
మరుగెరిగినజాలు తత్వమార్గము దెలియున్.

కం॥ కవులన వేరెవరుందురు
కవితాకన్యకనుగాంచు కవులేకవులై
భువి వెలయుచుందురనుచును
కవులకు నేమ్రొక్కువాడ ఘనులనిమదిలోన్.

వచనము : అనియిట్లిష్టదేవతా ప్రార్థనంబును మహానీయుల గొనియాడుటయుగలిగి గురుశిష్య సంవాదరూపంబుగా నే యొనర్పంబూనిన గ్రంథమునకు కథాక్రమంబెట్లనిన.

కం॥ గురుశిష్యవరుల మార్గం
బరయన్ వశమౌనె పరమభాగ్యంబౌటన్
మరుగెరిగియున్న మాత్రము
పరమేశ్వరు కరుణచేత పరిశోధింతున్.

శా॥ లోకాధీశుని నామస్మరణ ముల్లోకంబులన్ శ్రద్ధచే
యేకాంతంబున జేయువారలుగదా యేబాధలున్ లేని సు
శ్లోకున్ జేరుట శుద్ధచింతనమునన్ శోధింపుమా ముక్తికై
యేకాలంబునుమర్వబోకుమెదుటన్ యేకాత్మ సేవించుటల్.

ఉ॥ వేదమయున్ దలంపుమిక వేదనలేమియు గానరావు నీ
కాదరణంబుగల్గు నిటు యాసనువీడి సుఖానుభూతికై
పాదుయిదే మరేమియును పద్ధతిగానము యెందుజూచినన్
మోదముతోడచిన్మయుని మ్రోలనునిల్చిభజింపుచుండుమా.

కం॥ సతతము సర్వేశ్వరుపద
హితమెఱిగినవారు పాపహీనంబౌ శ్రీ
పతిసేవ కర్హులగుదురు
పతనముగాకుండ మదిని బట్టుట మేలౌ.

కం॥ యెంతేయాపదగల్గిన
సుంతైనను వీడబోకు శుద్ధాత్ముని నీ
యంతరజ్ఞప్తిచె మరువక
సంతోషముగలిగి సర్వసాక్షినిగనుమా.

గీ॥ ఆదిమధ్యాంతరహితు నవ్యయుని కథలు
వినుచు మననంబొనర్చుచు విమలమతులు
గాంచగలరన్యభ్రాంతిని కడకుద్రోసి
పరమమైయున్న ప్రభులీలభావమందు.

మ॥ అనుమానంబొకయించుకేనిగలుగన్ ఆయాసమున్ జెంది చి
ద్ఘనుసేవారతి గానలేక భువిలో కల్పాంతమైయుండినన్
జననంబెత్తుట సత్యమంచు విషయజ్ఞానంబు వర్జించి నీ
మనమా యీశ్వరుసన్నిధిన్ నిలువగా మర్యాదయాదెలియుమా.

శా॥ ఆజ్ఞాబద్ధులు సర్వకాలములలో నాత్మానుసంధానమున్
సుజ్ఞానంబునుగూర్చి సత్త్వగుణులై సూత్రార్థముల్ దెలియు నా
ప్రజ్ఞన్ వీడక భక్తిశ్రద్ధ వెదలో బాపింప నిర్వాసనన్
యజ్ఞానంబున జేరకుండురవనిన్ యానందసంప్రాప్తులై.

ఉ॥ కోరిక దీర భాగవత కూటము జేరుచు సద్గుణంబులన్
గూరిచి కర్మబంధములు గూల్చి వివేకము గల్గి సర్వదా
భారము భక్తరంజనుని పాలొనరింపుచు నున్నవారికే
చేరువ ముక్తిమార్గమని జెప్పిరిగాదె బుధోత్తముల్ భువిన్.

ఉ॥ గాంచుము సర్వసాక్షి నిటు కాలము వ్యర్థము జేయకుండగన్
గొంచెపు వార్తలన్ వినకు కోవిదవంద్యుని సత్కథామృతం
బించుక గొన్న పాపములు భీతి యొకించుక లేదు నీవు నీ
వంచన లేక నవ్యయుని వాంచ చె నెంచి సుఖింపు మిమ్మోదన్.

సీ॥ మాయామయంబైన మహిమ నరయగలేక
ధ్యేయమా పరమాత్మ దెలియబడునె
సచ్చరిత్రుని కథలు సాటింపగలుగునా
తుచ్ఛమౌ విషయముల్ దొలగకున్న
సంచితాదులబట్టి సమయించుటదియెట్లు
కొంచెమౌ గుణములు గోయకున్న
నిత్యమౌ పరమార్థ నెళవెరింగెదమన్న
భృత్యత్వమమరక బోధపడునె

గీ॥ యున్నదున్నట్లుగనుగొను యూహలేక
యెన్నడైనను జగదీశు నెరుగగలెమె
గావునను భక్తపరిపాలు ఘనతగాంచి
సేవయొనరింప యఘములు జేరవెందు.

వచనము: యనుచు శిష్యునికి భక్తిమార్గము బోధింప సద్గురుమూర్తిని జేరి మహాత్మా—

కం॥ గురుశిష్యవరుల మార్గం
బెరిగించెడు వేత్తలనుచు బ్రియముచె మిము నే
శరణని వేడితి మీపద
సరసీరుహములకు మ్రొక్కి సద్గురువర్యా.

చ॥ తెలియనివాడ మీమహిమ దెలియగనంతటిశక్తి లేదు మీ
బలమె మహత్తరంబనుచు భావములోదగ జేర్చి మిమ్ము నే
దలచెద సంశయంబులను తప్పక దీర్చెదరంచు నమ్మియున్
ఫలమునుగోరమీకరుణ బంధవిముక్తియటంచు వేడెదన్.

కం॥ అనిశిష్యుడడుగగాగురు
డనె నో బ్రియవత్స నన్ను డాయుమునీకీ
ఘనమగు మార్గము దెల్పెద
విని నీమది సంశయములు విడువుమయిపుడే.

గీ॥ సత్యమైయున్న వాస్సుధా సారమయుడు
నిత్యసంతోషమునునుండు నెళవువాడు
పాపదూరుండు బహుశార్ధ భావయుతుడు
కృత్యమేమియు లేనట్టి గురుడు గురుడు.

కం॥ రాగ ద్వేషవిదూరుడు
యోగాత్ముండు శాంతరూప యోగ్యుడు విషయ
త్యాగముగల్గిన సద్యశు
డాగమపూజ్యుండు సుజను డాఢ్యుడు గురుడౌ.

మ॥ కరణత్రియములనొక్కరూపమున గాపాడుచూ తృప్తుడై
పురమందున్న నరణ్యమందునిలువన్ భూభాగమందుండినన్
విరజాజుల్ విలసిల్లు పాన్పుపయిన్ విశ్రాంతిగలిగున్న ది
త్తరి నీరీతి లభించెనంచు మదిలో తర్కింపడెట్లుండినన్.

గీ॥ హింసయేమియులేని సహింపుగలిగి
సంశయంబులు కడద్రోచి సాక్షియవుచు
సుఖము దుఃఖంబులొకరీతి జూచుచుండి
యఖిలవ్యవహారములు జరుపుచుందునతడు.

కం॥ కామాద్యరి వర్గంబుల
నీమంబునద్రోసి బ్రహ్మ నిష్టగలిగియున్
సామాన్య నరునిపోలిక
నీమహిలో దిరుగుచుండు నిర్మలుడౌచున్.

సీ॥ శుద్ధాత్ముడై యుండి శూన్యవాదంబుల
పద్ధతి నెరుగని పావనుండు
అన్యచింతనలేని యానందసంభోగి
ధన్యోహమనిదలచు ధార్మికుండు

దేహాత్మబుద్ధిని తెగనాడియుర్విలో
సాహసంబునదిరుగు సజ్జనుండు
కులము గురుకులమను గోప్యంబు నెరిగి యే
తలపులు లేనట్టి దైవసముడు

గీ॥ పరమపదవాసియై యున్న భాగవతుడు
నిరుపమానంద కళ్యాణ నిర్గుణుండు
కరుణగలిగియు కుపితుల గాచువాడు
ధరను వర్ణింపతరమౌనె గురునిమహిమ.

వచనము: యనుచు సద్గురుండు దెలుపగా విని దేవా! మీరానతిచ్చిన విధంబుననుండు సద్వంశుకాసద్గురువుల జేరి శిష్యుడెట్లువర్తింపవలెనో అతనిలక్షణంబు లెట్టివో విమర్శింప ప్రార్థింతునని: శిష్యునిలక్షణములు శిష్యుడేరీతి గురుని సేవింపవలెనో గురువరుండు దెలుపబూనెను——

గీ॥ గురునిజేర నెంచు గుణవంతుడగువాడు
నరయవలయుగురుని నడకలన్ని
మరుగుజేసుపిదప మర్యాద గాదిక
వెనుకజూడనదియె వెర్రితనము.

గీ॥ నూటిదప్పరాదు సుఖమెల్ల విడిపోవు
బాటదొలుగ పరము బాసియౌను
మాట వేరేలేదు మనసాకృరీతిగా
నాటియుండవలయు ననవరతము.

కం॥ సేవారతుఁడౌ వానికి
భావంబతిశుద్ధమగుచు బలమొనగూర్చున్
గావున గురుపదసేవను నీ
వెప్పుడు మరువబోకు నిశ్చలబుద్ధిన్.

కం॥ గురుడే మాతాపితరులు
గురుడే పరదైవమనుచు గొనియాడవలెన్
గురునకు సమమౌభాగ్యము
నరయంగా వశముగాదు నవనీస్థలిలోన్.

సీ॥ గురుపాదతీర్థంబు గ్రోలుచుండినగదా
పరమాత్మసన్నిధి బాయకుండ
గురుసుప్రసాదంబు గుడుచుచుండినగదా
ధరణిలోపరతత్వ దర్శనంబు
గురుధ్యానమును జేయ గూడియుండినగదా
పర మతచేతిదై బడయుటకును
గురుడేపరుండని గుర్తించుటయెగదా
అహమాదివృత్తుల నణచుటకును

గీ॥ ఇదియే వేదాంతసమ్మతం బిదిరహస్య
మిదియె సర్వోత్తమంబని యెరుగవలయు
యింతకంటెను దెలియు నదేమిగలదు
తెలిసి కృతకృత్యుడవుగమ్ము ధీవిచారా.

కం॥ గురుసేవ జేయగలిగిన
నరునకు బోధింపవలయు నవ్యయమౌ యా
పరమార్థ తత్వసంపద
నెరుగంగాతరమె తనకు నెళ్ళైయుంటన్.

కం॥ తన్ను దెలియకున్న తరియింప నేరడు
తన్ను దెల్పుగురుడు దైవమగును
భిన్నమైనవాని నెన్నడుజూడక
నున్నవారే పరము గన్నవారు.

వచనము: యనియును

మ॥ బలికిన వాక్యములెల్ల సిద్ధమని భావించిసద్భక్తితో
దెలియగనిశ్చయించి గురుదేవుని దివ్య పదారవిందముల్
దలచుచునీతిమార్గ మతిదాపునదాల్మి వహించిజూచుచున్
కలవరమెల్లమానియు నకల్పితుకారణమూర్తికిట్లనున్.

శా॥ దేవామీచరణాబ్జముల్ గొలువగా దివ్యాత్ములై నిత్యమౌ
కైవల్యంబును జేరనేర్తురనినే క్లైవారముల్ జేతు నా
భావంబవ్యయపదంబుగోరనిస్థితిన్ బ్రాపింపజేయన్ భువిన్
నీవేతప్ప మరెవ్వరున్ గలుగరో నిష్కామనిర్లేపకా.

ఉ॥ నీదయలేకమానసము నిత్యసుఖంబును జెందరానిదై
వేదనగల్గి భావమున వేమరదోచక నున్నదియ్యెడన్
సాధనతోడ నీచరణ సన్నిధిబాయక సంచరించు స
ద్బోధలో నిల్పవేడెదను పూర్ణుడవంచు దలంచిముక్తికై.

కం॥ సత్యాసత్యము లెట్టివొ
ప్రత్యక్షము గాను దెలియ బడుటకు భువిలో
శ్రుత్యర్థము లిటు దెల్పుము
భృత్యుడనౌ నాకు నీవె బోధింపవలెన్.

వచనము: అని యిట్లు పలువిధంబుల ప్రార్థించు శిష్యునిం గని సద్గురుండిట్లను బిడ్డా వినుము—

చ॥ పరమపదంబు జేరగల భాగ్యము దోచిన వారలెల్లరున్
విరివిగ దుర్బలంబులకు వీడులుగాగను పట్టు విషయముల్
మరచి విరాగమొంది బహుమానతిరస్కృతు లొక్క రీతిగా
నరయుచు నిర్భయంబునను నవ్యయు చింత ననారతంబునున్.

చ॥ వినునక జేయుగావలెను విశ్వములోగల సర్వభోగముల్
రసికులు మెచ్చ రాత్మసుఖ రక్షితమైనవి గావటంచు యే
వసతిని జూడబోకుము యవాంతరమై తుదముట్ట జేయు
నీ వ్యసనము మాని నిశ్చలత వ్యాపకు జేరి భజింపు చుండుమా.

ఉ॥ రాగము సర్వదుఃఖముల రాజయియుంచును రావణుండు మున్
రాగముగల్గి రాముశర రాశిని జిక్కి గతించెనంచు స
ద్భాగవతుల్ పురాణముల బల్కిన వాక్యములాలకించి వై
రాగ్యము బూని నిర్మల విరామము గల్గి సుఖింప మేలగున్.

సీ॥ వైరాగ్యమన సర్వవాంఛలు దిగనాడి
నిర్వాణపదవికి నెలవుగనుట
వైరాగ్యమభయమై వచ్చును తన వెంట
వైరాగ్యమద్భుత వైభవంబు

వైరాగ్యమునగాదె వసుధలో వేమన
వార్తకెక్కిభవంబు వాపికొనుట
వైరాగ్యసంపద వరక్కటిగలిగిన
భారంబులేదెట్టి బంధములలో

గీ॥ జేరకుండును నిజబోధ దారిగనును
గురునిపదపద్మములు హృదయ గుహానునిలుపు
మింతకంటెనుజేయ మరేమిగలదు
చింతలేకుండుటయెగదా చిత్తజయము.

వచనము: ఇట్లు వైరాగ్యమును బోధించి పిదప కర్మ
మును దెలువంబూనెను—

కం॥ కర్మమన పనికియర్థము
కర్మంబన మంచిచెడుల కారణమాటః
నిర్మలమొందెదు వారలు
ధర్మాదర్మంబులెరుగ దగునీభువిలోః.

కం॥ పాపము పుణ్యంబనుచును
లోపాలోపంబులెల్ల లోకులకెపుడుః
దాపయి దోచునువాటిని
కాపాడినవారుగాదె ఘనులనబడుటల్.

సీ॥ సత్కర్మవలనను దుష్కర్మదొలగును
దుష్కర్మమణగిన దోషమెడలు
దోషంబులేకున్న వేసటగలుగదు
వేసటలేకున్న వాసిగలుగు

భూషణంబులకిదె భూషణంబౌచు సం
తోషంబుగలిగించి తోడుపడును
పాపంబులేకున్న పరిశుద్ధహృదయులై
శ్రీపతిపదసేవ జేయుచుండి

గీ॥ సత్యసంకల్పులౌదురీ జగమునందు
భృత్యులై తాము పరమాత్మ బొందగోరి
కర్మసాక్షియటంచు సద్ధర్మమెల్ల
నొక్క వచియించు వాక్యంబు లెక్కగొనుచు.

గీ॥ భగవదర్పణబుద్ధితో భక్తిపరులు
నిత్యకర్మంబులొనరింప నియతిగలిగి
కామ్యమునుదూరపరచి నిష్కాములగుచు
పూజ్యులైయుందురానంద మూర్తిగాంచి.

వచనము: అందువలన సుకర్మ సకలశ్రేయోదాయ
మనియు, పాపరహితంబనియు కామ్యమునువదలి యీశ్వరా
ర్పిత బుద్ధితోజేయు సత్కర్మలెల్లను పునర్భవము గలుగుటకు
దారిలేనివనియు దెలిసి సజ్జనులగలసి భగవదారాధన జేయుచు
శక్తివంచనలేక నిష్కామ బుద్ధిగలిగి కార్యంబు లాచరింపు
చుండవలెను.

కం॥ సర్వార్థంబులకెల్లను
సర్వేశ్వరుపాదసేవ సార్థకమనుచున్
గర్వగ్రంధులుబాసియు
యుర్వీస్థలిలోనదిరుగ యూహింపవలెన్

కం॥ సాధనలు నాల్గుగలిగిన
మేధావికి బ్రహ్మబోధ మేలెరిగింపన్
సాధింపగలడు నీవిటు
శోధింపుము సాధనలను శుద్ధాత్ముడవై.

వచనము: అనుచు సాధనచతుష్టయ మెరిగించి మోక్షాసక్తుడై యున్న శిష్యునిజూచి వత్సా—

కం॥ మనసతిచలనంబైనది
పనిలేకను కుదురుపడదు పరిపరివిధమై
జను నీవిదిమరువక యా
వనజోదరు పాదములను వదలకుమెపుడున్.

వచనము: యీరీతి స్థిరపరచి తారకమంత్రోపదేశం బొనర్పదలచి—

సీ॥ అతిరహస్యంబైన హంసమంత్రము దెలియు
మతిమంతులాత్మార్థ మహిమగందు
రట్టిగాముసుపటి వేల్పులెల్లరు తాము
బాహ్యజప మొనరింప బంధమనును
ఆజపమంత్రము దెలిసి యానందప్రాప్తులై
విజితేంద్రియులు నాచు విశ్వమయుని
సాక్షిగాజూచుచు సర్వాత్ముడితడని
లక్షింపుచుంద్రు సురక్షితముగ

గీ॥ యితరమేమియుగానక మతినినిల్పి
దివసము రాత్రియుదెలియని తెరవుగలిగి
ముక్తిమార్గమిదేయను మురిపెమునను
వ్యక్తిగతులైరి విషయ విరక్తులౌచు.

గీ॥ తారకమంత్రమే ధన్యులజేయును
తారకమంత్రమే దైవసమము
తారకమెరిగిన దరిముట్టగలుగును
కోరిచూడనిదియె గోప్యమాను.

సీ॥ సకలపాపంబుల సమయింపజేయును
వికలతలనుబట్టి విరచివైచు
కృపజూపిపరమార్థ సఫలతనొందించు
అపరాధములనేమి అంటనివదు
తబ్బిబ్బుసేయక నిబ్బరంబుననుంచు
అబ్బినవారికి అనుభవంబు
ప్రత్యక్షమని దీని పరిపరివిధముల
శృత్యర్థములలోన జూపబడును

గీ॥ మరువకుండుము యీమంత్ర మనవరతము
భోగ్యమౌనీకు పరసుఖ భోగమిదియె
వినుకుజెందకుమెట్టి విపత్తునైన
జన్మదుఃఖంబు వదలింప జూడయువునూ.

కం॥ శివోహంబని యెల్లప్పుడు
భావంబుననుంచి దీనిభజియింపుచు యీ
తావునువీడకు మిదియే
కేవల బ్రహ్మానుభవముకీలెరిగించున్,

గీ॥

కం॥ నాసిక పుటములలోపల
వేసటలేనట్టిహంస విహరించెడు యు
భ్యాసము దెలిసినవారికి
మోసములేదెవుడు పరమ మోక్షార్హంబౌ.

కం॥

చ॥ కనులుగదల్పకుండియును గాలిమనస్సాకరూపమేర్పడన్
ఘనమనినిశ్చయించియిటు కాలముగడుపుచునున్న జాలు నీ
మనమతినిర్మలంబవును మాటలతోపనిలేదు పావనం
బని మది నెంచు మీనుజన బాంధవమేర్పడ భక్తిశ్రద్ధలన్.

కం॥

సీ॥ మనసుపరిశుద్ధమై మలినంబులేకున్న
ధనమనియార్యులు దలతురెపుడు
తొలిజన్మఫలమున దోచెనీసుఖమిందు
తలపుననుంచు మీదారివిడకు
ధన్యోహమనియును దార్మికులై యుండి
అన్యమెరుగనివారలైరి భువిని
చూపురూపాకటిగ దోపింపబడును యీ
ప్రాపకంబమరిన భక్తులకును

గీ॥

కం॥

సీ॥ చింతలెల్లనువిడిపోవు స్థిరతగలుగు
స్వాంతమానందపదవిలో సమతనొందు
యిదియె నిశ్చయమనిదెలియు మింతకంటె
వేరుగానముభువిలోన వెదుకవలదు.

కం॥ మనసన మాయన నొక్కటె
మనసే సర్వాధికారి మహిమలకెల్లన్
మానసును గెలిచెడుమార్గము
గనుమాయీమంత్రిరాజ ఘనమునువిడకన్.

కం॥ యీడాపింగళలందున
జోడుగవిహరించి యితరజోక్యమెరుగకన్
ఆడుచునుండినహంస తా
కూడికగలవారెపరము గోవిదులెలమిన్.

సీ॥ మేరుశిఖరమందు మెలగుసర్వాత్ముని
గోరిచూడ పరమగోప్యమైన
జాడదెలియబడును జననాంబుధినిదాట
పీడబోకుమిదియె వేడుకవును.

కం॥ ఎడతెగక నడుచుహంసను
వడివడిగాతిరుగ నీకవాంఛలువిడియున్
ముడిబొమలమధ్యదృష్టిని
దడయకనిల్పుటయెమంచి దారిదినుమిన్మా.

కం॥ నాదానందంబున యీ
మేదినిలోసంచరించు మెలుకువగని యా
మేధావు లాత్మసుఖమును
పాదుగగనగలరు సత్యభాషణులవుచున్.

సీ॥ ముక్తిమార్గముగాంచు మునిముఖ్యులీమంత్రి
శక్తిగలిగియు పరమసాధులవుచు
యితరమంత్రంబుల విధమెరుంగక విషయా
రతిగానకను మంత్రిరాజమిదియె
సుగతికిమూలమని జూచియుతృప్తులై
విగతకల్మషులగుచు వెలసిరవని
ఘనమైన యీమార్గమునకు మిగిలిన వేమి
గనబోకు మాయాసకరమునీకు

గీ॥ తెలివిగలిగినటించు వీరా తెరవువిడక
పలువిధంబుల వెదకిన ఫలములేదు
నిలకడకుమూలమై నీదు నెలవుజూపు
బలమొసంగియు బవమును బాపునిటులా.

వచనము: అనుచు తారకమంత్రముదెలిపి సాంఖ్యమును బోధింపనెంచి

కం॥ ఆదిపరబ్రహ్మమునన్
లేదని కలదనియుదెలియ లేనిమాయయే
పాదుగ దోచినదాయెను
సాధకులకు వ్యక్తమనుచు చాటెరిజగతిన్.

సీ॥ అవ్యక్తమున మహదహంకారమును బుట్టె
అహమున పంచతన్మాత్రలొదవె
పంచతన్మాత్రల పంచభూతములాయె
పంచభూతములచే బరగె జగము
జగమున దేవతా సంఘంబు వాదిగా
సకలజంతువులెల్ల సంభవించె
నని దెలుపు గురుదేవు నాశ్రయించిన
శిష్యుడనుమానమున గురుని యనుభవంబు

గీ॥ దెలియగోరియు వినయమున దేవదేవ
స్థూల సూక్ష్మాదులేరీతి సృష్టిదోచె
వరుసగా దెల్పుమయ్య నా వాంఛదీర
పరమపదవాస గురుదేవ భవవినాశ.

వచనము: అనిపలుక సద్గురుండిట్లనియె: పంచభూతంబులు వరుసగా ఆకాశము, వాయువు, నగ్ని, జలము, భూములై అందు ఆకాశము అర్ధము జ్ఞాతగా నిలిచి మిగిలిన భాగము వాయువు, నగ్ని, జల, భూములనుగూడి మనసు, బుద్ధి చిత్త మహంకారమనగలిగె, వాయువర్ధము వ్యానవాయువై శేషించు సగము ఆకాశాగ్ని, జలభూములగలసి సమాన ఉదాన ప్రాణ అపానములయ్యె. అగ్ని అర్ధభాగము చక్షువై, మిగతార్ధము ఆకాశ వాయువు జలభూములతో కలసి శ్రోత్ర, త్వక్కు, జిహ్వా ఘ్రాణంబులనబడియె—

జలమర్ధము రసమై మిగులుసగము ఆకాశ, వాయు నగ్ని భూముల మిశ్రమై శబ్ద, స్పర్శ, రూప, గంధంబులయ్యె. పృథివి అర్ధభాగము గుదమై మిగిలినసగము ఆకాశము, వాయు, వగ్ని, జలములతోఁగూడి వాక్కు, పాణిపాద గుహ్యములయ్యె నీరీతి పంచవింశతి తత్వములుఁగూడి స్థూలశరీరమాయెను.

పంచప్రాణములు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు. మనోబుద్ధులతో (17)పదిహేడుతత్వములుఁగల సూక్ష్మశరీరమై నిలచె. పై రెంటికి కారణమై సమస్తము తనలో నిముడ్చుకుని బీజాకృతిగా కారణశరీరమాయె—

౬౦॥ జీవబ్రహ్మములనుచును
కేవలమాత్మస్వరూపు క్రియలచె వేరే
భావము గలిగెనటంచును
యేవిధమున దెలియఁగలరో యెరిగింపఁగదే.

౬౧॥ సత్యాసత్యము లెట్టివో
ప్రత్యక్షముఁగాను దెలియ పడుటకుభువిలో
శ్రుత్యర్థము లెటుదెల్పను
భృత్యుఁడనో నాకునీవె బోధింపవలెన్.

వచనము: అనుచు సద్గురుమూర్తిని బహువిధంబుల ప్రార్థింప దయగలిగి నిత్యమాయాత్మను అనిత్యమా దేహేంద్రియాది సర్వప్రపంచమును వేర్వేరుగా విభజించి దెలుపం బూనెను—

సీ॥ జాగ్రతావస్థలో సకలమౌజగమును
తెలియంగబడును నీ తెలివిచేత
స్వప్నసుషుప్తిలో సమతయై సర్వంబు
తెలియంగబడును నీ తెలివిచేత
మూడవస్థలలోన మునిగినవిధమును
తెలియంగబడును నీ తెలివిచేత
తెలివినిదెలిసెడు తెలివి వేరిక లేదు
తెలివియేనన్నిటి దెలియబడును

గీ॥ ఒక్కరూపంబుగాయుండి పెక్కులైన
చిక్కులలోజేరకను తాను యెక్కువౌచు
దిక్కుగాయున్న తెలివియే దేవుడనియు
నిక్కముగ దెలియు నిదియె నిత్యత్వమౌను.

గీ॥ జాగరంబునదోచును సత్యముగను
స్వప్నమునదోచిత్తోచక సత్యమౌను
సుప్తియందేమిదోచని సుఖముగల్గు
నివి యవస్థలవిధమని నెరుగవలెను.

ఉ॥మాయ మనున్న యీస్థితిని మానసమాదిగనింద్రియావళుల్
కూరిమిగల్గియుండి యనుకూలముగా జరియించుచుం సదా
గారడిరీతియౌజగము కల్పనలం గనుచుండి భ్రాంతిచే
భారముదోచకుండియును బంధములం బడుచుండెజీవుడై.

వచనము: ఇట్లు ఒకప్పుడుండి మరొకప్పుడు పోవు
గల అవస్థాత్రయములలో దేహమే నేనను నజ్ఞానమున మాతృ
పితృ సతీసుతాదులే సత్యంబని జిక్కుబడి ధనాశక్తిఁ దవిలి.

గీ|| పాపపుణ్యంబులరయక బహుళమైన
తాపములగుంది ధనమె తన దైవమనుచు
కుపితులై కూడబెట్టుచు క్రూరకర్మ ల
పరిమితముత జేయుదు రల్పమతులు.

కం|| పరధర్మంబన నెట్టిదొ
తెరవించుక తెలియలేక తెలివిహీనతఁ
దురితాంబోనిధి జొచ్చియు
గిరగిర దిరుగంగబడిరి కీటకములుగా.

మ|| పరతత్త్వార్థము దెల్పు దేశికప్రభుఁ బ్రార్థించి యెల్లప్పుడుఁ
స్థిరచిత్తంబున నిల్పియున్న నరులఁ శిక్షించి సుగుణంబులొ
తెరవుఁ దెల్పుట కిచ్చయించి తొలుతఁ దివ్యార్థముల్ బల్కుచుఁ
దురితాంబోనిధి నీదజూపదయతో దోడ్పాటుగా యుండినఁ.

కం|| సచ్ఛిష్యుఁడార్తి బెనగొన
మచ్చికతో గురుని జేరి మన్ననతో నీ
తుచ్ఛపుభ్రాంతి దొలంగెడు
ముచ్చట వెరిగింపుమన్న మోదముతోడఁ.

కం॥ వినుమని బల్కదొడంగెను
తనుతాగనుగొనక యెంత తబ్బిబ్బైనన్
వెనుకటి భ్రాంతిని దొలగదు
గనుమా నిజమైన కార్య కారణమవనిన్.

కం॥ లక్షణములు దెలియవు మీ
రక్షణయే సర్వలోక రక్షితమనుచున్
దీక్షచె గాంధిజీ మీ పక్షమె
మాకభయమనుచు ప్రార్థింతురిలన్.

సీ॥ సద్గురుపాద కంజాతముల్ సేవించి
వారిచే నుపదేశ వర్తివగుచు
త్రివిధదీక్షలుపొంది భవములన్నియుకుంది
త్రివిధలక్ష్యార్థముల్ తెలియజూచి
త్రివిధవర్ణంబులని విధమంతయు దెలిసి
త్రివిధక్రియలను మదిద్రిప్పనీక
త్రివిధప్రసాదముల్ స్థిరముతిభుజియించి
త్రివిధసూత్రాచార సువిశేషముగ

గీ॥ దెలియకున్నను నద్వైతసుఖము గలుగ
నేరదు నిత్యాత్మ గనగ రాదు యనుచు
దెల్పిన గురుగుణమెంచి ధిక్కరించునట్టి
నరుసకుపచ్చు హేతువు వినుడిమీరు.

**టీక:** కావున సద్గురుపాదకంజాతములు సేవించి అనగా సద్గురువు అనగా పరమాత్మస్వరూపము. పాదములనగా సర్వప్రపంచము నడిపిస్తూవున్న బ్రహ్మశబ్ద శివాచ్యమైన హాంసః అనే రెండుఅక్షరములు. ఆపాదములు నడిచేమార్గమందున కంజాతములనగా ఆధార స్వాధిష్ఠ మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయములనే ఆరుచక్రములు. సేవించడము అనగా యీచక్రములమీదుగా నడుస్తూవుండేహాంసతో చేరి చలనములేకుండా మనస్సును ఆపాదములతో కూర్చి వుంచడమే సేవించడము. వారిచే నుపదేశవర్తియనగా మనో పవనములు రెండును ఒకటైనందున యీరెంటిని ఒకటిగా చేయడముతోనే అన్నమయాది పంచకోశములనె దేశములను విడచి వుపరియైన అచలస్వరూపమైయున్న వుపరి దేశమందు వర్తించడమె ఉపదేశమనేపేరు. త్రివిధ దీక్షలుపొంది భయములన్నియుకేంచి యనగా త్రి అనగా మూడు శబ్ద, దృష్టి, సంకల్పము. శబ్దములోయుండె అర్ధభేదములను విడచి సర్వశబ్దములు ప్రణవశబ్దముగా భావించడమే ఒకదీక్ష. దృష్టిగోచరమైన రూపభేదములను విడచి సర్వము పరమాత్మగా భావించడమే ఒకదీక్ష. సంకల్పమునబుట్టే సర్వకోరికలను విడచి మనస్సుప్రణవమునందుజేర్చివుంచడమెఒకదీక్ష. యీమూడుదీక్షలవలన భవ పుట్టడమనే పాపమునశించి శాశ్వతమైవుంటామని చెప్పుట. త్రివిధలక్ష్యార్ధముల్ తెలియజూచి అనగా అంతర్లక్ష్యము, మధ్యలక్ష్యము, బాహ్యలక్ష్యము అని కలవు. యీమూడింటికి సాకారలక్ష్యమును విడిచి నిరాకారభావము

చెప్పేదియేమంటె అంతర్లక్ష్యమనగా నేననే తెలివి శూన్య మనిన్ని, శూన్యమైన నావలనగలిగే వ్యాపారములు శూన్య మనిన్ని తోచేది అంతర్లక్ష్యం. మధ్యలక్ష్యమనగా సర్వప్రపం చము మాయఅనిన్ని మాయయనగా ఏమిలేదనిన్ని, యేమి తెలియనిదనిన్ని సర్వవేదాంత శాస్త్రములు నిశ్చయించి నందున యీదేహప్రాణేంద్రియములు నేనుకానేది మధ్య లక్ష్యం. బాహ్యలక్ష్యమనగా ఏకమేవద్వితీయమ్ బ్రహ్మ అనే ప్రమాణముచొప్పున యీ స్థావరజంగమాది సర్వప్రపంచ మున్ను ఒకట్టైయుండే యిమిడి ఒకటై యున్నందున ఒకటేయని చూడబడేది బాహ్యలక్ష్య త్రివిధవర్ణంబులు. వివిధమంతయుగన అనగా మూడుఅక్షరములు. మూడు అక్షర ములు అనగా అకారము ఉకారము మకారములు. యిదే రాజస సాత్విక తామసములు. యిదే నాద బిందు కళలు. నాదమనగా శబ్దము. బిందువు అనగా బ్రహ్మ. కళ అనగా చూపు. వీటిలోయున్న అనేకవిధములైన నామరూపకోరికలను విడచి సర్వం కల్పితం బ్రహ్మఅనే శ్రుతిప్రమాణమునుబట్టి సర్వమునః కల్పితమనియెంచి మనస్సు మాయగాయెంచి నాదబిందుకళా తీతుడైన ఆత్మ ఒకటిగా భావించినదే త్రివిధ వర్ణముల భావము. త్రివిధక్రియలను మదిదిరుగనివక 'త్రి'అనగా మూడు క్రియలు. అనగా చేసేవ్యవహారములకు పేర్లు. మూడువ్యవహార ములు యేవి యేవియనిన కన్నులతో చూచేదిన్ని చెవులతో వినేదిన్ని మనసుతో సంకల్పించేదిన్ని యీ మూడింటిచేత నున్న మాయారూపమైన జగత్తు సత్యమని తోస్తున్నది.

గనుక శ్లో॥ సత్యంజనవిరోధాయ అసత్యంజనరంజకం జనకం-
అనియున్నదిగనుక సత్యమైన పరమాత్మయనగా దృక్కు, శబ్ద,
సంకల్పములచేత నిర్వికల్ప ఏకోనారాయణ అని స్మృతి ప్రమా
ణము గనుక పుట్టిన వస్తువున్నూ, మారుచున్న వస్తువు
న్నూ విన్నశబ్ద వస్తువున్నూ పలికినపలుకున్ను పరమా
త్మనిగా భావించడమె. అయలతో మనస్సు తిరుగకుండా
పట్టుట త్రివిధప్రసాదములు. స్థిరమతిభుజియించి అనగా

శ్లో॥ గురుపాదోదకం పీత్వా గురోరుచ్ఛిష్టానభోజనం
గురుమూర్తిసదాధ్యాయే గురుమంత్రముసదాబిపేత్.

యిందు అర్థం గురుపాదోదకం పీత్వా గురువాచకం శ్రేష్టవా
చకం గురోరధికం అన్నారుగనుక గురువు అనగా సర్వప్ర
పంచాతీతుడైన పరమాత్మ. ఆపరమాత్మకు పాదములు అనగా
ఏ ఆదారములతో నడుస్తూవున్నాడో అట్టి పాదాక్షరములకు

శ్లో॥ ఏకాక్షరుద్వయాక్షరం వామదాక్షరం మధాపివా
అష్టాక్షరంమమోదాం మంత్రయోగఫలంభవేత్.

అన్నాడుగనుక అట్టి మంత్రాక్షరములు రెండున్నూ వాని
పాదములు. అట్టిపాదములవలన జారుతువున్న వుదకముఅనగా
అకార ఉకార మకారములవలన త్రిగుణములవలనగలిగే సర్వ
ప్రపంచము మనస్సన్ని, అట్టిమనస్సును బహిరంతరమున
తిరుగనివ్వక తానయిన రెండక్షరములతో యిమిడింప చేసు
కొనడమే గురుపాదోదకమును పుచ్చుకోవడము. గురు వుచ్ఛి
ష్టాన్నభోజనం- గురువనగా పరమాత్మడు.

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మం తస్మైశ్రీగురువేనమః.

అన్నాడుగనుక ఆపరబ్రహ్మ విడిచిపెట్టినదే ఉచ్ఛిష్టాన్న భోజనము గనుక నేతినేతి మహావాక్యములచేత అయు కాదన డమే ఉచ్ఛిష్టభోజనము. గురుమూర్తి సదాధ్యాయే అనగా ముట్టిన చూచిన మూర్కొన్న విన్నను పలికిన బ్రహ్మమై బరగవలయు అని పెద్దలవాక్యములు. కాబట్టి సత్తాద్వయము లేనందున సర్వము ఒక్కటియని మనశ్శుద్ధిని చేసుకోవడమే ధ్యానముచేయుట. గురుమంత్రము జపమనగా ప్రకృతియన వాశబ్దము సోహం అని గీర్వాణవాక్యముచేతనీ వేనేను అని పలుకుచున్న సాధారణమును గురుముఖముగా మరతెలిసి తిరుగదీసి నీ హంసనుజేసి నాదు బిందు కళలు అందునజేర్చి ఆకాలమునందు పుట్టిననాదమును జపించుటె సదాగురుమంత్ర జపము. వాసుదేవసర్వమితి సమహాత్మా సుదుర్లభః, అని భగవద్వాక్యము ప్రమాణముగనుక త్రివిధసూత్రాచార మవి రళముగ అనగ 'ఆత్మసత్యం జగన్మిథ్య సోయం దేవదత్తః' సో అనగా అచలమనిన్ని, అయం అనగా ప్రకృతియనే ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసము అనగా మనస్సనిన్ని, ఆవాయువులోనే పుట్టిన దనిన్ని గురుసంధిని అభేదముగలిగితే ఆత్మస్వరూపం తానే ననిన్ని, మహావాక్యార్థం. 'సో' నీవు 'అయం' నేను తెలివిని గూర్చి 'దత్తః' యివ్వబడెను. 'గంగాయాం గోషః' అనగా గంగలో గొల్లపల్లె ఉన్నదనే అర్థంకాదు. లోక సాధారణ వాక్యము. తాముమునిగినదేగంగ తావలసినదేరంభ అనగా

ప్రాణముకంటె తీపిలేదు గనుక ప్రాణముఅనగా ప్రకృతి. ప్రకృతియనగా స్త్రీ కాబట్టి తావలసినదిరంభ యిది జహార్లక్ష్యం 'జ'అంటేపుట్టినదానికి పేరు. ఏమిపుట్టినది 'హా'పుట్టినది 'హా' అనగా ప్రకృతి ఆలక్షణమనగా దానవలన పుట్టబడిన సర్వ ప్రపంచము జహార్లక్ష్యం అనుట. అజహార్లక్షణమనగా 'అజః' అనగా పుట్టలేదని అర్థం. ఆదిమధ్యాంతశూన్యంబని పరబ్రహ్మము చెప్పబడినది. యిందుకు లక్షణమేమంటె జహార్లక్షణమును విడిచి అజహార్లక్షణం పుచ్చుకోవడమే లక్షణము. యేమంటే

శ్లో॥ అశరీరం సర్వదానాస్తి శరీరరహితం
సదా యదమేన సదాముక్తి సర్వదా॥

సర్వదా భ్రమకారణము అనే న్యాయమే లక్షణం. గుడ్డులో పిల్లకు పాపపుణ్యములు కలవని యేశాస్త్రము చెప్పదుగనుక అజహార్లక్షణమని తెలిసేది యిందుకు ప్రమాణము 'సత్యజ్ఞానమనంత మానందం బ్రహ్మ'అనే ప్రమాణముచొప్పున మాయ పుట్టినది అని చెప్పరాదు, నేమి చెప్పవలెననిన మాయఅనే చెప్పవలెను. మాయఅయినప్పుడు మాయకు కార్యము ఒకటి కలదా యిందువలన యేమాయనంటే జగత్తు అనే శబ్దము లేనట్టాయెను. 'యేకమేవాద్వితీయం బ్రహ్మ సర్వం ఖల్విదం బ్రహ్మం' అనేఅర్థము నిలుచును.

---

# మంగళహారతి

మంగాళమనిపాడరె శ్రీగురునకు ॥మం॥

మంగళమనిపాడి మహనీయమైయున్న రంగూగతిక్రూట సౌధమందునలిచి ॥మం॥

తొమ్మిది ద్వారములుమూసియు యాకాయమందున రెంటి ఒకటిగ జేసియుంచియు దనరుగను ఆజ్ఞేయమందున దృష్టిచెదరకుండమెప్పుడు సదయుడగు శ్రీ గురుస్వామికి జోడుమంగళహారతీ యని ॥మం॥

పరమపదమిదె యంచుదెల్పుచును ఖాశింవలీషాఖాదరై బోధింపుచును నింగికవ్వల ఏకరూపై భంగమేమియు లేదటంచును వప్పగాదరియాకు వేగమె ఘట్టిగాబోధించుస్వామికి ॥మం॥

—: గద్య :—

ఇది శ్రీ దరిహుశేన వలీ షా ఖాదరి దేశిక సుజ్ఞాన సుత శ్రీ ఖాశీం వలీషా ఖాదరి దేశిక ప్రణీతంబైన పరమామృతంబను గ్రంథంబునందు గురుశిష్యసంవాదము సమాప్తము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# శ్రీ రామ శతకము.

కం॥ శ్రీమన్నారాయణ యని
నీమంబున నిన్నుదలతు నిర్మలచరితా
సామజ వరదుడవీవే
కామాద్యరి వర్గదూర కావవె రామా. 1

కం॥ నీనామ జపము సేయుట
యేనాటికి బోవుగావె యిడుములుభువిలో
శ్రీనాథ నిన్నుగొలుచుట
నానాటికి వృద్ధిజేయ నమ్మితిరామా. 2

కం॥ అతిమోదంబున నీవే
గతియని నాహృదయమందు గలవనియును నే
సతతము నిల్పితి నిన్నే
పతితుని ననుజేయబోకు పావనరామా. 3

కం॥ భువనంబుల సృష్టించియు
భువనంబుల వృద్ధిజేయు భువనాకారా
వివరము దెలియనివాడను
స్తవమే నాధనమటంచు చాటితిరామా. 4

కం॥ అర్థము దెలియనివాడను
స్వార్థమునకు జూడలేదు సర్వార్థంబుల్
వర్థిలునని నినుదలచెదు
అర్థులగని నమ్మినాడ నవ్యయ రామా. 5

కం॥ ఆపదలకు మూలంబౌ
తాపంబులు జెందలేక తాలిమిజూపే
నీపై దృష్టినిగూర్చితి
పాపోవుట దగదటంచు వాంఛతో రామా. 6

కం॥ ఖండితముగ నినుబుధులు య
ఖండుడవని పలికి సకలకార్యంబులు
నీయండను జేరియు చేయుట
దండితనంబనుచు మదిని దలతును రామా. 7

కం॥ కలిని నివారించుటకును
యిలలో నీనామస్మరణ మింతయె చాలున్
కలవర పడ పనిలేదని
పలికిన వాక్యములనినమ్మి బ్రతికెద రామా. 8

కం॥ దేహంబస్థిరమనియును
దేహియె స్థిరమనుచు దెలిసి దేహములో
నా దేహియె నేనని నను నే
యూహింపుచు నిన్ను గొల్తు యోర్పున రామా. 9

క॥ దొరికెను నినుభజియించుట
వెరపేమియు లేదటంచు వేడుకతోడన్
మరువక నీచరణంబులు
శిరమున దాల్చితిని నన్ను చేకొను రామా. 10

క॥ మృత్యువు దాపై యుండుట
ప్రత్యక్షముగాను దోచబడుట యెరిగి నీ
భృత్యుడనై నిను వేడితి
సత్యాత్మా నన్ను బ్రోవ సాక్షివి రామా. 11

క॥ పాపంబులెన్నో జేసితి
కోపింపగవలదు నన్ను కోవిదవంద్యా
నాపై నేరము లెంచక
కాపాడుట కెవరుగలరు కరుణచె రామా. 12

క॥ దుర్వ్యసనంబులనే మా
ధుర్యంబని తెలివిలేని ధూర్తుడనౌచున్
యుర్విన్ దిరిగితి చపలత
గర్వగ్రంధులను బాపి గావుము రామా. 13

క॥ వ్యాధుల జిక్కి శరీరము
బాధలపాలౌనటంచు భావింపకనే
మేధావినవలెను దిరిగితి
నాదారియె దెలియబడని నటుడను రామా. 14

కం॥ చాలును యిహసౌఖ్యంబులు
బేలతనంబాయె మాయభేషజములచే
కాలుని బారికిదోయక
మేలగు నీ మరుగుజూప మేటివిరామా. 15

కం॥ ఈషణత్రియములజిక్కియు
రోషంబున దిరుగుటెల్ల రోతయెగాదా
భూషితమవునే తుదకివి
దూషితములుగావెనాకు దోడ్పడురామా. 16

కం॥ జననంబాదిగనీపద
వనజంబులు గొలువలేక వనరుటగలిగెన్
ఘనమా నీదయజూపియు
ననుబ్రోచెదవనుచునిన్ను నమ్మితిరామా. 17

కం॥ తప్పులు సవరించుటకై
గొప్పలు మీకంటెభువిని కోరినగలరే
యిప్పుడె నానేరములను
తప్పకదీర్చినను నేను ధన్యుడరామా. 18

కం॥ విజితేంద్రియులకు నీపద
భజనం బతి సులభమయిన పద్ధతియనుచున్
సుజనులు దెల్పగనదియే
నిజమని నాహృదయమునను నిలిపితిరామా. 19

క॥ ఇహచింత లెల్లవీడియు
సహనంబున నిన్నుగొల్చు సాధుజనులకున్
అహమణగి నిత్యసుఖమున
విహరింతురటంచు నిన్ను వేడితి రామా. 20

క॥ గుణముల పోబడి గాంచుచు
గుణవర్జితమైన నిన్ను గుర్తింపుచు స
ద్గుణములు గలిగిన వారలు
అణుమాత్రంబైన మాయ నంటరు రామా. 21

క॥ చింతలచే చెడు మనసును
పంతంబున బట్టి త్రిప్పి భక్తిచె నిన్నే
చింతన జేయుచు నుండిన
సంతోషం బమరి మాయ సడుయురు రామా. 22

క॥ లోకభ్రాంతిని జేరియు
చీకాకును జెందకెపుడు చిడిముడిపడకన్
యాకొని నీకథలను విన
సాకేదవని వింటినిదియె సత్యము రామా. 23

క॥ ధన జన యువ్వనములను
వెనుదీయుచు నిన్ను గొల్చి నేర్తలు భువిలో
అనుమాన మేమిలేకను
నినుజేరుదు రన్యములను నెరుగక రామా. 24

కం॥ భక్తార్తి భంజనుడవై
ముక్తిని సమకూర్చనీవె మూలంబని యా
సక్తిచె నినుగొనియాడెద
రిక్తుని నను జేయబోకు రిపుహరరామా. 25

కం॥ దండిగ నీకథలనువిని
పండితులకు భావమందు పరమాత్ముడవై
అండగ దండగ నుండియు
ఖండింతువుగాదె వారి కలుషము రామా. 26

కం॥ విజ్ఞుల హృదయములోపల
ప్రజ్ఞానంబునను నీవు బయలుపడుచు నీ
సౌజ్ఞచె నాడించెద విటు
సుజ్ఞానుల జేయుటకును సుఖముగ రామా. 27

కం॥ టూటోటుమాటలాడిన
బూటకి మేగాని దాని పుణ్యంబవునా
యేటికి వ్యర్థపువాక్యము
చాటుటయని నీదు స్మరణ జరిపెద రామా. 28

కం॥ సజ్జనులను జేరియు నీ
పజ్జను నిలచినను పరమభాగ్యంబనుచున్
యిజ్జగమున బుధులెల్లరు
లజ్జింపగ నిల్పిరెపుడు లక్ష్యము రామా. 29

క౦॥ రాగ ద్వేషములనువిడి
యోగానందమును జెందు యోగీశ్వరులౕ
బాగుగ నీలోఁగలిపియు
భోగ౦బుల దేల్తువయ్య భువిలోఁ రామా. 30

క౦॥ ధర్మాధర్మము లెరిగిన
నిర్మలుఁలను గాచునట్టి నిపుణతనీదే
మర్మము లేకను భక్తుల
కర్మములను గొలుచునట్టి ఘనుడవు రామా. 31

క౦॥ తులలేని నీదునామము
దలచెడు ధన్యాత్ములకును దారియొసంగుౕ
చులకనయని జూచెడు యా
కలవరమతు లెట్లునిన్ను గాంతురు రామా. 32

క౦॥ నిరతము నీస్మరణామృత
మరసియు పానంబుజేయు మానవులిలలోఁ
తిరిగియు జన్మముగలుగని
తెర వెరగిన వారలనుచు దెలియును రామా. 33

క౦॥ నినుజేర దలచువారలు
వెనుకటి పాపముఁ జూచి వెరువక ననిశం
బనుమానమేమి లేకను
వినయవిధేయతను నిన్ను వెదకిరి రామా. 34

కం॥ చేతనరూపంబున బ్ర
ఖ్యాతివహించియును సర్వకారణమౌచున్
నాతియు పురుషులుగాకను
జ్యోతిగ వెలిగెదవటంచు జూతురు రామా. 35

కం॥ జడమతులకు దెలియని నీ
కడుగోప్యంబైనవిధము గాంచుటతరమా
యిడుముల పాలౌమాయను
గడచిన సమరసులెనిన్ను గందురు రామా. 36

కం॥ అనుభవ పరులే నీకథ
వినదలతురు వేడ్కతోడ వివశులునౌచున్
అనుమానమెంతమాత్రము
మనమునదోచినను నిన్ను మరతురు రామా. 37

కం॥ అంతరజ్ఞప్తిచే తమలో
నెంతో సంతోషమునను నేర్పరులవుచున్
చింతన జేసినవారల
చెంతనునిలచియును నీలో జేర్తువు రామా. 38

కం॥ విచ్చలవిడిగా దిరిగెడు
తుచ్ఛపు బుద్ధియునుగలుగ దొరకదుగద నీ
స్వచ్ఛతగల నిజరూపము
సచ్చరితా నాకుజూపి సాకుము రామా. 39

కం॥ కాదని వాదించుటయును
లేదని చింతించుటయును లేశము లేకన్
పాదుగ నీపదపద్మము
లాదరమని దెలియువార లధికులు రామా. 40

కం॥ విన్నవి కన్నవి సున్నని
తిన్నగ దెలియంగబడెను ధీరులు తమలో
నిన్నే భావింపుచు తమ
యున్నతమును వదలరెపుడు యుర్విని రామా. 41

కం॥ అధికుడనని వర్తింపుచు
బధిరునివలె దిరుగువెల్ల బంధంబనుచున్
విధివిధ మెరుగుచు నిన్నే
యధికుడవని దలతు రెపుడు యాత్మలో రామా. 42

కం॥ మనసే సంసారంబని
మును జను మహనీయులెల్ల మూలంబా యా
మనసును వశపరచుక ఘ
నపదవిని గాంతురనుచు కంటిని రామా. 43

కం॥ వివిధోపాయంబుల మీ
సువిచారము జేయుగల్గు సుజనులు ధాత్రిన్
అవిరళ సుఖమును గందురు
వివరింపగ నిదియె మంచి విధమని రామా. 44

కం॥ మోక్షేచ్ఛ గలుగువారలు
సాక్షాత్కారులవుచు నీదు సన్నిధిలోనన్
రక్షింపబడుదురఖిలము
పేక్షింపుచును నధిక ప్రియమున రామా. 45

కం॥ అన్యమెరుంగక నీవే
మాన్యుడవని జూచుచుండు మానవులకు నీ
వన్యము లేకను దోతువు
ధన్యులు విడనాడనట్టి దారిది రామా. 46

కం॥ దినదిన మాయువు క్షీణం
బని దెలియును భక్తిగలుగు బాలుండైనన్
జను కాల మేలవచ్చును
ఘనమని నినుగొలువలేని కాలము రామా. 47

కం॥ కాలము వచ్చును పోవును
యేలీలన్ గలదో దాని నెఱుగక వశమా
తాలాయె జగమటంచును
మేలుగ నినుజేరుటెల్ల మెళుకువ రామా. 48

కం॥ చిత్తరువుగావె తనువులు
తత్తరపడి మోహమొంద తథ్యంబవునా
యుత్తరి నీవే నిజమని
సత్తగు నినుదెలియువారె సాధ్యులు రామా. 49

కం॥ భవ జలధి దాటువారలు
చవిగొని నీనామజపము సార్థకమనుచుఁ
వివరించి యితరమొల్లక
భువిలో నీభజనజేయు చూనిరిరామా. 50

కం॥ రాజాధి రాజులును నిను
పూజింపుచు స్మరణజేయు చూనినగాదే
రాజితమా నీచరణ స
రోజములను జేరగలుగు రాఘులురామా. 51

కం॥ రసపూరితమా నీకథ ల
సమానం బనుచుబుధులు లక్ష్యములోనఁ
వినువక నిల్పిరియనిశము
వశమా సామాన్యులెన్న వసుధనురామా. 52

కం॥ తండోపతండములు నీ
యండనుజేరుటకు భువిని యాసించియు ను
ద్దండత భజనల జేయుచు
నుండియు నినుగొలువలేక నోడిరిరామా. 53

కం॥ రావే ననుపోషించుటకును
రావే నీ కరుణజూపి రక్షించుటకుఁ
నీవేగాకను యితరులు
బ్రోవ మరెవ్వరునుగలరు పుణ్యులురామా. 54

కం॥ మతిమంతు లాత్మవేత్తలు
శ్రుతిసిద్ధంబైన నీదు శుభచరితంబున్
హితవుగ తమలోనిల్పియు
నుతియింపుచు వెరపులేక నుండిరిరామా. 55

కం॥ కలలోగాంచెడు కలిమిని
యిలలో నిజమనుచుజూడ యింగితమౌనా
నిలకడ లేనిజగంబును
కలదని దలపోయుటెల్ల కలయేరామా. 56

కం॥ విన్నపమాలింపుము యా
పన్నశరణ్యుడవీవె పాపహరణ నీ
కన్నను దిక్కెవరని నిను
సన్నుతిజేయుదును నన్ను సాకుము రామా. 57

కం॥ దూరము జేయకు తండ్రి
సారెకు మీనామస్మరణ జరిపెదునాపై
భారము మీదేయనుచును
కోరితి మీకరుణజూపు కొరకై రామా. 58

కం॥ అపరిమితానందంబున
నిపుణతగల నీతిపరులు నిత్యసుఖమునన్
చపలత లేకను మెలగుట
విపరీతము గాదు నీదు వినుతిచె రామా. 59

కం॥ జగదాధారుడవని నిను
అగణితముగ సురులు మునులు యార్తిచెగొలవన్
దిగనాడి బ్రోవకుంటివె
పగగలదా నీకు ధనుడు పావనరామా. 60

కం॥ ఆధార మెవరులేరని
వేదనపడ నేల వేదవేద్యుడవవుచున్
నీదయ జూపుదువయ్యా
మేదినిలో భక్తులకును మేటివిరామా. 61

కం॥ ఎందరు మీసేవకులై
యుందురో లెక్కింపతరమె యుర్వీస్థలిపై
అందరిలో నేనొక డను
నిందితుడను నిన్ను గొలువ నేర్తునరామా. 62

కం॥ దుర్భావ లాడుచుండియు
నిర్భయముగ నిన్ను బొగడ నేరకనిటులన్
నిర్భాగ్యుడనై యుంటిని
అర్భకుడను నన్ను బ్రోవు మాత్మారామా. 63

కం॥ ఒక్కపుడు నిన్ను జూచుచు
మిక్కిలిసంతోషమునను మీరియు నీవే
దిక్కని నమ్మకతో నిం
కొక్కటి గనలేకనుందు కృపగను రామా. 64

కం॥ సంకల్పసాక్షివని నీ
వంకను జూచుచును సకలవాంఛలుడిగి యే
ఝుంకును లేకను నీపద
వంకేరుహములను యెపుడు బాయను రామా. 65

కం॥ మరణము జెందెడు వేళలో
కరుణామయ నిన్ను వేడ గలనో లేనో
తరుణము వ్యర్థము జేయుట
సరిగాదని యిపుడెదలుచ సాగితి రామా. 66

కం॥ జరయును మృతియునుగల య
స్థిరతనువులఁ జూచి నివియె స్థిరమనిదలచే
నరులెరుగగలరె నీదగు
మరణము జననమును లేని మహిమను రామా. 67

కం॥ జలబుద్బుదముల రీతిని
నిలవని యీతనువులెట్లు నిలచును ధాత్రిన్
తలపుల నీ నిజతత్త్వము
మెళుకువగా దెలియజేయు మేటివి రామా. 68

కం॥ జగదాకారము దాల్చిన
నిగమాధిప నిన్ను దెలియ నేరని నాపై
పగబూన వలదు దేవా
వెగటుగ ననుజూడ నెవరి వేడుదు రామా. 69

క॥ రూపలేని స్వరూపము
రూపించుట కెవరుగలరు రూఢులు నీవే
ప్రాపకమని మదినెంచియు
తాపసులెల్లరును నిన్ను దలతురు రామా. 70

క॥ రట్టడిపాలొనరించెడు యీ
కట్టడియా మాయయెంత ఘనులనునైనన్
యిట్టట్టు జేయుచుండు న
ఘట్టిగ నినుదలచలేని కతమున రామా. 71

క॥ జప తప దానంబులు నీ
కృపగలుఁగుటకొఱకు సకల కోర్కెలుఁడిగి యే
విపరీతములకు బోకను
నిపుణులునై నిన్నుగొల్వ నేర్చిరి రామా. 72

క॥ తల్లివి దండ్రివి దాతవు
యెల్లజగంబులకు నీవే యేలికవనుచున్
యుల్లమున దలచుచుందును
చల్లని దయజూపిబ్రోవు చక్కగ రామా. 73

క॥ ఏకాంత వాసులెల్లరు
నైకొని మీనామస్మరణ గావించుటకై
చీకాకులేక నెప్పుడు
ఏకాకారమున మిమ్ము వేడితి రామా. 74

కం॥ భక్తులు నీపదభజనయె
ముక్తికి మార్గంబటంచు మురయుచు నెపుడున్
శక్తికి వంచనలేకను
భక్తిచె జేయంగ గలరు భయమున రామా. 75

కం॥ ఆనందమొంది నిరతము
బూనందగు కార్యమిదియె పుణ్యులకనుచున్
పూనిరి నినుగొలుచుట కను
మానిత గుణధుర్య భక్త మానసరామా. 76

కం॥ దుర్వార్త లేవి వినకను
సర్వాధారంబునైన సత్యచరిత్రం
బుర్విని వినదలచియు తమ
గర్వంబులు దృంచిరంత ఘనులై రామా. 77

కం॥ అత్యాదరంబునను నీ
భృత్యులు నినుజేరి సర్వపూజ్యుడవనుచున్
నిత్యము నిన్నే గొలుచుచు
సత్యము విడనాడరెపుడు జగతిని రామా. 78

కం॥ వ్యర్ధము జేయక కాలము
సార్ధకమై భవముగడచు సాధ్యపువనులన్
నిర్ధయుడవనియు దలపక
అర్ధులజేయుదురుగాదె అవనిలో రామా. 79

క॥ ఎంతో యాపదలొచ్చిన
చింతింపక యాత్మసుఖము చెడకను విజ్ఞుల్
సంతోషంబున నిన్నే
చింతన జేయుదురు ధాత్రి శ్రేష్ఠులు రామా. 80

క॥ భద్రముగా నినుబుధులిల
చిందాత్రిపుడ వాటదెలసి చిన్మయులౌచుక్
ముద్రల కావల వెలిగెడు
సద్రూపము గాంచుచుంద్రు సత్యము రామా. 81

క॥ దృష్టికి వెలుపల లోపల
స్పష్టంబై యున్న నిన్ను సాధ్యమెదెలియక్
యిష్టా యిష్టములుడుగు య
దృష్టులకే గాకయెట్లు దొరుకును రామా. 82

క॥ సిద్ధులు నినుసేవించుట
శుద్ధంబని యితరములను శోధింపక నీ
వద్దను జేరియు నిరతము
వద్దికతో నీదుస్మరణ వదలరు రామా. 83

క॥ తత్త్వాపేక్షతొ నరులతి
సత్త్వంబును సాధనముగ సమమతులవుచుక్
తత్త్వముగందురు మహ నీ
యత్త్వంబని బలికిరవని యధికులు రామా. 84

కం॥ యితరేచ్ఛమాని నీవే
గతియని దలఁపోయువారి కలుషములెల్లన్
హితవుగ ఖండించెదవట
మతిసంతసులు బలుకవింటి మహిలో రామా. ౮౫

కం॥ నీ దాసదాసుడను నే
సాధనములు లేవు నిన్ను సాధించుటకున్
మోదముతో నీస్మరణయె
సాధకమని నమ్మినాడ సతతము రామా. 86

కం॥ అజ్ఞానపశులు నినుగను
సుజ్ఞానము బడయకున్న సుఖరూపంబౌ
సౌజ్ఞ లభించునె భువిని ర
సజ్ఞతగాదనుచుబుధులు చాటిరి రామా. 87

కం॥ తెలిసెదనన వశమానా
తెలివియె దేవుండటంచు దెలుపుట వినమే
తులలేని నీదురూపము
తలపుడిగిన వారికలవి తథ్యము రామా. 88

కం॥ తుదమొదలన వశపడకను
సదయుల దయవలనదెలియ సాధ్యంబనుచున్
మొదలిటి వేల్పులు వరుసను
వదలక గురుదేవు కరుణ వడసిరి రామా. 89

కం॥ కార్యము గనుపడుచుండును
కార్యమునకు కారణంబు గనరాదెందుఁ
కార్యము కారణమెరుగుట
ఆర్యుల కృపవలనగాదె యవనిలో రామా. 90

కం॥ జగతికి కారణమని నిను
నిగమాగమ వాక్యములచె నెరుగగ తమలో
గగనాంశ మైనశబ్దము
సుగతికి మార్గంబటంచు జూచిరి రామా. 91

కం॥ కారణము లేక కార్యము
వేరుగ లేదనుచు వేదవేద్యుడవవు నీ
భారమె యీజగమనుచును
ధీరులు వెదకియును నిన్ను దెలసిరి రామా. 92

కం॥ జీవుని దెలిసినవారలె
దేవుడవౌ నిన్ను దెలియ తెరవనిబలుకఁ
జీవుని గనుగొన నెంచిన
త్రోవను జూపంగ గురుడు తోడ్పడు రామా. 93

కం॥ భువనాకారము దాల్చియు
భువనములకు వేరుగాక భువనాకృతికిఁ
దవులక నిలచిననిన్నే
స్తవమొనరించుటచె బుధులు ధన్యులు రామా. 94

కం॥ చక్రాకారము గలిగియు
వికృతులను జూపునట్టి విశ్వమునీలో
సుకృతులు గందురు తమలో
ప్రకృతిని దిగనాడి భవము బాయగ రామా. 95

కం॥ వచ్చుచు పోవుచునుండియు
సచ్చరితులు దెలియగల యసాధ్యపు కాలం
బెచ్చట లయమగునో యా
ముచ్చట దెలుపంగనీవె మూలము రామా. 96

కం॥ నీవారశూకమున సిను
దేహాకృతిగానుజూచు తెలివిగలిగినన్
కేవల పరమాత్ముడవౌ
నీవేగాకెవరుగలరు నిపుణులు రామా. 97

కం॥ చిత్తంబులోన నే
సత్తనుచు దెలియుబడుట సాధ్యమెగాదా
యుత్తెరగు వీడగలరది
తత్తరపడ పనియెలేదు ధరణినిరామా. 98

కం॥ పురుషులు స్త్రీలన వేరే
పరికింపగ నెవరుగలరు ప్రాకృతమున నీ
తెర వెరుగ నట్టివారలు
పరిపరి విధమవుచున్నిన్ను బడయరురామా. 99

కం॥ రుజువుగ నిన్నే గాంచుచు
భజియించెడు వారు భువిని పాపరహితులై
అజహరు లందరు గొలిచే
నిజమా నిన్నెరుగగలరు నీతిచె రామా. 100

కం॥ తుదిజన్మమనుచు నినుగను
బుధులెల్లరు దెలుపవింటి పూర్ణుడవని నా
హృదయాబ్జమందు నిన్నే
వదలక గొనియాడుచుంటి వాంఛతొ రామా. 101

కం॥ నిత్యానందంబున నిను
ప్రత్యగ భిన్నుండవనుచు భాగవతులు నీ
యత్యాదరంబున నిటు
సత్యముగా జూడగలరు సభికులు రామా. 102

కం॥ దూరంబున ననుజూడక
సారములేనట్టి మాయ సంసారంబున్
యేరీతి నీదగలనిక
కారణమా నీదుకరుణ గలుగక రామా. 103

కం॥ అరుణోదయంబు మాడ్కిని
గురుకరుణామృతము మాయ గుహలను వెలుగన్
తెరవాయె నిన్ను బొగడగ
కరుణాకర నీదుకృపచె గావుము రామా. 104

కం॥ దరియాహుస్సేన్ షా గురుకృప
పరలోక ప్రాప్తిగలుగు భాగ్యైయుండన్
వెరపేమి లేనిదని గను
నరులకు పరమార్థమనుచు నమ్మితిరామా. 105

కం॥ మును భక్తులెల్లరును నిను
వినయ విధేయతనుగొలువ వేడ్కజనింపన్
పనిగాని నినుస్మరియించుట
ధనమే నాకనుచునిన్ను దలతునురామా. 106

కం॥ కుందురువారి పురంబున
అందముగా నిల్పిమిగుల యాదరణముతో
నుందువు ఖాశీందాసుని
సందియములు బాపుకొరకు సాక్షిగరామా. 107

కం॥ మంగళమని నినుబొగడెద
శృంగారంబైన నీదు శ్రుతిహితపదముల్
రంగుగ నాశిరమునవిడి
పొంగుచు దలచెదను నెపుడు పూజితరామా. 108

—: గద్య :—

ఇది శ్రీ దరియాహుశ్శేన్ వలీషా ఖాదరి దేశిక సుజ్ఞాన సుత శ్రీ ఖాశీం వలీషా ఖాదరి దేశిక ప్రణీతంబైన పరమామృతంబను గ్రంథంబునందు శ్రీరామశతకము కంద పద్యములు నూటయెనిమిది సమాప్తము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# శ్రీ రామ శతకము.

సీ॥ శ్రీరామ నీనామ పారాయణముజేయు
వారలజేరునే ఘోరమాయ
సకలార్థములనొసగు జాడవేరున్నదే
సుకరమా నినుదలచు సుఖముగాక
చలమానసును నిలుప నీనామమే
గలదు భువిలోనొకటి గలుగబోనె
సర్వపాపంబులు సమసి పోవునుగదా
నిర్విచారంబున నిన్నుగొలువ

గీ॥ ధర్మసంరక్షణముజేయు నిర్మలాత్మ
కర్మబంధంబులనుగాల్చు ఘనుడవయ్యు
పరమకళ్యాణ గుణనామ భవవిరామ
రహిని కొందుర్వారి పురాగిధామా.

సీ॥ సంసారబంధముల్ సమయింపుటకునీవె
సకలశక్తిఁ వహించు సాహసుడవు
వింతవింతలదోచు విషయవాసనలను
అంతలోంద్రుంచెడు శాంతినిలయ
వాచామగోచరంబై వెలుంగుచు భువన
వాసివై వెలయు శ్రీ దేశికేంద్ర
పరమార్థమునుగోరు భాగవతులకు నీవె
తెరవొందువానంద కరుడవవుచు

వవ్యయానంద పరిపూర్ణ యఖిలరూప
దివ్య పధసౌధముననున్న దేవదేవ
పరమ కళ్యాణ గుణనామ భవవిరామ
రహిని కుందుర్వారి పురాగ్రిధామా. 2

సీ॥ నీదివ్యసదనంబు నిత్యానుభోగంబు
కాదనువారికి బాధకంబు
సాధుజనులదలచు సంతోషనామంబు
వాదభేదములేని వైభవంబు
భుక్తిముక్తులగూర్చు పురుషార్థ భవనంబు
రక్తిగలిగిన విమల రాజితంబు
తీరని దుఃఖముల దీర్చెడుభారంబు
కరుణగలిగియు బ్రోవ కారణంబు

సత్య సంకల్పులకు మహాసార్థకంబు
నిత్యమును సాక్షిగాగాంచ నిజపథంబు
పరమ కళ్యాణ॥ 3

సీ॥ నీలోన సర్వంబు నిలచియున్న విధంబు
దెలియబఃడుటయెగదా తెలివియవును
కలలోన దోచిన కలియుగ భ్రాంతిని
గలదనినిలువగా వలను పడునె
తోలుఃతనీయాధార బలమున గాక మరి
గలదె యింకొకటది కలగాక
కలిగియుండిననిన్ను గానక బలుజన్మ
ములనైన నీపాద నళినయుగము
గాంచజాలరు యెంతటి ఘనుఃఃభువిని
సంచితాగామి కర్మలు సమసిపోవు
పరమ కళ్యాణ॥ 4

సీ॥ పూని నినుసేవించి పూజించు ఘనులెంత
పుణ్యాత్ములైనిన్ను బాగడినారో
గనరాని నినుజేరి గలియగోరిన సుజన
గణ్యు లేరీతి నినుగాంచినారో
కాలదేశంబులు గాని నీనిజరూప
లీలలేధన్యాత్ము లోలినారో
కారణాచార్యుని కరుణచే బుధజనుల్
ధీరులై నిన్నట్లు దెలిసినారో
తెలియజేయుక నాకెవరు తెరవుదేవ
కలిమి బలిమియు నీవె ననుగావుమయ్యా
పరమ కళ్యాణ॥ 5

సీ॥ నీపద భక్తిచే నిఖిలలోకంబులు
పాపసంహారమై బరగుచుండు
తులలేని నీకథల్ బలుకు సర్వజ్ఞులు
వెలలేని సంపదల వెలసినారు
సదయుడవౌనిన్ను సన్నుతించెడువారు
ముదమున నిన్నెపుడు వదలకుంద్రు
తప్పులన్నియు దీర్చు గొప్పవాడవటంచు
చొప్పెరింగినవారు ముప్పుగొనరు

నిన్ను వేమారుదలచెడు నిపుణులెల్ల
ఉన్నతోన్నత సుఖముల నొందగలరు
పరమ కళ్యాణ॥ 6

సీ॥ నిగమాగమములెల్ల నిన్నువర్ణించుచే
గాక మరేమియు గలుగబోదు
సుగతికి మూలమై శుద్ధస్వరూపమై
యగణితమైన నిన్నరయగలమె
లోకవిఖ్యాతమై రాకపోకలులేక
యేకమైయున్న పరలోకవాసు
తెలివిమాలినవన్ను చులకనగాజూడ
దలచిన నాకిక దారిగలదె

దీనజనపోష గతదోష ధీవిలాస
ధర్మ సంరక్షణముజేయు దైవరాయ
పరమ కళ్యాణ॥ 7

సీ॥ దివ్యమౌ నీనామ దీప్తిముల్లోకముల
నిర్వివాదంబవుచు నిలచునయ్య
సర్వోత్తమంబనగ సజ్జనావళిలోన
దుర్వివాదంబుల దునుమునయ్య
సకలశోభితమునై సర్వాధికారమై
ప్రకటింపబడుదువు భయముదీర్చ
నిను వర్ణనముసేయ నేనెంతవాడను
మనసు నిలకడ లేని మానవుడను

సర్వ సంపద్విశేష సజ్జనవిలాస
యుర్వి నీకంటెఘను లెవరు యూహసేయ
పరమ కళ్యాణ॥ 8

సీ॥ నీచుడనని నన్ను జూచిచూడకయున్న
కాచిరక్షించెడు ఘనులెవరు
ముందరగతిగనని మంధుడనని నాదు
సందియంబులుబాపి సాక నెవరు
కలుషాత్ముడని నన్ను కడదోసిజూచిన
బలమొసగి రక్షింప బంధులెవరు
భయపడి నీసేవ నయమనిజేయు నను
దయజూపి పాలింప దాతలెవరు

తప్పులన్నియుదీర్చెడు దైవమెవరు
యిప్పుడే నన్నురక్షింప విహితులెవరు
పరమ కళ్యాణ॥ 9

సీ॥ స్థిరచిత్తమున నిన్ను శరణని వేడిన
కరుణించి కడతేర్చు ఘనుడవీవె
భక్తపోషణుడవని పలుమారు బుధజనుల్
శక్తికొలదిగదలుచ సాకనీవె
వెరపులన్నియుదీర్చు వేదవేద్యుడవనుచు
స్మరియింపభరియించు సాక్షివీవె
విరసమేమియులేక విశ్వాసమున ప్రజలు
సమగా జూచెడు సఖుడవీవె

నీవుగాకను దయయుంచు నిపుణులెవరు
గావవే నన్నుమన్నించి కలుషరహిత
పరమ కళ్యాణ॥ 10

సీ॥ అన్నిటనీవుగా నున్నవిధమెరుకపడ
నున్నగామాయను జూడవలదె
ప్రబలమౌ నిర్గుణ పదవినొందెదమన్న
నుభయవాచ్యార్థముల్ వదలవలదె
జీవదృష్టినివీడి శివదృష్టిగలుగుట
భావమానందమున బరగవలదె
నీవు నేననుభ్రాంతి నిలిపివేయుదమన్న
కేవలాత్మాకార తోప్రవగాదె

సకల సంశయరహితమై జనగనెంచ
నిఖిల జగమును బ్రహ్మమని నెరుగవలదె
పరమ కళ్యాణ॥ 11

సీ॥ నిత్యమై సత్యమై నిర్వికారంబునై
ప్రత్యగాత్మయున్న పరమపురుష
శుద్ధమై శుభదమై బద్ధత్వమును లేక
సద్దయాళుడవైన శాంతినిలయ
స్వచ్ఛమై సర్వమై హేయమ్ము తగులు లేక
ముచ్చటై యున్న గురుమూర్తివయ్య
కర్తవై భరియింప భర్తవై బ్రహ్మాది
మూర్తులకాధార వర్తివయ్య
సచ్చిదానంద పరిపూర్ణ సాక్షివయ్య
సచ్చరితుఁడ వీవయ్య సన్నుతాంగ
పరమ కళ్యాణ॥ 12

సీ॥ హృదయాబ్జనిలయ నీ సదనంబు జేరగా
మదినెంచి విజ్ఞాన మయులు ధరను
జ్ఞానాశిచే విషయ గహనంబు మనుమాడి
మానావమానములు మరచియుండి
ధ్యానమించుక లేక యానందప్రాప్తిచే
బూని నిరంతర ధ్యానమునను
నినుజేరిరని శృతుల్ నియతితో దెల్పిన
వినిసంతసంబున నినుభజింతు
వరద భక్తార్తిభంజన వాసుదేవ
సరగునను నన్ను బ్రోవుము సర్వవినుత
పరమ కళ్యాణ॥ 13

సీ। తొలుత నీవొకడవై దుస్తరమా మాయ
నంటియుంటకను నీవుంటివయ్య
వెలిలోను వ్యాప్యమై వెలసిన సద్రూప
తలపుల నిన్నునే దలతునయ్య
మలినమించుక లేని మహనీయమూర్తి నిను
మాటిమాటికిగొలువ మరువనయ్య
వెలలేని మనసుచే విజ్ఞులుసర్వదా
ఫలరహితులై నిన్ను బిలుతురయ్య

లీలలన్నియు నీవె నన జాలునయ్య
పాలుమాలిన నీకృప బడయరయ్య
పరమ కళ్యాణ॥ 14

సీ। సమ్మతితో నిన్ను నమ్మినవారికి
యిమ్ముగాయీప్సితము లిచ్చినావు
క్రమ్మినయజ్ఞాన గాఢాంధతనుబావ
జ్ఞానభాస్కరుడవన గలిగినావు
సన్మానమున బుధుల సంరక్షణము జేయ
ధర్మపరుండవన దగిననీవు
నిర్మోహులకు సర్వ ధర్మంబులను దెలిపి
కర్మబంధంబులు గాల్చినావు

ఆత్మ గలిగినవారల దరచినావు
కల్మషంబులు దొలగింప ఘనుడవీవు
పరమ కళ్యాణ॥ 15

సీ॥ పెద్దలఁబోడఁగని పెడవాదములఁబల్కు
మొద్దులనెల్ల మర్ధించినావు
వద్దికగలిగిన వారలఁజేరియు
శ్రద్ధగాబుద్ధులు జెప్పినావు
పొద్దులోనిలచి హృదయాబ్జమున నినుగన్న
శుద్ధాత్ములని నీవు జూచినావు
కద్దులేదనిపొడు వ్యర్థవాక్యములాడు
బద్ధుల భవములెడ బాపఁబోవు
గద్దులెల్లనుదీర్పు మహారాజవీవు
పద్దుబూని భజింప పాలింపనీవు
పరమ కళ్యాణ॥ 16

సీ॥ పుట్టినదాదిగా గిట్టు పర్యంతమును
మిట్టిపడుచును దిరుగ మేలఁగలదె
పొట్టకొరకై నరులు గుట్టుదెలియక తాము
దిట్టవై మెలగిన తెలివిగలదె
పట్టిదీజగమని వాంఛలువిడకున్న
యెట్టిదో నిజమను యెరుకగలదె
ఘట్టిగా నీపాద కంజముల్ నెరనమ్మి
పట్టువిడువక నన్న భయముగలదె
మట్టిపాలైన దేహమును మరువవలదె
తుట్టతుదకైన నీకరుణ దొరుకవలదె
పరమ కళ్యాణ॥ 17

సీ॥ రూపింపరాని నీ రూపమెరిగిభజింప
తాపసులెంతటి ధన్యులైరో
అంతటావ్యాప్యమా అద్భుతాకారమును
చింతింపబుధులెంత శ్రేష్ఠులైరో
కలకాలమొకరీతి గలిగియుండిన నిన్ను
నిలకడగాగాంచి నిపుణులైరో
గుణరహితులవుచు నిర్గుణసౌఖ్యమున నిన్ను
అనుభవంబునదెలియ నధికులైరో
వారి వర్ణింపవశమానె వసుధలోన
కారణాచార్య వరులు గనగలిగినారు
పరమ కళ్యాణ॥ 18

సీ॥ గురుడే పరుండని గుర్తించువారలు
పరమపదవాసులై బరగినారు
కారణాచార్యుని కరుణలేకనుతన్ను
గాంచగలరే యెట్టి ఘనులుధరను
గురుమాత్రమెరుగక పరమార్థమునుదెలియ
తరమవునె యెంతటి తపస్వికైన
వేదవేద్యుడవవుచు వెలయు నీ నిజరూపు
సాధింపగలరె గురుసాజ్ఞలేక
వున్నదున్నట్లు దెలుపగల కన్నతండ్రి
నన్ను కడతేర్తువని నిన్నె నమ్మినాను
పరమ కళ్యాణ॥ 19

సీ॥ జీవుడే దేవుడని శ్రోవదెల్పినయట్టి
పావనుండౌ గురుని పాలనమున
మలినయుతంబైన మాయఁ బొలగునుగాక
వలనుపడునే యెంత తెలివియున్న
లింగాంగభంగమా సంగతెఱుగుదమనిన
శృంగారమవు గురుని సూటిగాదె
తన్నెరింగియు తాను ధన్యత్వమును జెంద
గురుకృపలేకను తెరవుగలదె

జన్మ సాఫల్యమొనరించి జడతదీర్చ
చిన్మయానందుడౌ గురుని జేరవలదె
పరమ కళ్యాణ॥ 20

సీ॥ నిన్నుగొలువనివారి నేర్పరితనమేల
భిన్నభావముగలుగు చిన్నెలేల
వావివరుసలులేక వదరుటలవినేల
త్రోవిగాదిక్కులు దిరుగుటేల
పాపముల్ దెలియని భక్తిశ్రద్ధలవేల
ఆపదలెరుగని అర్ధమేల
తనగతిగానక తపియించుటదియేల
జననమరణముగనని జన్మమేల

మనుజ జన్మంబు మంచిదని మరచుటేల
వినయమున నిన్నుగొలువని విధమదేల
పరమ కళ్యాణ॥ 21

సీ॥ తప్పుదెలియనివారి గొప్పతనంబేల
ముప్పిరుంగనివట్టి మురిపెమేల
తన్ను తానెరుగని దబ్బరలవియేల
పిన్న పెద్దలగనని బిడియమేల
మనసునిలకడలేని మాటలపనియేల
కనుగానకున్నట్టి ఘనము దేల
దేహమే తాననుతెలివిహీనమదేల
అహమణచనేరని యార్తియేల

వున్నదున్నట్లుదెలియని వూహయేల
మన్ననతో నిన్నుజేరని మనసదేల
పరమ కళ్యాణ॥ 22

సీ॥ మరణచిహ్నములచే వెరపుదో చెడుకాల
మరుగుదెంచిన నిన్ను మరతునేమొ
వడరానియిక్కట్లు బడి తపించెడువేళ
తడబడుపాటున దలపలేనొ
దుస్థిరంబౌ వ్యాధి మస్తకంబునకెక్క
ఆస్థితుడవౌనిన్ను నరయలేనొ
పరిపరివిధములై పరువులెత్తుచునుండు
మనసునీయందుంచ గలనొ లేనొ

యిప్పుడేనిన్ను స్మరియింతు గొప్పగాను
తప్పులనుబాపి దయయుంచు దాతవనుచు
పరమ కళ్యాణ॥ 23

సీ॥ ఏకమై నిత్యమై వెలయు నీకృప గలుగ
సాకగలిగెనుమమ్ము లోకమాత
జగముల పుట్టింప సమయింపగలమహిమ
తల్లియా మాయకే చెల్లునయ్య
నీకటాక్షంబున నిర్మింపగలిగెను
లోకవిఖ్యాతమై లోకములను
యిట్టి దట్టిదటంచు వివరింపరాక నీ
కట్టులోపలనుండు ఘనతగాంచి
సర్వ భ్రాంతికిమూలమై సమతనుండి
నిర్వికారులపరమాను నిన్నుజూపు
పరమ కళ్యాణ॥ 24

సీ॥ త్రిగుణాత్మకంబవుచు నిగమంబులనుబల్క
వగపులేకుండు నీ వట్టిమాయ
లేనిది కలదని కలదాని లేనిదని
పూనిచూపించు యీ లేనిమాయ
యెంతవారలనైన భ్రాంతిలోపలముంచి
చింతలజేయు నీ వింతమాయ
మేలుదెలిసియు సత్యశీలురైనను వారి
కాలమానందమున గడుపుమాయ
చెప్పుటకువలనుగా దింత గొప్పమాయ
చొప్పదెలియుటయే మహా చోద్యమాయ
పరమ కళ్యాణ॥ 25

సీ॥ పంచభూతంబులై బరగుచుండియు విషయ
పంచనేమియులేని పట్టిమాయ
దేహిదేహంబుల తెరవెరుగువారిలో
సాహసంబున నిన్ను జేరుమాయ
స్వచ్ఛమై ముచ్ఛమై హెచ్చుతగ్గులఁగలిగి
యిచ్ఛవచ్చినరీతి వెలయుమాయ
కర్మఫలంబులు కట్టి కుడుపుచు తాను
నిర్మలంబున నుండు నిట్టిమాయ
కలదు లేదని వూహింప గనని మాయ
దెలియతరమవున నినుజేరు తెరవులేక
పరమ కళ్యాణ॥ 26

సీ॥ పలుభ్రాంతులకు మూల బలమైనమాయను
దెలిసి కలియకున్న ధీరవరులు
వెలిలోను నినుగాంచి విడువకుండినయట్టి
తెలివిగలిగి వెలుంగు ధీరవరులు
అవయవ రహితమై యావరించిన నిన్ను
దెలిసిమరువకనుండు ధీరవరులు
నీదయారసమున నిత్యతృప్తిని బొంది
ధీసాక్షివనియెంచు ధీరవరులు
లోకరక్షణకారకు నీ వేకరీతి
తెలయు పరమార్ధనిలయ నినువేడుకుందు
పరమ కళ్యాణ॥ 27

సీ॥ మూడు మేనులయందు మూడవస్థలలోన
　　　　వేఱుక జూప నింకెవరుగలరు
జోలుతనువులలోన వాలలాడుచునుండి
　　　　వీలుగావర్తింప నెవరుగలరు
కాలకాలంబులు గాని నిజతత్త్వమును
　　　　మేలుగాబోధింప మేటియెవరు
పంచవింశతి తత్త్వ పరమవ్రుచు సర్వమున
　　　　వంచనేమియు లేని వారలెవరు

అన్నిటికినీవె యాధార మైతివయ్య
నిన్ను గానని వారికి మన్ననేది
పరమ కళ్యాణ॥ 28

సీ॥ మంచియోగమున నిన్నెంచి భజించిన
　　　　సంచితాగాములు ద్రుంచినావు
పరిశుద్ధ హృదయులై పరిశోధనము జేయు
　　　　భక్తావళిని బ్రోవ బరగినావు
మృష యీజగంబని విషయేచ్ఛలనుమాను
　　　　కృషిజేయు గుణయుతుల గూడినావు
పురుషార్థ వరులగ్రుచు పూజించు పుణ్యుల
　　　　వెరువ వలదని యభయ మిచ్చినావు

నిన్ను వర్ణింపలేరెట్టి నిపుణులైన
జనన మరణ విరహిత జగదేక వినుత
పరమ కళ్యాణ॥ 29

సీ॥ నీనామమఖిలమై నిర్మలంబై యుండు
నీనామమానంద నిలయమవును
నీనామ మవిచార నిశ్చయంబౌనగూర్చు
నీనామమంతట నిలచియుండు
నీనామ మదిదుఃఖ నిర్మూలమును జేయు
నీనామ మఖిలార్థముల నొసంగు
నీనామ మరివర్గముల నెడబాపును
నీనామ మతిశయ నీతిపథము

నీదునామంబు దలఁచక నెవ్వరైన
వేదనలు బాయ లేరెందు వెదకిచూడ
పరమ కళ్యాణ॥ 30

సీ॥ పరలోకప్రాప్తికి ప్రాపకంబౌనామ
మపరోక్షపదవిగను నట్టినామ
మిందుసూర్యాగ్నుల వెలిగించగలనామ
మందినశుద్ధత్వ మొందునామ
మాత్మస్వరూపమై యాధారమవునామ
మరసినవారికి తెరవునామ
మాదిమధ్యాంతంబు లనరానినీనామ
మచలమై విషయముల గననినామ

మిట్టిదని వర్ణనముసేయ నెంతవాడ
స్వల్పదృష్టిచె నిన్నెటుల జూడగలను
పరమ కళ్యాణ॥ 31

సీ॥ లోకరక్షణకొఱకు నేకాక్షరుడవౌదు
సాకనేర్తువు గదా సాధుజనుల
సర్వజీవములకు సాక్షివి నీవౌచు
నిర్వహింతువుగదా నేర్పుగలిగి
శిష్టరక్షణజేయు శ్రేష్ఠుడవీవౌచు
స్పష్టపరుతువుగదా శాశ్వతమును
నిగమాగమములకు నీవె కర్తవుయవుచు
సగుణుడవౌదువు శాంతమునను
దుష్ట శిక్షణజేసెదు దోషరహిత
యిష్టదైవము నీవని వినుతిజేతు
పరమ కళ్యాణ॥ 32

సీ॥ సామజవరద నీనామమంత్రము సకల
కామములు దొలగించు ప్రేమమయము
వేదవేత్తలు బలుకు వేదాంతసారంబు
సాధకులకు యిష్ట సాధనంబు
విరసమేమియులేని విశ్వాసపాత్రంబు
సరసులు జేరెడు సత్పథంబు
భక్తులుగోరెడు ముక్తిస్వరూపంబు
శక్తివంతులకమిత సాహసంబు
వంతలేవియు లేనట్టి వైభవంబు
పంతరహితుల కానంద ప్రాపకంబు
పరమ కళ్యాణ॥ 33

సీ॥ నీ చరణసేవలో నిలచినవారలే
యోచనగలిగిన యోగ్యులైరి
అనవరతంబు నీ ఘనమెరుగువారలే
మననమున నీలోన మగ్నులైరి
ఆపదలనుబాపు నధికారివనిదెలసి
తాపసోత్తములెల్ల ధన్యులైరి
తీరనిదుఃఖముల దీర్చెదవనిదెలసి
యారాటములుమాని యధిపులైరి

భారములు దొలుగుననుచును నిర్భయులునైరి
మందమతులెల్ల నినుగన అంధులైరి
పరమ కళ్యాణ॥ 34

సీ॥ అతిరహస్యమైయున్న యాత్మానుభవమును
హితవుగా తమలోన వెదకువారు
పతితపావనమైన పరలోకప్రాప్తియే
గతియని తమలోన గాంచువారు
మితిలేని సౌఖ్యమని సతతంబు మరువకను
వ్రతశీలురై యహము వదలువారు
పాతకంబులులేని పరిశుద్ధతోవలో
నీతిగలిగియు మెలగి నిలచువారు

దుర్మదాంధత్వమును బట్టి దునుమువారు
నిర్మలంబున నినుజేరి నిత్యులైరి
పరమ కళ్యాణ॥ 35

సీ॥ యింద్రియాదశకమును త్రుంచించి నినుజేర
బంధంబులేమియు జెందబోవు
శమదమాదులుగలిగి విమలత్వముననున్న
క్రమముగా నీలోన గలుప గలవు
సత్వగుణంబున సమరసులైయున్న
యుత్తమస్థానమున నుంచినావు
నిన్నెతప్ప మరెద్ది నెన్నకుండినవారి
కన్నతండ్రివిధాన గాచినావు
దయయు దాక్షిణ్యమునుజూప దగినసీవు
భయముదీర్చెడు కొరకిట్లు ప్రబలినావు
పరమ కళ్యాణ॥ 36

సీ॥ చిద్గగనమున నిన్ను సేవించు పుణ్యుల
హృద్గతవాసివై యుంటివయ్య
హంసవాహనుడవై హింసలేవియులేక
సంసారమునకేమి ఝుడియవయ్య
నాసికాగ్రంబున నాట్యమాడుచు బుధుల
వేసటలెల్ల విడిపింతువయ్య
సచ్చిదానందుడవు సర్వ ప్రకాశుడవు
మూర్తిత్రయుల కాదిమూర్తివయ్య
నీమహిమ నెరిగి నినువలచు నిపుణులెల్ల
ఆది అంత్యములనుమీరి అచలులైరి
పరమ కళ్యాణ॥ 37

సీ॥ ఆత్మతేజముగాంచు యానందమయులకు
వ్యాప్తమైయంతట వెలిగెదీవు
లిప్తమైననునీలో లీనమైయుండిన
యాప్తుడవయి యాదరించినావు
మాయను తెరదీయు మహనీయులకు నపుడె
కాయమందున ముక్తి గరపినావు
మేరు శిఖరంబున జేరి నిల్చినవారి
భారము నీవైయె బరగినావు

ధర్మరక్షణ మొనరించు దాతవీవు
కర్మ బంధంబులనుద్రోయు ఘనుడవీవు
పరమ కళ్యాణ॥ 38

సీ॥ భక్తిపరవశులైన భాగవతులకు
ధర్మసూక్తులు బోధించు శుభగులెవరు
ముక్తికాంతామణి మురిపెంబుదీర్చుటకు
మూలమైయున్నట్టి మూర్తియెవరు
నూటిదప్పకను ముయ్యేటికూటమునందు
నాటకధారియా నాధులెవరు
మండలత్రయమందు దండిగా వెలుగొందు
పుండరీకములోన పురుషులెవరు

అన్నిటికి నీవెమూలమని గన్నవారు
యెన్నటికి నిన్నువిడువరో కన్నతండ్రి
పరమ కళ్యాణ॥ 39

సీ॥ శివజీవులనుగలుగు సిద్ధిగలిగినవారు
వివరమెరిగి నటించు వేత్తలైరి
దృష్టిలోపరమాత్మ స్పష్టపరచినవారు
నష్టమెన్నడు లేని శ్రేష్ఠులైరి
తానె సర్వంబనియు తన్నెరింగినవారు
లేశ దేహముజోలి పోనరైరి
బుద్ధిసూక్ష్మతగలుగు పుణ్యాత్ములగువారు
వద్దికతో నిన్ను వదలరైరి
నీదు సాన్నిధ్యమెంతటి నిర్మలంబొ
యెఱుగనేర్చినవారు నిను విడువరైరి
పరమ కళ్యాణ॥ 40

సీ॥ లోచూడనేర్చిన యోచనపరులకే
తోచుచుండును నీదు దొడ్డతనము
మనసేంద్రియములను మరలించువారికే
నినుజేరగలిగిన నేర్పుతనము
దాపుననినుగాంచు తాపసోత్తములకే
చూపు వేఱుగబోని శుద్ధతనము
కన్నులలో నిను గనుగొన్నవారికే
ఘనుడవని నినుదలచు గట్టితనము
సాటిలేనట్టి నినుజూచు సజ్జనులకె
బూటకంబులు జేరని మేటిదనము
పరమ కళ్యాణ॥ 41

సీ। చలనమేమియులేని మెళుకువగలిగిన
తెలివియే తెలివియని దెలియనవును
యేచూపుజూచిన యాచూపులో గురుని
రూపంబుదోచని రూఢమవును
తలపులీనంబైన తావువీడక నెపుడు
తాలిమినుండుటే దారియవును
ధర్మమెరిగియు విరస కర్మంబులను జొరక
నిర్మలంబున నడువ నీతియవును

అన్నిటికి నీవెసాక్షియని గన్నయపుడె
యున్నతంబైన సుఖమని యెన్నవును
పరమ కళ్యాణ॥ 42

సీ॥ సంగమేమియులేని శాశ్వతమూర్తివై
మంగళప్రదుడవని మహిని బొగడు
నీకంటెనన్యులేలోకంబుననుగలరె
యేకమైవెలయు సుశ్లోకచరిత
కర్తవై భర్తవై కరుణామయుండవై
యార్తులనుపాలింప నవతరించి
భూమిభారము మాన్పి నీమంబులనుదెలిపి
కామితార్థంబుల గలుగజేయు

పశ్చిమాంతర ఖేలన పాపరహిత
నిశ్చయంబుగ నినుగాంచ నెంతవాడ
పరమ కళ్యాణ॥ 43

సీ॥ చెబ్బరగుణముల చెలిమి విడువకనున్న
నిబ్బరముగ నిన్ను నెరుగగలమె
వెక్కసంబునబడి కుక్కరీతిగ దిరుగ
చిక్కులువిడి నిన్ను జేరగలమె
కుజనులగూడియు నినుభజించుటమరచి
గజిబిజిగానీలో గలియగలమె
దబ్బరలాడెడు టాటోటులైతేను
గొబ్బుననీకృప గోరగలమె
నీకు దెలియని వేవియు లోకమునను
లేకపోవును యెందును లేశమైన
పరమ కళ్యాణ॥ 44

సీ॥ తనువువిడి జీవుడు తరలిపొయ్యెడు వేళ
జన ధన గేహముల్ జతకురావు
వచ్చినవారలు చచ్చుట నిజమిది
ముచ్చటజగమని మురియబోకు
యెవరెవరి ఖర్మలు వారివారివిగాని
యొరులు భజించెడు యోగ్యతేది
యోచనజేసిన గోచరించునునీకు
చూచి నడచినవారె సుజనులైరి
యెప్పుడైన తమయాజ్ఞ కొప్పువారు
తప్పుత్రోవల నడువక ధన్యులైరి
పరమ కళ్యాణ॥ 46

సీ॥ దేహమేతాననుతెలివి హీనత చేత
అహమణచ లేనిదే యధమమవును
మలమూత్రములఁగలిగి మాంసనిర్మితమైన
తనువు తాననుటయే తగనిదవును
తాను దేహంబనియు తగవులాడుటెగాని
తానుబోయెడు వేళ తగిలిరావు
మట్టిపాలై పోవు మలిన దేహముజూచి
పట్టిదీతనువని వదలువరకు

ఘట్టిగా నిన్ను నమ్ముటే ఘనతదెచ్చు
మిట్టిపడకను నిజమెరుగ మేలుదోచు
పరమ కళ్యాణ॥ 46

సీ॥ తన్ను తానెరిగెడు తత్త్వజ్ఞులకు మాయ
సన్నమైయెచటికో జనునుచూడ
ఖండఖండములవుచు గానుపించెడుజగము
ఖండనవిగ్రహింప నొకటిగలదె
జలబుద్బుదములవలె నిలువనిరూపముల్
గలవని బలుకుట కలగాదె
జననమొందినవారు మరణించుటయెగాని
అనుమానమున్నదే యనుభవమున

రూపరహితుడవౌనిన్ను రూఢిసేయు
తాపసులె నీదుకృపగలిగి ధన్యులైరి
పరమ కళ్యాణ॥ 47

సీ॥ భూమ్యాదులౌ పంచ భూతంబులును నీవె
సోమసూర్యాగ్నులును సురులునీవె
నర మృగ విహగముల నాటకుండవునీవె
స్థిరములౌ స్థావరములునునీవె
వేదంబులునునీవే వేదమయుడవునీవె
వేదాక్షరములకు విభుడవీవె
విశ్వంబుయును నీవె విశ్వేశ్వరుఁడవీవె
శాశ్వతంబుగ వెలుఁగు సాక్షివీవె

నీవు లేనివి జగమున లేవు సకల
భువనముల కాదిమూర్తివౌ పుణ్యచరిత
పరమ కళ్యాణ॥ 48

సీ॥ నీలోన సర్వంబు నిమిడియుండువిధంబు
మేలనిదెలిసియు మెలగువారు
నిత్యసంతోషులై నిలచియుండియు నిన్ను
ప్రత్యక్షమున గాంచ బడెడువారు
చిత్తవృత్తులుమాని చిరసౌఖ్యమునుబొంద
తత్త్వజ్ఞులై నిన్ను దలచువారు
సంగవిరక్తులై శృంగారరసముతో
భంగమొందకనీదు లోంగువారు

గలరు గలరనువాక్యముల్ కల్లగావు
మలినములు దీర్చుదారవని మనవిజేతు
పరమ కళ్యాణ॥ 49

సీ॥ యీషణత్రియములు గోసివేసినవారు
వేసటలేని పరవాసులైరి
తాపత్రియంబులు దగులకుండినవారు
నీపదధ్యానమున నిపుణులైరి
దుర్గుణంబులుబట్టి దునిమివేసినవారు
సద్గతికర్హులై సఫలులైరి
సాధనములునాల్గు సాధించువారలు
వేదనలకుతాము వెరువరైరి

వాసనలుమాని యెపుడు నీదాసులైరి
నిన్నుజూచుచు యితరము నెరుగరైరి
పరమ కళ్యాణ॥ 50

సీ॥ యితరజోక్యముగలుగ పతితహేతువుగాని
మతిమంతులకు సమ్మతంబుగాదు
దూషించుటయె మహా దోషహేతువుగాని
భాషణకదిధర్మ పాటిగాదు
పరధనమునకాస బంధహేతువుగాని
ధర్మార్జితులకది దారిగాదు
కొరగానిపనులవి నరకహేతువుగాని
సరసులకది సంతసంబుగాదు

సత్యధర్మంబులను వేరుజాడగనక
భృత్యులై నిన్నుదలచుటే పూజితంబు
పరమ కళ్యాణ॥ 51

సీ॥ కలలోనగన్నవి కల్పనలవుగాని
మెళుకువతోజూడ నిలువనవునె
యీరీతి జగమిది గారడియాగాని
పారజూచినగలరె బంధుజనులు
వట్టిదీజగమనక వాంఛలపాలైన
ఘట్టిగానిలుపుట కలవియవునె
వున్నదున్నట్లెరుగు ప్రూహాలేమండిన
మన్నన గలుగునే మానవులకు
దేహమున్నప్పుడే నిన్ను దెలియవలయు
యిహాము సతమనిగనమందు టిదియె మేలు
పరమ కళ్యాణ॥ 52

సీ॥ దిక్కుగలిగియు సకల దేశంబులనునీవు
ప్రక్కతోడై యుండ భయము దేమి
ఎక్కువతక్కువ లేమియుగాకను
నొక్కరీతిగనుండ యోచనేమి
చిక్కులన్నియుదీర్చ శ్రీధరుడవై యుండ
అక్కడక్కడి కేగి యదరు టేమి
అక్కరగలిగిన యాదరించుటకునై
నిక్కముగనీవుండ నెరుగ రేమి
గ్రక్కునను యార్తిబాపెడు ఘనుడవుండ
యెక్కడున్నాడవోయని వెదకు టేమి
పరమ కళ్యాణ॥ 53

సీ॥ దేవుడవని నీదు దివ్యసదనముఁజేరి
భావమున వేఱు పాటులేక
నినుభజింపుచునుండి నిత్యసంతృప్తితో
జననమరణములనెడు ఝంఝవదలి
పావనులై పరమ భాగవతులనుఁజేరి
సేవసలుపుచు యితర చింతలేక
కలకాలమొకరీతి కాలంబుగడుపుచు
నిలకడగలిగిన నీతిపరులు

నిన్నుఁజేరెదరని శ్రుతుల్ నిర్ణయింప
అన్నిటికి నీవెగలవని యాశ్రయింతు
పరమ కళ్యాణ॥ 54

సీ॥ సకల బాధలుదీర్చి సాన్నిధ్యమునఁజేర్చ
ప్రకటింపబడెదవు భారముంచి
నీ దివ్యధ్యాన నియతులై నినుగాంచు
సాధకులను దయతో సాకుచుంటి
నవచారములులేని యాచార పరులను
కృపగలిగి సర్వమొన కూర్చినీవె
యాధారమైతివని యనవరమునిన్ను
శోధింపగలిగెను సుకృతమునను

నన్ను పాలింతువనియెదను నమ్మినాను
యెన్నటికి నిన్నుమఱువని విధమొసంగ
పరమ కళ్యాణ॥ 55

సీ॥ నిన్నుగాంచినవార లన్యంబుగాంతురే
కన్నుల పండువవు కలిమిగలుగ
అంతరంగమున నీ చింతనగలిగిన
పంతంబు లున్నవే భావమందు
పరమమైయున్న నీ పరిశుద్ధతను దెలియ
కోరగాని పనులను గోరగలమె
వెలిలోను వెలయు నీ విశ్వరూపముగన్న
తలపు వేరుగబోవు దారిగలదె

నిత్యసంతోషమున నీలొ నిలచియున్న
సత్యసంధులకిక మగల జన్మగలదె
పరమ కళ్యాణ॥ 56

సీ॥ ఎంతటిపుణ్యమో విశ్వేశ్వరానీదు
చెంతను జేరియు సేవజేయ
గలిగిన భాగ్యమే కలుషంబులనుబాపి
కరుణామృతంబొసగు కారణంబు
సామాన్యమానాకు సాధ్యంబెనీస్మరణ
నేమరకుండెడు విధమెరుంగ
స్వల్పమాయల్పుల స్వాధీనమవుటకు
కల్పనలేవియు గలుగకుండు

విషయవిముఖులు నినుజేరి విజయులైరి
రసికు లపవర్గ పదవికి రాజులైరి
పరమ కళ్యాణ॥ 57

సీ॥ ఓ దేవదేవ నీ వోంకార మయుడవు
యాది దేవుడవయ్యు యఖిలమునకు
త్రిగుణగర్భితయువుచు దేవదేవియు నీదు
సన్నిధానమునందు సమతనుండి
మూర్తిత్రయులగాంచి ముజ్జగంబులలోన
కీర్తివహించి యకిల్బిషమున
సృష్టి స్థితి లయంబు సొంపుగా జేయుటకు
బ్రహ్మవిష్ణీశ్వరుల బాధ్యతలను
నిలుప నీదయగాక భువి నేమిగలదు
మలిన మేమియు లేనట్టి మాన్యచరిత
పరమ కళ్యాణ॥ 58

సీ॥ నిర్దయగలుగ నన్నె వరుపాలింతురు
సార్థక మేది నా జన్మమునకు
యెన్ని యిడుములుబడిన నిన్నె నమ్మ్మటజూపి
మన్నించుమని నిన్ను మనవిజేతు
యున్న దేనీవని యూహించి జగమును
సున్నగా భావించు చూపుగరపి
కలిమి లేములుజూచి కాక్షింపకుండునా
తెలివియొసంగి నను దేల్చుమంటి
నీకు దోచనిపను లేవి లోకమందు
సర్వసాక్షివి నీవెగా జగమునందు
పరమ కళ్యాణ॥ 59

సీ॥ కామాదిగుణముల స్తోమంబులునుగ్రమ్మి
బాములుబెట్ట నినుబాయకుంటి
ప్రారబ్ధకర్మముల్ బంధించి బాధింప
దూరమైనినుజూడ నేరనైతి
నాతప్పులనుజూచి నన్నె నిందింపుమను
బాధలపాలనుచు బోధపడితి
మూఢుడనౌచును వాదవాదములుదిరిగి
వేడుకలనుజూడ వెరగుపడితి
తుట్టతుదకును నన్నేలు దొరవటంటి
తిట్టికొట్టిన నీవె నాదిక్కటంటి
పరమ కళ్యాణ॥ 60

సీ॥ దురితాంబురాశిని దొలగద్రోయుటకెవరు
పరమపురుషులనంగ బడినవారు
విశ్వాసమున ప్రజలు వీక్షించుటకునెవరు
శాశ్వతులని యన జాలువారు
తల్లిదండ్రులమాడ్కి దయజూప నెవ్వారు
చల్లనివాక్యములు జల్లువారు
బహుజన్మవాసనల్ బాపుటకెవ్వారు
పరిశుద్ధహృదయులై బరగువారు
నిర్విచారుల దరిజేర్చ నెంచువారు
యుర్వి మీకంటె వెదకిన నొకరులేరు
పరమ కళ్యాణ॥ 61

సీ॥ మనసుబాహ్యంబున మసలుచు దిరుగును
బుద్ధినిశ్చయమున బోవుచుండు
చిత్తమాలోచన సేయగా నెంచును
అహమభిమానంబు నందుచుండు
యిట్టివ్యాపారముల విహరించునాల్గింటి
గట్టిగానినుజూడ గనుటమేలు
దుష్టవృత్తులకివి దోడ్పడకుండ నిను
స్పష్టపరచినవారె శ్రేష్ఠులయిరి
గావునను నీదు కృపగలుగ ఘనతబొంది
త్రోవదప్పక నడచుటే దొడ్డతనము
పరమ కళ్యాణ॥ 62

సీ॥ పంచతన్మాత్రలు పరిపరివిధముల
పొంచిచూచును విషయ పంచకముల
మంచిశబ్దములనెల్ల నెంచియోచించుచు
మంచిమార్గమున నేషుంటలయు
యింద్రియస్వాధీన మొందినవారల
జెంద జాలవు మాయ గ్రంథులెలమి
యోగ్యతగలిగిన యోషికపరులంత
భాగ్యమున నిట్టిదని బలికినారు
శుద్ధసంకల్పమే మహా శుభమటంచు
బుద్ధివంతులు నిర్ణించ బూనినారు
పరమ కళ్యాణ॥ 63

సీ॥ దృష్టిపవనము సనను పూరించునబోళ నిను
స్పష్టపరచుట మహా సుఖకరంబు
అష్టప్రకృతులబట్టి యణచివైచుచు నిను
స్పష్టపరచుట మహా సుఖకరంబు
అష్టాక్షరంబుల యర్థమెరిగియు నిన్ను
స్పష్టపరచుట మహా సుఖకరంబు
యిష్టార్థములనొసగు యీశ్వరుడవీవనుచు
స్పష్టపరచుట మహా సుఖకరంబు

నిష్టదప్పక నినుగొలుచు నిశ్చయంబు
కష్టములు దీర్చుటకు నదియె కారణంబు
పరమ కళ్యాణ॥ 64

సీ॥ ఆధార మాదిగా నారుచక్రంబుల
శోధించి పై నిలువ శోభితంబు
సాధకులై యితర సంగంబు విడనాడి
శోధించి నినుగొలువ శోభితంబు
నాదాంతమున తెలయు వేదాంతమయుడవని
శోధించి నిను జూడ శోభితంబు
ఆది అంత్యము లేని వేదవేద్యుడ వనుచు
శోధించి నిను గలియ శోభితంబు

మోదమున నీదు కథలెల్ల మున్న మనుచు
శోధనము జేసి మెలగుటె శోభితంబు
పరమకళ్యాణ॥ 65

సీ॥ సర్వ సంకల్పములు సమతనుండెడు చోట
నిర్వి చారంబున నిలచుబుధులు
తమలోన తాముండి తను కర్త్వమును గనక
విమలులై జగమున వెలయు ఘనులు
చూపుగదల్పక సుస్థిరమతులౌచు
ప్రాపకంబని నిన్ను బడయు మునులు
హృదయ స్థితునిగాను వదలకను యేప్రొద్దు
పదిలముగనిను గాంచు బ్రహ్మవిదులు

నీవె యాధారమనుచు నిశ్చయించి
బాహ్య సంచారమునకును బాలుపడరు
పరమ కల్యాణ॥ 66

సీ॥ నీకరుణా కటాక్ష వీక్షణమున
నీకరునే పాపముల్ సోలయుగాక
సాక్షిగానిన్ను వీక్షించు కాలంబున
శిక్ష లేదెందు రక్షితమెగాని
తులలేని నీ కథల్ విను ముక్తులెప్పుడు
చలన మొందరు విషయ సంగతులకు
అతి మోదమున నీవె గతియని నొనియూను
మతి గలుగు వారికి వెతలు గలవె

ప్రాప్తఫలమున తృప్తులౌ భాగవతులు
జ్ఞప్తివిడుపక నీలోన గలియుగలరు
పరమ కల్యాణ॥ 67

సీ॥ కాలమెల్లను వృథా గడచిపోవుట జూచి
బేలతనంబనెడు భీతిదోచె
మృత్యు వాతను బడి మూల మెరుగక నున్న
వ్యత్యస్తమరణమను వెరపు దోచె
నర జన్మమున గురుని కరుణ బడయక నున్న
తెరవు లేదని మదికి తెలివిదోచె
దేశికాచార్యుని దివ్యోపదేశమున
గాసిదీరెడు మహా ఘనముదోచె

అన్ని సుభములు గూర్ప నాధారమైన
నిన్ను దలుచక గలుగవివి యెన్నడైన
పరమ కళ్యాణ॥ 68

సీ॥ వేమారు నీ సత్యనామంబు గొనియాడ
తామస స్తోమంబు తరిగిజనును
నిమిషమైనను నీదు క్రమమెరిగి భజియింప
మమకారములు వీడి మరల గలవు
తమసంబు సూర్యుని దాపుజేరనియట్లు
కామ్యముల్ ఘనులను కలియబోవు
అమిత శుభంబుల యూటపట్టవు నిన్ను
సుమతులు విడి వేరు జూడబోరు

నమ్మి నమ్మని వారలసామ్యుగావు
సమ్మతులబాసి యుచటికి జరుగనీవు
పరమ కల్యాణ॥ 69

సీ॥ కల్ల నిజంబుల గని దయాదృష్టితో
నెల్లకాలము ప్రజలనేల నెవరు
అపరాధములబట్టి కృపతోడ ఖండించి
విపరీతముల బాపు వేత్తలెవరు
కాదు లేదని బల్కు వాదంబులను దీర్చి
పాదులోనిల్పి పాలింపనెవరు
దుర్బలులను భువిని నిబ్బరమున నిల్పి
అబ్బురంబున బ్రోచు నధిపులెవరు

సర్వ సంపత్కరుండవని జనులు బొగడ
నిర్వహించిన వారెవరు నీవుదప్ప
పరమ కల్యాణ॥ 70

సీ॥ దీక్ష గలిగిన వారి రక్షించుటకు నీవు
యక్షరుడవై యుంటి వవనిలోన
కక్షిన జాండముల్ గూర్చి వీక్షింపుచును
పక్షపాతము లేని ప్రభుడ నీవు
పక్షివాహనుడవై సాక్షాత్కరింపుచును
నిక్షేపమొసగెదు నిధివిగాను
శిక్షింప రక్షింప శ్రేష్ఠుడ వన జెల్లు
మోక్షప్రదాతవు ముజ్జగముల

నీకు సమమైన వారల నెరుగబోము
సకల సంపద్విశేష సర్వార్థపోష
పరమ కల్యాణ॥ 71

సీ॥ తన్ను జూచియుపుడు తనకు దెలియనిదేవి
తన తప్పు నెరుగమి తగనిపనియె
యొప్పు దెలసియు తనకు జెప్పుకొనుటయె మేలు
చెప్పినవారలె గొప్పవారు
తనగొప్ప నెన్నుట తగనికార్యంబవును
యొరుల తప్పిద మెన్న నొప్పుగాదు
సుమతులు నినుదప్ప చూడనొల్లనివారు
క్రమమిదే సుఖమునకు కారణంబు

యితర చింతనగలిగి బ్రతుకువెతలు
యతులితానందమును బొందరవనియందు
పరమ కల్యాణ॥ 72

సీ॥ సత్యసంధులు నీదు సదనంబునను జేరి
వదలకనుందురు వైభవమును
అత్యాశపరులంత యారాటమున జగమె
సత్యమని గాంచుచును చాటుచుంద్రు
ప్రత్యక్షమున జూడబడు ప్రపంచంబంత
మృత్యువాతను బడిమునుగుచుండ
నిత్యమని బలుకుట నిజముగాదిది
తాను ప్రత్యగాత్మని దెలియబడనివారి

భ్రాంతియేగాని నిజమని బలుకుటెల్ల
వింతగా దోచదే దీని విధమెరుంగ
పరమ కల్యాణ॥ 73

సీ॥ నిర్మలులై ప్రజలు నిన్ను గొల్చుటకంటె
ధర్మమేమున్నదీ ధరణియందు
గోప్యమా నిన్నెందు గొనియాడుటకుదప్ప
సౌఖ్యమేమున్నదీ జగతియందు
సత్కర్మపరులు నీ సన్నిధానము కంటె
యెక్కువేమున్నదని వెదకిరిట్లు
పాపముల్ విడ నిన్ను ప్రార్థించుటకుదప్ప
దాపైన మార్గముల్ ధరను గలవె

సర్వ సంపత్కరుండవై యుర్వియందు
నిలచి వర్తించు నీకంటె నితరు లెవరు
పరమ కల్యాణ॥ 74

సీ॥ జప తప హోమముల్ జరిపి జరుపక నిన్ను
నెపములన్నియు దీర్చు నేతలెవరు
స్నాన సంధ్యలు నెపుడు జేసి చేయకనున్న
హీనులని జూడని విహితులెవరు
సద్గ్రంథ పఠనంబు సలిపి సలుపకయున్న
వ్యర్థులని పలుకని వేద్యులెవరు
కులధనసంపదల్ గూడి కూడకయున్న
తలపు వేరుగలేని దాతలెవరు

అన్ని కార్యంబులకు మిగిలియున్న నిన్ను
సన్నుతింపుచు మరువని జన్మమేలు
పరమ కల్యాణ॥ 75

సీ॥ దేశ దేశంబులు వేసరక దిరిగినను
జేశిన పాపముల్ బాసిబోవు
సకల యాత్రిలు దిరిగి సన్యసించిన నేమి
సుఖము గలిగించెడు సూటిగాదు
సర్వ తీర్థంబుల స్నానంబొనర్చినను
గర్వ గ్రింధులు బోవు క్రిమముగాదు
నిజమెరుంగక వట్టి నిష్ఠలు సలిపిన
సుజనులు జేరెదు చోటుజోరరు

నిన్ను గనకున్న మిగిలినవన్ని సున్న
తలపు నీయందు జేరని ఫలమదేమి
పరమ కల్యాణ॥ 76

సీ॥ యింతకాలము నన్ను వంతలలోనుంచ
పంతమా నాపైని ఫలమదేమి
బీద మానవుడ నను ఖేదరహితునిజేయు
వాదమా నీదయ రాదదేమి
యెన్నాళ్లు జగమున మన్నింప కుంతువు
కొన్నాళ్ళకయిన యిది సున్నగాదె
లోకభ్రాంతినిజూచి లోపడకమనునట్లు
సాకి నీలోగలుప సన్నుతింతు

తప్పదిది రక్షణముజేయ నెప్పుడైన
గొప్పవాడవు నీవని గొలుతునయ్య
పరమ కళ్యాణ॥ 77

సీ॥ యెందరో నినుగొలిచి బంధంబులనుబాసి
యుందురని నేజేతు వందనములు
తనయుని కష్టముల్ తలిదండ్రులెప్పుడు
ఘనమని జూతురా కరుణలేక
నీవె తలిదండ్రివని నిజముగా హృదయమున
భావింపుచుంటి నిర్భయుడనవుచు
ఆపదోద్ధారకుడవని నిన్ను భజియింతు
లోపంబులెల్లను బాపుమయ్య
వరదుడవు నీవుగావె నా వాంఛ దీర్ప
పరమ పురుషుడవనజెల్లు భాగ్యచరిత
పరమ కల్యాణ॥ 78

సీ॥ నీ మృదు పాదముల్ నీమంబుతో గొలువ
యమృత సేవన మవును యనుభవింప
విడువక నీ కథల్ వినువారికెల్లను
వీనుల విందవును విశ్వమందు
నీ యాజ్ఞలోనిలచు నీతివంతులకెల్ల
ఆయాసములు దొలగి శ్రేయమవును
నీ రూపు నీకీర్తి నిర్ణయించెడివారి
కారూఢమున నిన్ను జేరనవును
యితర చింతన లేనట్టి యేతరుణులకు
సతతమును నిన్ను గలసెడు సాధనవును
పరమ కల్యాణ॥ 79

సీ॥ నీటిపై బ్రాతవలె నిలువని దేహముల్
పాటించి నిలుపుటకు బలముగలదె
శతవత్సరంబుల మితమాయు వందురు
గతమగునదెప్పుడో గానబడదు
కాయమే గృహముగా గల్పించుకుని జీవి
కాలంబు గడుపును కలవరమున
కలయు నిజమును గాంచిన ఘనులకే
తెలియబడును దీని తెరవదంత

వట్టి బూటకవృత్తుల గట్టిపెట్టి
ఘట్టిగా నిన్ను నమ్మితే ఘనతదెచ్చు
పరమ కళ్యాణ! 80

సీ॥ ఎవ్వారి కరుణాకటాక్ష వీక్షణమున
సకల జగంబులు సంభవించు
ఎవ్వారి దయాచేత నీయఖిల లోకములు
పోషింపబడి వృద్ధి బొందుచుండు
ఏమహానీయుని వీక్షణమున జగము
శిక్షింపబడియును జీర్ణమౌనో
ఎవ్వరీజగమును వేరుగాగాంచుచు
జనన మరణము లేని జాడనుండ్రు

రట్టి సర్వేశ్వరుడవీవె యనుచు నిన్ను
ఘట్టిగా నమ్మిగొల్తు నను కరుణసేయు
పరమ కళ్యాణ! 81

సీ॥ లంచమేమివక నీ పంచజేరిన వారి
కొంచెపువరులని యెంచబోవు
మూఢులైనను నీదు జాడగని గొనియాడ
వేడుకతో వారి గూడినావు
పాపంబులనుజేసి భయపడి నినుదలుచ
దాపునజేర్చి దయ యుంచినావు
తొల్లిటి యఘములనెల్ల ఖండింపుచును
చల్లని ప్రభువన జెల్లినావు
నీదు సాన్నిధ్యమెంతటి నిర్మలంబొ
బాధలెల్లనుదొలగి సద్భాగ్యమబ్బు
పరమ కళ్యాణ॥ 82

సీ॥ ప్రకృతి కావలవెలుగు పరిశుద్ధ మూర్తివని
సుకృతులు నిన్నెపుడు జూతురయ్యా
బుద్ధిసూక్ష్మతగల పుణ్యులునీకథల్
శుద్ధమని వీనులను జొరపిరయ్యా
పసలేని దేహమని పాటించియునునిన్ను
విసువకదలచుచు విడుపరయ్యా
ధర్మజిజ్ఞాసులై నిర్మలత్వమునొంది
కర్మబంధంబుల గలియరయ్యా
పరమ సంతోషమున నీదు భజనజేసి
భక్తులవ్యయ పదవిని బడసిరయ్యా
పరమ కళ్యాణ॥ 83

సీ॥ నా పాలిదైవమా నన్నేలుటకు రావె
కోపమా నాపైని లోపమేమి
నీవె నను గాపాడు నిఖిలేశ్వరుడ వనుచు
భావమున నిన్నెపుడు బ్రస్తుతింతు
దీనపోషకుడవని దిక్కులెల్లను మ్రోయు
బూనిన నీబిరుదు మానవలదు
యెట్టివిపద్దశల్ చుట్టుముట్టిన నిన్నె
గట్టిగాగొలిచెదు పట్టువిడక
బ్రాపు దాపని నీ పదపద్మములను
నొపికున్నంతవరకు నిను వదలబోను
పరమ కళ్యాణ॥ 84

సీ॥ తగ్గి సర్వులకు నే లొగ్గియున్నాడనని
యెగ్గుగాజూడ నాకెవరుదిక్కు
రక్షించుటకునీవు రక్షకుడవై యుండ
కక్షబూనిన నన్ను గావ నెవరు
మక్కువతోడను మమ్మాదరింతువని
మ్రొక్కువారల బ్రోవ మూలమెవరు
కార్యకారణముల కర్తృత్వమునుగలిగి
వైరమించుక లేని వారలెవరు
అన్ని భరియింప నీకంటె నధికులెవరు
భిన్నపరచిన నాకిక ప్రియులుగలరె
పరమ కళ్యాణ॥ 85

సీ॥ ప్రతినిమిషంబు నీ భజనజేయుటచాలు.
ప్రతములుసలిపెడు వాంఛయేల
ఆత్మానుభవమున యానందపడ మేలు
ప్రతికూలమౌ కర్మ ఫలము దేల
నిత్యసంతృప్తితో నిలచియుండుటచాలు
అత్యాశలోజిక్కి యడలుటేల
సత్సంగమున జేరి సంప్రదించుట మేలు
శక్తిస్తుతులనుగూడు కోర్కెలేల

కాలమూసన్నమైనదని గనుట మేలు
పాలుమాలియు నినుమరచు పనుల వేల
పరమ కళ్యాణ॥ 86

సీ॥ పరిపరివిధముల పరుగులిడు మనసును
మరలింపలేనట్టి మార్గమేల
అస్థిరమైయున్న యాలుబిడ్డలజూచి
సుస్థిరమనిదలచు సుఖము దేల
దుఃఖమయమౌ దేహ దుస్థితిగాంచుచు
మక్కువతోజూచు మమత దేల
విషసమమైయున్న విషయంబులను జూచి
పసచెడి మసలెడు పద్ధతేల
పాపసంహారమైన నీ ప్రాపు విడచి
చూపు ప్రాకృతముననిలుపు సొంప దేల
పరమ కళ్యాణ॥ 87

సీ॥ తుద మొదలన రాని సదయుడవౌ నిన్ను
వదలక హృదయమున పదిలపరచి
ముదముతో ధ్యానింప మోక్షార్థులవుదురని
చదివెదు సత్కథల్ శ్రవణములకు
మొదమొనరింప నీ పదపద్మములువిడక
మదిలోన దలతు మన్నింతువనుచు
నీ దయాదృష్టియే నిఖిలలోకములకు
సాదుగా పరిభవించు భాగ్యమవును

సర్వసామాన్యమని యెంచ జనదు భువిని
నిర్వికారంబునను వెలయు నీదురూపు
పరమ కళ్యాణ॥ 88

సీ॥ ఏకాంతవాసులై నీకరుణాగోరియును
చీకాకు లేకను సిద్ధిగలిగి
లోచూపునను సత్య లోకంబులో నిన్ను
గాంచివిడువక సర్వ కాలములను
యితరజోక్యము లేక హితవుగా నీయందె
మతినిల్పి సర్వార్ధ మహిమగాంచి
పతితులు గాకను పరతత్వరూపులై
మితిలేని సంతోషమునను మెలగి

నిన్ను జేరెదరని బుధుల్ నిర్ణయింప
నెన్నటికి మరువకను నమ్మి సన్నుతింతు
పరమ కళ్యాణ॥

సీ॥ సంగవిరక్తులు శృంగారయుక్తులు
భంగమెన్నఁడులేని భాగవతులు
మంగళప్రదమైన మహనీయమూర్తులు
లింగాంగనిరసనులు యింగితులును
రంగైననినుజేరి రాత్రిబవలునుగొలచి
పొంగుచును విషయముల బూదిజేసి
వెంగిళులుగాక వెలుంగుధీవృత్తి సు
సంగతులచె గడపి సుజనులొము

మధురమైయున్న నీనామ మంత్రజపము
హృదయ పద్మంబునను నిలిపి ముదముగనిరి
పరమ కళ్యాణ॥ 90

సీ॥ తప్పులనువిడదీశి తారుమారునుగాక
గొప్పగా నిన్నెరను గొలచువారు
తప్పదెటు మరణమని తమలోన తామండి
ఇప్పుడే నినుజేర నెంచువారు
నానాత్వమునువీడి పూనికతోనిన్ను
జ్ఞానసంపన్నులై గాంచువారు
అరలేని మనసుతో శరణార్థులవుచు
నీ కరుణగోరియుసన్ను గలియువారు

గలరు గలరని మునుశ్రుతుల్ ఘట్టిగాను
దెలుప నినుదలచెదను నీవె దిక్కటంచు
పరమ కళ్యాణ॥ 91

సీ॥ పావలలోపల వ్యాపకంబౌ నీదు
రూపమే బుధులకు ప్రాపకంబు
హృదయ పద్మంబున కుదురుగా నిలచు నీ
సదనమే సత్పురుష సాధకంబు
అన్ని దిశలకు మిగిలియున్న నీ నిజరూపు
గన్నవారలకదే ఘనతరంబు
సహస్రారమున సర్వసాక్షివై వెలుగు నీ
జాడగని సాధింప సాహసంబు
వన్నెలకుమీరి హాని లేకున్న నిన్ను
భిన్నమని గాంచకుండుటే ప్రియతరంబు
పరమ కళ్యాణ॥ 92



సీ॥ క్లేశంబులెల్లను బాసిపోవుటకు నీ
దాసదాసులుగాక దారిగలదె
వ్యసనంబులెల్లను మసిజేయుటకు నీదు
దెసజేరుటయెగాక తెరవుగలదె
పాతకరాసుల భస్మమౌటకు నీదు
హితవుగోరుటగాక వేరుగలదె
సంశయంబులు నెల్ల ధ్వంసమై చనుటకు
మాంసమయమౌ తనువు మరువవలదె
సకల సంసారబాధలు సమసిపోవ
సుఖకరంబుగ నిన్నెపుడు జూడవలదె
పరమ కళ్యాణ॥ 93

సీ॥ నీనామ రుచిగోరి నిత్య తృప్తినిబొందు
మానవు లెప్పుడు నిను మరువబోరు
హానివృద్ధులు గనక ఆనందమయులవుచు
ప్రానికతో నిన్ను బొగడినారు
సుఖదుఃఖములు లేని సొంపైన నినుగాంచి
అకుటిలు లవుచు నిన్నరయుచుందు)
యెడ తెగక వెలయు నీ పొడగాంచి బుధజనుల్
తడబడుపాటును తరుమ గలరు

నిన్ను సేవించుపుణ్యులు నిపుణులవుచు
భిన్నులవుదురె నినుజేర నెన్నడయిన
పరమ కళ్యాణ॥ 94

సీ॥ ధరణి జీవుల నెల్ల ధన్యులను జేయుటకు
కరుణా మయుడవన గలిగినావు
కర్మఫలంబుల కారణంబులు దెల్పి
ధర్మపరుండవన దనరినావు
ఏకమై నీవన్ని లోకంబులనుజూచి
పాకమెరిగియు నీవె సాకినావు
మతిమంతులకు మంచి గతిదెల్పుటకు నీవు
హితుడవై భువిలోన వెలసినావు

నిన్ను విడువనివారల నేలినావు
యెన్నడైనను మార్పు లేకున్న నీవు
పరమ కళ్యాణ॥ 95

సీ॥ తగ్గుమొగ్గులు లేని నిగ్గైన నీకథల్
యెగ్గులెంచక నెపుడు వినెడువారు
ఆదిఅంత్యము లేని వేదవేద్యుడవనుచు
శోధించి నినుజేర జూచువారు
తప్పులొప్పులు లేక ఎప్పటికి నొకరీతి
గొప్పగా వెలుగు నినుగొలుచువారు
ఆపదలనుదీర్చ నధికారివని నీదు
ప్రాపువీడకను భయపడనివారు
కోపమును మాని మమతను గోయువారు
గలిగియున్నారు నీ ఘనత గాంచిభువిని
పరమ కళ్యాణ॥ 96

సీ॥ కన రాని నీరూపు గనుటకెంతటివాడ
మనసు నిలకడ లేని మలినయుతుడ
సంకల్పములు మాయ పంకంబునను బొరలి
సంకటములముంచి సమయజేయు
యెంత జెప్పినగాని చింతలకేబోవ
పంతంబులాడును రంతులాడి
తెలివిని గప్పియు కలువరింతలగుప్పి
పలురీతులను భ్రాంతి బడయజేయు
యిట్టి దుర్ఘటమామనసు గట్టిపెట్టి
తుట్టతుదకును నీదయ బుట్టవలయు
పరమ కళ్యాణ॥ 97

సీ॥ మూఢుడనని నన్ను జూడ దయలేకున్న
తోడుగలిగిన దొడ్డ దొరలు యెవరు
పామరుడని నన్ను పారజూడక యున్న
నీమంబుననునిల్పు నియతులెవరు
బుద్ధిహీనుడవని వద్దజేర్చక యున్న
హద్దులో ననునిల్పు ఆప్తులెవరు
తెలివి హీనతచేత దేబెరించెడు నన్ను
అలసట బాపగల నధికులెవరు

తప్పులన్నియు సవరింప జాతలెవరు
తిప్పలన్నియు బాపుటకు తప్పదయ్యా
పరమ కళ్యాణ॥ 93

సీ॥ వదలక నీపాద వనజముల్ సేవించు
బుధజను లార్తిని బొందరయ్యా
కదలని మనసుచే ఘనులెల్లయెప్రొద్దు
ముదమున నినుగాంచి మురుతురయ్యా
దృష్టిభేదములేని శ్రేష్ఠులు నినుదలచి
యిష్టదైవంబనుచు వేడిరయ్యా
సత్పురుషశ్రేణిలో సాక్షివై నీవుండి
యుత్పాతములు బాపు చుండువయ్యా

భక్తిగలిగినవారల భయముదీర్చి
ముక్తులనుజేయుటకు నీవె మూలమయ్యా
పరమ కళ్యాణ॥ 99

సీ॥ దొడ్డప్రభుడవు నీవు అడ్డమెవ్వరు నీకు
యెడ్డెనని ననుజూడ నెవరుదిక్కు
పదునాల్గు భువనములు పాలించుటకు నీవె
యధిపుడవైతివి యఖిలమునకు
దిట్టమై భువిలోన దిరిగి వేసారియును
చిట్టచివరకు నిన్నె జేరవలయు
అక్కరలనుదీర్చి ప్రక్కతోడైయుండ
యెక్కువెవ్వరు భువిని వేరునీకు

సర్వ సామాన్యమా నీదు జాడగనుట
నిర్వికారుడవై వెలయు నిర్మలాత్మ
పరమ కళ్యాణ॥ 100

సీ॥ నీ మహానీయమౌ నిర్మల తత్త్వంబు
కామాదివర్గముల గర్వమణచు
నీ సత్య శౌర్యంబు నిత్యప్రకాశమై
అసమానమవుచు నజ్ఞానమణచు
నీ సద్గుణంబులు నిజభక్తవరులకు
వాసనత్రయముల దోషమణచు
నీ విమల తేజంబు నిర్వికల్పంబునై
సువిచారులకు భువిని భవములణచు

అఖిల యోగంబులకును నాధారమవుచు
సుఖము నొనగూర్ప నీవుగా కొరకుగలరె
పరమ కళ్యాణ॥ 101

సీ॥ ధర్మబలంబున ధైర్యమవలంబించి
దుర్మార్గ వృత్తులను దునుమగలరు
కల్లజగంబనుచు కాంక్షనువిడనాడి
తల్లడపడుట దప్పింప గలరు
శాంతమమరి మహా సంతోషమును యెపుడు
వంతంబులకుబోవ బాలుపడరు
అతి సౌఖ్యమునుగోర నాయాసకరమని
మితిలేని కోరికల జతకుబోరు
నీదు సన్నిధిగలుగుటే మోదమనుచు
వాద బేదంబులన్నియు వదలినారు
పరమ కళ్యాణ॥ 102

సీ॥ చిన్ననాటినుండి నిన్నే స్మరించి
నీకన్న వేరే లేరటన్న నన్ను
మన్నించుటకు రావ మరిమరి నిను వేడు
కున్న దయలేద యాకొన్నవాని
కన్నంబుబెట్టియు యాదరింపక తల్లి
భిన్నంబుజేయునా యెన్నడైన
పన్నగతల్ప నాపాపముల్ బాప నీ
పున్నాములే నిన్న సన్నుతింతు
కలిమి బలిమియునీదె సద్ఘునుడననుచు
తలపులో నిల్పి ధ్యానింతు తథ్యముగను
పరమ కళ్యాణ॥ 103

సీ॥ దేహి దేహంబుల తెర వెరుక పడుటకును
దేవుడే గురుడనెడు తెలివిగలిగె
వున్నదున్నట్లుగా గ్రహించుటకు గురుని
మన్ననయే మాయ మమతదీర్చె
గుణరహితమైన నీ గురుతెరుగుటకు గురుని
కరుణ గలుగుటవలన కలతదీరె
సంగరహితంబైన యింగితంబదె గురు
పుంగవుదయచే నెరుంగబడియె
శుద్ధమైయున్న నీ మహా శుభముగాంచి
బద్ధతను బాయ గురుమూర్తి బలముగలిగె
పరమ కళ్యాణ॥ 104

సీ॥ దేశికమూర్తివై దివ్యతత్త్వము దెల్ప
వాసిగా కొమ్మాలపాటియందు
ఛరియూహలుస్నేక్షయను దైవనామముతోడ
కరుణామయుండన ఘనతబొంది
ఇసువక భక్తుల వ్యసనంబులను బాపి
అసిపదభావంబు నమరదెల్పి
తృప్తిపగచియు మహా దీప్తిచే భువనముల
వ్యాప్తుడై పర్వింప వశముగాక
నిరుపమానంద పదవిలో నిలచియున్న
గురుని గురుతెరుగ నీ మహా కరుణగాదె
పరమ కళ్యాణ॥ 105

సీ॥ నీవె మముఁ బాలింప నిజగురురూపమై
భూవలయంబున బుట్టినావు
ప్రకృతి కావల వెలుఁగు పరిశుద్ధ తత్త్వమును
సుకృతులు నినుగొలువ జూపినావు
అపరాధములు దీర్చి యద్భుతానందమున
కృపగలిగి భక్తులను గూడినావు
కులగోత్రములు లేక తలపులలోపన్న
దలచిన వారిలో నిలచినావు

నమ్మి నినుగొలుచుచున్నట్టి నమ్మకులకు
యిమ్ముగ నీవపుచు వెలిలోన విలసినావు
పరమ కళ్యాణ॥ 106

సీ॥ తప్పక నినుదలఁచ గొప్పవాడనుగాను
యెప్పుడైనను నిన్ను విడఁవబోను
నా భాగ్యమని నిన్ను నమ్మియుంటినిగాని
యేభాగ్యములకును వెదుకజనను
నిత్యమే నీవని నిశ్చయించితిగాని
సత్యమీజగమనుచు చాటలేను
ధర్మమే రక్షింప దారియని విందును
దుర్మార్గ వాక్యములు దూరివినను

దురితములు ద్రోయుదారవని మరుగఁజొచ్చి
శరణు శరణని నినుగోరి సన్నుతింతు
పరమ కళ్యాణ॥ 107

సీ॥ సంగరహితుడవవుచు భంగమేమియులేని
మంగళప్రద నీకు మంగళంబు
రంగుగను భువనముల శృంగారముగను వె
లుంగు శ్రీకర నీకు మంగళంబు
కుందురువారిపురమందు నెలకొనియున్న
మందరధర నీకు మంగళంబు
వాదమేమియులేక వాంచించె ఖాశీం
మాధవా నీకిదే మంగళంబు

సుమతులెల్లరు నినుగొలిచి సుఖమునొంద
మమతలనుదీర్చు మహనీయ మంగళంబు
పరమ కళ్యాణగుణనామ భవవిరామ
రహిని కుందుర్వారి పురాగ్రధామా. 108

గద్య

ఇది శ్రీ దరియాహుస్సేన్ షా ఖాదరి దేశిక సుజ్ఞానసుత
శ్రీ ఖాశీంవలీ షా ఖాదరి దేశిక ప్రణీతంబైన
పరమామృతంబను గ్రంథంబునందు శ్రీ రామ
శతకమునందు నూట ఎనిమిది సీస
ములు సమాప్తము.



# చిత్తశతకము.

శ్రీ శుభజింపుచుఁ వివిధ చింతలుబాసి వివేకివై సదా
దేశిక మూర్తిపాదములు దీనతతో శిరమందుదాల్చి నీ
యాశల గోసివేసి గురుయాజ్ఞకు జిద్ధతగల్గి యెప్పుడుఁ
పాశవిముక్తతఁ పరమ భాగవతాధిపుజేయ చిత్తమా. 1

ఉ॥ వందన మాచరింపుచును వారని నిశ్చయబుద్ధినిల్పి యా
నందము వీడకఁ గురుని నామసుధారస పాన తృప్తిచే
నందియు నేమిలేని ఘనసారవిచారు భజించుమార్గ మిం
పొందుగ గల్గునట్లు పరిపూర్ణపరాత్పరు గొల్వచిత్తమా. 2

ఉ॥ శాంతివహించిసర్వమును శాశ్వతబ్రహ్మమటంచు నెంచి యే
కాంతమునఁ సదా పరమకారణమూర్తి నిజస్వరూపముఁ
భ్రాంతిదొలంగి నిర్విషయ భావమునఁ దగజేర్చి వేద వే
దాంతవిచారుసన్నిధి నుదారతజేరగవచ్చుచిత్తమా. 3

ఉ॥ సారవిహీనమైన సంసారమునంటగ హానివచ్చు నీ
క్రూరగుణంబులఁ విడచి గోప్యత బ్రహ్మబిళంబుజొచ్చి శృం
గారరసంబులొల్కు సురగామినిగూడి సుఖించి పాప సం
హారకు భక్తితోగొలచి హాయిగనుండనమేలుచిత్తమా. 4

ఉ॥ లోకములెంతటన్ వెలిగి లోలత సర్వ శరీరధారులన్
సాకెడు తండ్రియై విబుధ సాక్షిగ నుండు కుందరాక తా
నేకముగా నభేద్యతను నేర్పరులన్ దయజూపి బ్రోచు సు
శ్లోకు ననాద్యు నిత్యు నతి శోభితు జేరి పఠింపు చిత్తమా. 5

ఉ॥ రాగవికారదోషగుణ రాశినదల్చి దయావిశేషతన్
వేగమె గావగల్గు సుర వేద్యపదాంబుజ భక్తినావచే
సాగరతుల్యమౌ విషయ సంసృతిదాటగ వచ్చునెప్పుడున్
యాగమవాక్యపద్ధతిని యార్తితో సద్గురు నమ్ము చిత్తమా. 6

ఉ॥ కోపముగల్గి కాలుభటకోటిమహాభయరూపులై నినున్
యాపదలందుబెట్టి తమయాజ్ఞకు బద్ధునిజేసి ప్రాణముల్
బాపెడువేళ్ల చింతిలిన బాయునె కష్టము నిప్పుడే జగ
ద్వ్యాపకు ప్రాపుగోరి పలువాంఛలు వీడి స్తుతింపు చిత్తమా. 7

ఉ॥ వాదములెల్లవీడి సరివారలసఖ్యత గల్గి యోగ్యులన్
భేదములేక వేడ్క బలు ప్రేముల బూజయొనర్చుచున్ సదా
మోదముతో మహాత్ములకు మ్రొక్కుచు నెంతటి బాధ
లొచ్చినన్
ఖేదము లేక సర్వమయు కీర్తనసేయుచునుండు చిత్తమా. 8

ఉ॥ తామసమొందరాదు పరదారలగోరి భ్రమించియుండుటల్
నీమముగాదు నిర్మలసునీతి వాచారుపదేశు యా పరం
ధాముని గొల్చియెల్లెడల ధర్మముదప్పక సంచరించి శ్రీ
రాముని రామరామయని రాత్రిబవల్ స్మరియింపు చిత్తమా. 9

ఉ॥ కారణమూర్తియాగురుని గానక యెట్టి వృథాప్రయాసలన్
జేరి సమస్తశాస్త్రములు జేకొనిజాటు ఫలంబుగల్గు నే
తీరని దుఃఖముల్ దొలుగ దివ్యత సద్గురు దేవుపాదముల్
గోరిభజింపుచున్ సకల కోర్కులుబాసి చరింపు చిత్తమా. 10

ఉ॥ భోగమయాంగముల్ మరియు బుద్ధియు నింద్రియముల్ జడంబులై
యేగునటంచు నీశ్వరుని యేకముగా మదియందు నిల్పియున్
జాగొనరింపకన్ యెప్పుడు సజ్జనగోష్ఠివీడకన్ మహా
యోగిజనానుసమ్మతిని యొప్పుగనుండ సుఖంబుచిత్తమా. 11

ఉ॥ యున్నగరాని బ్రహ్మమును యేర్పడగొల్చి తదేకనిష్ఠచే
మన్నగల్గిమాయనణుమాత్రమునమ్మక దేహభ్రాంతులన్
సున్నగజూచి యెల్లపుడు సూనృతివాక్యములన్ వచింపుచున్
యున్నతమైనమార్గమున యోగ్యతగల్గినటింపుచిత్తమా. 12

ఉ॥ యెప్పటికైన దేహమిది యెవ్వరితోడను జెప్పకేగు నీ
గొప్పతనంబులన్ వదలి గోప్యముగా హృదయాంతరంగ మం
దొప్పగ పూర్ణుడై నిలచి దోడ్పడిబ్రోచు నిరంజనున్ సదా
తప్పకనమ్మి వేడినను తాపములన్నియు దీరుచిత్తమా. 13

ఉ॥మున్ను పరాత్పరుండుతన మూలమునన్ మహదాదిశక్తి యం
దెన్నగ సర్వలోకములు తేటగసృష్టియునై వెలుంగ దా
నన్నిటియందు నేకమయి నాశములేని నిజస్వరూపమున్
తిన్నగజూచువారలకు దిక్కగుసద్వయు వేఁడు చిత్తమా. 14

ఉ॥ దీపపుకాంతిజూచి యది దివ్యతరంబగు వండటంచు దా
దాపున జేరి కీటకము దగ్ధమునొందిన రీతి మాయయే
ప్రాపని నమ్మువారలకు భారమెగాని మరేమి లాభమా
యోపికతోడసద్గురుని యొప్పుగబూజయొనర్పుచిత్తమా. 15

ఉ॥ మృత్తికటయ్యు కుంభములు ముద్దుగచాలవిధంబులైన యు
ట్లెత్తరి బ్రహ్మవిష్ణు శివదేవ శశాంకరి వానరుల్ నరుల్
మొత్తముసర్వభూతతతి మూలముతానెయటంచు నిత్యనిక్
తత్తరపాటువీడియును తాలిమితోడుతగొల్వు చిత్తమా. 16

ఉ॥ స్వాంతమునందు కేవలుని జాలనుతింపుచు యీషణంబులన్
చెంతకుజేరనీక గురుసేవ దృఢంబుగ జేయుచుండి స
ర్వాంతర వర్తియున్న నిజవాసమునందుల జూడ్కినిల్పి యే
కాంత తపంబొనర్పు పర కాంతనుజేరగవచ్చు చిత్తమా. 17

ఉ॥ జీవగుణంబులన్ వదలి చిన్మయిజూచుచు కామ్యకర్మముల్
భావమునంటనీక పర భావముజూడక భక్తిశ్రద్ధలన్
దేవునియందు నిల్పియును దేహము హేయకరంబటంచు నీ
యావరణంబుబాపి మరియాదచె నీశ్వరునమ్ముచిత్తమా. 18

ఉ॥ వాసనలన్ని వీడి నిజవాసముజేరి దయామయున్ మహో
ల్లాసముతో నుతింపుచు విలాసములన్ మదిజేర్పకున్న మున్
జేసినపాపముల్ జనవె శీఘ్రగతిన్ సకలేశు పాదముల్
వేసటజెందకన్ యెపుడు వేడుకతోడుతనమ్ముచిత్తమా. 19

ఉ॥ మానవజన్మమెత్తియును మాయకులోబడి హీనవృత్తులన్
జ్ఞానము లేకగోరి తన నార్జితకిల్బిషరాశిచే మహా
హానిచెడజొచ్చెకంటె మరి హాయిగనీశ్వరుపూజచే మనో
ధ్యానము చేయుచున్ పరుని ధర్మముతప్పక గొల్వు
చిత్తమా. 20

ఉ॥ దేహములోపలన్ హరుడు దివ్యతరంబు నిండియుండి హం
సోహమటంచుబల్కుచును సూరిజనుల్ గురితింప నేకమై
ద్రోహము లేక నిర్మలత తొల్లిటిరూపము జెందు కేవలున్
యూహలొనర్చి యెల్లపుడు యోపికతో భజియింపు
చిత్తమా. 21

ఉ॥ మాపులలోపలన్ మిగులసూక్ష్మస్వరూపముగల్గియుంతటన్
వ్యాపకమై నిరంతర మవాంచితుడై జగమెల్ల బ్రోచు హృ
ద్దీపకు బ్రాపుగోరి కడు దీనతతో శరణంచు వేడ నీ
తాపములన్ని బోనణచి దాపుకు జేర్చునుగాదె చిత్తమా. 22

ఉ॥ యేవిధి జూడ తానెయయి యేమియుగాక వినాశనోద్భవం
బేదియు లేక నిత్యమయి బ్రీతిచె సద్గురు రూపుజెంది నిం
పాదిగ నుండు భక్తులకు బ్రాపయి బ్రోచు పరాత్పరుం సదా
మోదముతో యహర్నిశము మ్రొక్కి స్తుతింపుచునుండు
చిత్తమా. 23

ఉ॥ గాలియు దృష్టిమానసము గట్టిగ కుండలియందు జేర్చి యా
లీలలు గాంచి భావమును లేశము వేరుగబోవనీక స
త్కాలముగూడెనంచు ఘనకారణమూర్తి నిజప్రభావమున్
తాలిమితో దలంచుచును దారిదొలంగక నుండు చిత్తమా. 24

ఉ॥ పుట్టినదాది సత్కథలు పూనికతో చెవిసోకనీక బల్
దిట్టగ భూమిపై దిరిగి తీరనిదుఃఖము జెందుకంటె నే
డెట్టులగాకనున్నయది దెల్యగ నెవ్వరి శక్యమౌను నీ
పుట్టువు లేకపోవుటకు పూర్ణుని గొల్వగరాదె చిత్తమా. 25

ఉ॥ చెప్పినదంత చేయుటకు జేరువ సద్గురుమూర్తియుండగా
తప్పడు త్రోవలన్ జనుట దారియె ధర్మవిరుద్ధమైన నీ
తిప్పలు జెప్ప నీలవు నె తీవ్రగతిన్ పరమాత్మ సేవకున్
తిప్పక బోయి చేసి పరితాపము మాన్పకనుండు చిత్తమా. 26

ఉ॥ వాదము లేక నీకు నిజవాక్యము తోడయి యున్న జాలదా
భేదము మాని సర్వసమపాది విరాట్స్వరూపకుని పావనప్రేమ జెలంగ
పఠింపజాలు సమ్మోదము దో జగద్గురుని ప్రేమలను నిల్పి
మహానుభావ నీపాదములందు దృష్టి పరభావము నీదని
వేడు చిత్తమా. 27

ఉ॥ ఎవ్వరు దిక్కునాకనుచు నేలిన దేవుని వేడుకొంచు న
న్నొవ్వగ జేయకో ప్రభువ నోర్పుగ దీనుల బ్రోచువారలిం
కెవ్వరు దిక్కుగల్గిరని కేవలు కీర్తన సేయుచున్ ననున్
దవ్వుగ జూడబోకుమని దాపున జేరి స్మరించు చిత్తమా. 28

ఉ॥ పూజితమైన మార్గమున బోవుచు నార్యులు బల్కు పల్కులే
రాజిగ వించు భక్తులకు రాజ్యమె మోక్షమటంచు నెప్పుడా
తేజములోను తేజమును తేటగ జూచి సుఖంబు జెందుచున్
భూజనులందు పూజ్యతను బొంది పరంబును గాంచు చిత్తమా. 29

ఉ॥ మాటలపాటలన్ గురుని యాలబుపాడుచు మింద్రియావళుల్
బూటక. మృత్తులన్ జనని భోగ్యముఁజూచి నిరంతరంబు యా
కూటముజేరి పాపముల కూలగజేసి యభేద్యమైన శృం
గాట కవాటమున్ దెఱువగల్గిన సర్వముగల్గు చిత్తమా. 30

ఉ॥ యెంతటియాపదల్ గలుగ యేమిభయంబును జెందకాత్మలో
సంతసమొంది నిర్మలుని సాక్షిగగాంచి మహానుభావ నీ
చెంతను జేరియున్న నను జేకువనుంచవె శ్రీ సదాశివా
సంతమహాత్మయీశ గురుపాదయటంచునుతింపు చిత్తమా. 31

ఉ॥ మాయలలోనబోక పరమాటలు వీనులజేరనీక యీ
కాయము నిల్వబోనిదని కాలముజూచుచు కల్మషంబులన్
హేయముగాదలంపుచును హేయము మృత్యోశరీతి నెంచియున్
హాయిగనున్న దేవుని సహాయముగల్గును నమ్ము చిత్తమా. 32

ఉ॥ కోపముమాని శ్రీహరిని గోప్యముగా మదినెంచ దృశ్యముల్
రూపముగల్గి లేనివని రూఢిగగాంచి ప్రకాశమెల్ల యా
శ్రీపతిదంచు జూచుచును శీఘ్రగతిన్ పరమాత్మ జేరుచే
ప్రాపని భక్తపోషణుని ప్రార్థన జేయుచునుండు చిత్తమా. 33

ఉ॥ లోకములెల్ల నీకడుపు లోపలనుండినయట్లు దేవతల్
నీకొరకే భయాత్ములయి నిన్నె స్తుతించినయట్లు శాస్త్రముల్
నేకవిధంబుగాబలికె యెవ్వరవేదునో మహాత్మ నన్
సాకెదుతండ్రిపి పెదని సర్వమయాత్మునిగొల్వు చిత్తమా. 34

ఉ॥ ఏమియుగాక నీశ్వరుఁడు యెందుచునంటక యేకరీతిగా
నోమిననోముపంటయయి నొవ్వగజేయక దాసదాసులన్
ప్రేమతో తండ్రిరీతిగను పెంచి సమస్తఫలంబులిచ్చు యే
బాములజేరరాని నిజబ్రహ్మము నెప్పుడు వేఁడు చిత్తమా. 35

ఉ॥ మూఁడుయవస్థలందు హరి మూలము తానయి వేరువేరుగా
జోడయిదోచుచున్ మరియు జోడుగదోచక మాయరూపుడై
యాడుచుపాడుచున్ సుఖము నొందున దుఃఖము జూచి చూపకన్
యీడయియున్న విశ్వమయు నెప్పుడు నమ్మి భజింపు చిత్తమా. 36

ఉ॥ చచ్చుచుపుట్టుచున్ ప్రకృతి జాడయెఱుంగక మూఢచిత్తుడై
హెచ్చుగ పాపకార్యములు హెచ్చుకరంబని దల్పకాత్మలో
మెచ్చుచు జేయుచున్ తుదను మెండుగ దుఃఖము జెందుకంటెయా
సచ్చరితున్ భజింపుమను సాక్షిగ జూచిన జాలు చిత్తమా. 37

ఉ॥ నాదము లెల్లవీనుల సునాదముగా విని నీవు నేననే
భేదములేక యెల్లపుడు భీతియెఱుంగక సత్వరూపమై
మోదముతో కరంబులను మోడ్చిమహేశు నమస్కరింపుచున్
సీదయ గల్గజాలునని నిర్మలభక్తితో గొల్వు చిత్తమా. 38

ఉ॥ సర్వశరీరధారులను సాకుచు నెవ్వరికందరాక తా
నిర్వచనీయుడై ధరను నీతివిచారుల బ్రోవ దుష్టులా
గర్వాలద్రుంచ కర్తయయి గన్పడు శాశ్వతకీర్తనంబు నే
యుర్విని విన్నజాలుగద యోపికతో ప్రభు నిల్పు చిత్తమా 39

ఉ॥ యేమియుగాక నీశ్వరుఁడు యెందునునంటక యేకరీతిగా
నోమిననోముపంటయయి నొప్పఁగ జేయక దాసదాసులన్
బ్రేమతో తండ్రిరీతిగను పెంచి సమస్తఫలంబులిచ్చు యే
బాములజేరరాని నిజబ్రహ్మము నెప్పుడు వేసు చిత్తమా. 35

ఉ॥ మూఁడవయవస్థలందు హరి మూలము తానయి వేరువేరుగా
జోడయిదోచుచున్ సరియు జోడుగదోచక మాయరూపులై
యాడుచుపాడుచున్ సుఖము పొందునదుఃఖము జూచి చూపకన్
యీడయియున్న విశ్వమయు యెప్పుడునమ్మి భజింపు
చిత్తమా. 36

ఉ॥ చచ్చుచుపుట్టుచున్ బ్రకృతి జాడయెఱుంగక మూఢచిత్తుడై
హెచ్చుగ పాపకార్యములు హెచ్చుకరంబని దల్పకాత్మలో
మెచ్చుచు జేయుచున్ తుదను మెండుగ దుఃఖము జెందుకంటె యా
సచ్చరితున్ భజింపుచును సాక్షిగ జూచినజాలు చిత్తమా. 37

ఉ॥ నాదము లెల్లవీనుల సునాదముగా విని నీవు నేననే
భేదములేక యెల్లప్పుడు భీతియెఱుంగక సత్వరూపమై
మోదముతో కరంబులను మోడ్చిమహేశు నమస్కరింపుచున్
నీదయ గల్గజాలునని నిర్మలభక్తితో గొల్వు చిత్తమా. 38

ఉ॥ సర్వశరీరధారులను సాకుచు నెవ్వరికందరాక తా
నిర్వచనీయుడై ధరను నీతివిచారుల బ్రోవ దుష్టులా
గర్వులద్రుంచ కర్తయయి గన్పడు శాశ్వతుకీర్తనంబు నే
యుర్విని విన్నజాలుగద యోపికతో బ్రభు నిల్పు చిత్తమా 39

ఉ॥ చేసినఖర్మముల్ మరియు జేయని కర్మములన్ని దైవమే
వ్రాసిగజూచుచుండు నిక వన్నెలు చిన్నెలు జేయబోకు నీ
గాసిదొలంగి కేవలుని గాంచిసుఖించుట కంతరాత్మ నిన్
వేసటలేక జూచి యతివేడుకతో గురు వేడుచిత్తమా. 40

ఉ॥ జాగర స్వప్నసుప్తు-వి జాలముగా మదినెంచి వానినిన్
బాగుగగాంచు జ్ఞానమును బ్రహ్మముగాదలపోసి విశ్వ సం
యోగముచేస్పృథాభ్రమఃయోగ్యతయుంచుదలంచుచుండుయా
యోగిజనంబులన్ గలసి యొప్పగ దేశికునమ్ము చిత్తమా. 41

ఉ॥ దుర్భగమైనమాయ పతిమాత్రముగా దొలగింపగాదగున్
నిర్భయముండరాదు భవనీరధిదాటుట దుస్తరంబు నీ
వర్భకు నీతిమాయని నైజపమూర్తిని వదలకుండుమూ
దుర్భేఖులైన వారలకు దోసగదా గురుమూర్తిచిత్తమా. 42

ఉ॥ యేటికి దేహభ్రాంతులిక యెవ్వరితోడుగరారు వెంట నీ
నాటిజనుల్ నిరాశులయి సర్వసుఖంబులు వీడిపోరే యీ
బూటకవృత్తులన్ విడిచి బుద్ధి పరాత్పరుయందుజేర్చి యీ
పాటుంబడ నీశ్వరుడు పాలనజేయునుగాదె చిత్తమా. 43

ఉ॥ పాపలలోపలన్ వెలుగు పద్మదళాక్షుని సేవచే వృథా
తాపములందుజేరకను లక్ష్యము భ్రూయుగమందునిల్పి యే
లోపము లేక పూర్ణుడయి లోవెలి నిండి యఖండమైన స
ద్రూపుని జేరి వాచ్యమును ద్రోసిసుఖింపగరాదె చిత్తమా. 44

ఉ॥ చూడగచూడగాతనలో చోద్యముగాగనుపించు చిత్కళల్
తోడయితోచియావలను తోడుగదోచక యెందుడాగునో
జాడయెరింగి దానిపయి జక్కగబుద్ధిని జేర్చి నిర్మలుల్
వేడుకతోడ జేరి సుర వేద్యుని మరువకనుండు చిత్తమా. 45

ఉ॥ చెప్పగరాని సౌఖ్యమును జెప్పగనెవ్వరి శక్యమవును. నీ
గొప్పతనంబులన్ విడచి గోప్యముగా సుఖరంబుజొచ్చి యే
చప్పుడుగల్గ వేరుగ విచారముబోని వకాత్మయుండె యె
ల్లప్పుడుసౌఖ్యముల్ గని విలక్షణుగాంచిభజింపుచిత్తమా. 46

ఉ॥ దృక్కుయదృశ్యముల్ సకలదోషవినాశ వశంబుజేసి యే
ప్రక్కనుగన్నసర్వమయుభక్తితొగాంచుచు నింద్రియంబులన్
చిక్కులలోనబోనివక చిన్మయుప్రాపునజేర్చి యొప్పుడున్
చక్కనిమార్గమందు నతిజాగ్రతగల్గి నటింపుచిత్తమా 47

ఉ॥ పాపములేనిబాటయిది ప్రాపయియుండగ నేరుత్రోవలన్
వ్యాపకమొంది దుర్విషయ వాంఛలబొంది తపింపలాభమే
యోపికతోడ నద్వయుని యొప్పుగనమ్మి స్మరింప నీదు సం
తాపముబోయిముక్తిగను దారిగనుండు నెరుంగుచిత్తమా. 48

ఉ॥ యుల్లములోన సద్గురుని యూహసదామరుపేమిలేక యీ
కల్లజగంబుజూచి కనుగానని పాట్లు హరించి ధీనతన్
తల్లియు దండ్రి దాతయును దైవము దేశికమూర్తియందు నీ
వెల్లపుడార్తితో నిగమవేద్యుపరింపుచునుండు చిత్తమా. 49

ఉ॥ దృశ్యము నశ్యమంచు పరదూషణలన్ జెవిసోక నీకు సా
దృశ్యముగా ననేకులటు దుఃఖితులై మరణింప జూడవే
నశ్యము గల్గు దేహమిది నాయదియంచు భ్రమించి నిల్వ నీ
వశ్యమె భక్తపోషణుని వద్దికతో స్తుతియింపు చిత్తమా 50

ఉ॥ చూచినదోచుచుండుమరి చూడకయుండిన దోచకుండెడిన్
గోచరమా మహాత్ములకు గొప్పగదోచి సుఖంబులిచ్చియా
లోచనస్థానమందె యతిలోలత గల్గి వసించు బ్రహ్మమున్
యోచనజేసి యల్లపుడు యూహాలొనిల్పి భజింపుచిత్తమా 51

ఉ॥ గాజుఘటంబు లోపలను గన్పడు దీపమదెట్లో యట్లె యీ
భూజనులంచు నిన్నుగను పుణ్యుల జీవములెల్ల స్వచ్ఛమై
పూజితమానుగాదె ననుబ్రోవవె యార్త శరణ్యయంచుయా
రాజితమైన దేవుపద రాజములన్ గురినిల్పు చిత్తమా 52

ఉ॥ లోకము లోపలన్ విషయ లోలత గల్గి వికార రూపులన్
జేకొని సర్వబాధలచె జిక్కి కృశింప బ్రయోజనంబె
సుశ్లోకు నిజప్రభావమును శోధనజేసి యహర్నిశంబులున్
యాకలి గొన్న వారివలెయార్తితొ నిత్యునిగొల్వుచిత్తమా. 53

ఉ॥ మచ్చికతోడ మానసము మాధవుసేవలో నిల్పి యెప్పుడా
సచ్చరితుల్ గనుంగొనుచు సత్యము వీడక సర్వకాలముల్
హెచ్చినిజాత్మతోగలియుహేతువుగాంచిసుఖింపుచున్ సదా
నిశ్చయమొందినిర్మలుని నేర్పుతొ గొల్చి భజింపుచిత్తమా 54

ఉ॥ అన్నమయాదికోశముల నైదిటి కావలనెల్లు బ్రహ్మముం
గన్న మహానుభావులకు గారడిగా గనుపట్టదే జగం
బెన్నటికైన నిల్చునె యుపేక్షజనింప సుఖంబుగాదు నీ
వున్నది వున్నయట్లుగని యొద్దికతో గుఱుగొల్పు చిత్తమా. 55

ఉ॥ చూపులకందరాక తనుచూడ్కికిచూడ్కయియున్న నిత్యునిన్
తేపకు తేపకుం మదిలో దివ్యతరంబుగ గాంచి మాయ సం
తాపము లేమిజేర్చకను తాలిమిగల్గి యభేద్యమైన యా
శ్రీపతి సేవజేయు నతి శీఘ్రగతిం శుభమాను చిత్తమా. 56

ఉ॥ భూరి మదీయపాపమును బూర్ణముగా దొలగింపనీవె గా
వేరెవరుందురయ్య నినువేడెద నాదుభయంబుదీర్చి యే
తీరున బ్రోతువో సకల దీనదయాకర దివ్యరూప యీ
భారమునీదెయంచు నిజభక్తిచె నీశ్వరు వేడు చిత్తమా. 57

ఉ॥ ఎన్నిదినంబులున్న నినువేడక ముక్తిలభించునె యహో
పన్నగతల్ప నీదయకు పాత్రునిజేసి దయామయుండవై
కన్నకుమారుగం వలెనె గాచి యవిద్యను బాందోలు మో
యన్నయటంచునీశ్వరుని యెల్లపుడుం స్తుతియింపు చిత్తమా. 58

ఉ॥ ఏమియుగాక తాను మరి యెవ్వరికిం దనుపట్టరాక స్వ
త్వప్రియచె భూతకోటులకు భిక్షయొసంగుచు యంతరాత్మయై
స్వామి గలండటంచుగను సజ్జనులం దయనేలు యాపరం
ధాముని గొల్చుచుం యెపుడు ధైర్యము వీడకనుండు
చిత్తమా. 59

ఉ॥ ఏమిభయంబులేదు పరమేశ్వరుఁడే దయజూపుతండ్రియై
భూమినిగల్గు ప్రాణ్యులకు భుక్తియు ముక్తియు నిచ్చుచుండు
యే బాములపాలుగాక పరభావముజూడక భక్తపోషణుఁ
వేమరబోక యెవ్వరికి వేడుకనిత్యునిగొల్వు చిత్తమా. 60

ఉ॥ రాఁగలకష్టముల్ తుదకు రాకదొలంగవుగాదె యేరికిన్
యేగతి గల్గునోయనుచు యెప్పటికిన్ మదినుంచబోకు స
ర్వాగమవేద్యమైబుధుల వాంచితముల్ సమకూర్చునిత్యునిన్
వేగభజింప నీకునతి వేడుకదోఁచు నెరుంగు చిత్తమా. 61

ఉ॥ రూపముగల్గి లేని తనురూపము నెందులయించునో యదే
శ్రీపతిస్థానమంచు నతిశీఘ్రముగా మనసేంద్రియంబులన్
యోపికతో జగద్గురుని యొద్దనునిల్పి యహర్నిశంబు లా
ప్రాపునుబాయకన్ పరుని ప్రార్థనజేయుచునుండు చిత్తమా. 62

ఉ॥ లోకములన్ని సర్వమును లోపలనుండి యనేకరూపులై
గాకడపోకటల్ గలిగి రక్షితుగానగలేక యూరకే
శోకముచే గ్రుశింప నలశోభితుజేరగ రాదు నీవు నీ
రాకదొలంగిపోవ గురురాయునిగొల్చి సుఖింపు చిత్తమా 63

ఉ॥ లోపల జూడనేరకను లోకమదెట్లు నశించుబాహ్యమై
జూపబడే ప్రపంచమిది జూడ్కులకున్ గనుపట్టుచుండు
సద్రూపుని ప్రాపుగోరి యతిదూరముజూడగబోక నీవు నీ
లోపల నిన్నుగాంచినను లోకముదోచకనుండు చిత్తమా. 64

ఉ॥ పుట్టినతోడనే జతను బుట్టి సమస్తఫలంబులిచ్చి యే
తట్టునజూడ భక్తులకు డాపయితోచి నిరంతరంబు యీ
చట్టలోనిండియుండి గను సజ్జనవర్యుల కంతరాత్మయై
పట్టుటకందరాని నిజభక్తుపుపోషను గొల్వుచిత్తమా. 65

ఉ॥ ప్రొద్దునలేచి దుర్విషయభోగములన్ దులదూగుచున్ మహో
గద్దరినై యహంకృతిచె గాలముబుచ్చ సుఖంబుగాదు నీ
మొద్దుతనంబుబోనణచి మోక్షప్రదాయకుపాదపద్మములన్
వద్దికతోడ నీహృదయ వాసమునుంచుట మేలుచిత్తమా. 66

ఉ॥ ఒక్కపుడుండుబుద్ధి మరియొక్కపుడుండక పెక్కురూపులన్
జిక్కి భవాబ్ధిలోబొరలి చిన్మయుగానక యుండువేల నీ
కొక్కరు తోడురారుగద కోర్కెలద్రుంచి నిరంతరంబు యా
చక్కనిసర్వలోకవిభు జాడయెరింగి స్తుతింపుచిత్తమా. 67

ఉ॥ తాలిమిగల్గి శ్రీహరిని ధ్యానముచేయుచు నిత్యతృప్తిచే
కాలముబుచ్చుచున్ మదిని కల్మషవృత్తులజేరనీక యే
జోలిదలంపకన్ గురుని జోడుగజూచుచు సర్వకాలముల్
పాలనజేయు సర్వపరిపాలుని వేడ్కతో గొల్వుచిత్తమా.68

ఉ॥ ఎన్నిదినంబులున్న నిక నెవ్వరుదిక్కు మహానుభావ నీ
కన్నదయాపరుల్ భువిని గల్గుదురే పరికింప నేడు నా
విన్నపమాలకించి యతివేడుకతోడుత బ్రోవరావె యా
పన్నుడనైతినంచు హరిప్రార్థనజేయుచునుండుచిత్తమా.69

ఉ॥ దేహము నిల్వబోనిదని తీవ్రముగా పరమాత్మ సేవయే
యూహలోనిల్పి యుల్లపుడు యోచన జేయుచు మాయరూపులౌ
కూహకవిద్యలన్ జొరక కూరిమితోడ భవాబ్ధి నీదగా
సాహసివై పరాత్పరుని సాక్షిగ నమ్మి స్మరింపు చిత్తమా. 70

ఉ॥ ఎట్టి విపద్దశల్ గలుగ నేమి భయంబును జెందకాత్మలో
పట్టుగ సర్వలోక పరిపాలుని పాదము నాశ్రయించి యే
తట్టున జూడ సద్గురుని దర్శన మబ్బెనటంచు ధైర్యమున్
గట్టిగ బూని సర్వసముగాంచి సుఖింపుచునుండు చిత్తమా 71

ఉ॥ భూజలవహ్ని వాయువు నభోడివిచంద్రులు మొదలుగాగ నీ
తేజములోననుండి గతదివ్యతరంబుగ వెల్గుటన్ యహో
రాజను బూజ్య నాథు గుణరాడనదల్పవె మరువు లేక నీ
పూజయొనర్తునంచు పరిపూర్ణుని నమ్మి భజింపు చిత్తమా. 72

ఉ॥ ఎప్పటికేమి శాశ్వతమొ యెవ్వరికిన్ దెలియంగరాదు నీ
చొప్పు నెఱింగి విశ్వమును చోద్యముగా దలపోసి మాయతో
నెప్పుడు స్నేహముంచకను నేర్పుతో భక్తుని పోషు పాదముల్
ముప్పుగలుంగకన్ మనుపె మోదముతోడుత నమ్ము చిత్తమా. 73

ఉ॥ ఎయ్యది శాశ్వతంబొ మరి యెయ్యది శాశ్వతమో యెఱింగియే
కయ్యము సేయబూనక వికారపు చేష్టలు చేయబోవకన్
చయ్యన విశ్వరూపకుని సాక్షిగ జూచి నిరంతరంబు యా
యయ్యను మరువకన్ గురుని యాజ్ఞకు బద్ధతనుండు చిత్తమా. 74

ఉ॥ ఎక్కడజూడగోరినను యేకవిధంబుగనుండి మాయకున్
జిక్కని నిర్మలాత్ములకు చేరువయై విలసిల్లుదేశికున్
మక్కువతోడనమ్మి యభిమానములెల్లనువీడి యెప్పుడా
చక్కనిస్వామిచే నయది జాలదే సేయ తరింపచిత్తమా. 75

ఉ॥ రూపములన్నితానయి నిరూపణజేయ వశంబుగాక యే
లోపములేక లోకములలో వెలినిండి యఖండమై సదా
ప్రాపనినమ్మ భక్తులకు భారముదీర్చి సుఖంబులిచ్చు యా
శ్రీపతిపాదముల్ మిగుల శీఘ్రముగా నెరనమ్మచిత్తమా.76

ఉ॥ పావనమైన బ్రహ్మపద ప్రాప్తిగలుంగ కొఱంతలేదు నీ
జీవనమౌనుగాదె గురుజేర యఘంబులుదూరమౌను యీ
భూవలయంబునందు పరిపూర్ణునిగొల్చుటెగాక వేరుగా
త్రోవ మరేమిలేదుగద దోషవినాశు భజింపు చిత్తమా. 77

ఉ॥దాసుల బ్రోవనీక్షితిని దైవము గల్గ భయంబికేల నీ
దోసిలియొగ్గి మ్రొక్కులపదూరభవాబ్ధిద్రోయబోకు నన్
మోసముచేయలేరెవరు మోక్షప్రదాయకులుండరీధరన్
వేసటలేకబ్రోవుమనవిశ్వస్వరూపకుగొల్వు చిత్తమా 78

ఉ॥ఆడుచుపాడుచున్ గురునియాజ్ఞనునిల్చి మహాత్మకీర్తనల్
వేడుకగానుతించు మది వేరుగభోనివకాపరమేశునే
జోడుగజూచుచున్ జగము చోద్యముగాదలపోయుచున్న నీ
తోడయిబ్రోవడె యెపుడు దోషవిదూరుస్మరింపుచిత్తమా.79

ఉ॥రోతల పాలుగాక యతిరోదనలఁ జెవిసోకనీక
యీభూతలమందునిర్మలులపూజయొనర్చుచుసర్వకాలముల్
పాతకమైనకార్యముల బాల్పడకన్యయు సేవలో సదా
యీతనువున్నజాలుగద యీశ్వరు నెప్పుడు వేడుచిత్తమా.80

ఉ॥మానసవృత్తులఁ గపటమార్గము నుంచక సర్వకాలముల్
జ్ఞానవశంబుజేసి కడుగణ్యతచే నసిశంబు సద్గురుఁ
ధ్యాన్నమొనర్చుచుఁ బరుని ధైర్యముపీడక గొల్చుకంటెయీ
మానవజన్మకుఁ దగినమార్గముగల్గునెదెలియుచిత్తమా. 81

ఉ॥ చూపుకదల్పకఁ గురుని చోద్యముజూచుచుసర్వకాలముల్
దాపయియున్న యీశ్వరుని ధర్మముదప్పకగొల్చుచున్న నీ
పాపములెల్లబోవె పరి పక్వముగాదె తరింప జన్మకుఁ
రూపికతోడసర్వసముయూహాలోనిల్పిస్మరింపుచిత్తమా.82

ఉ॥ శ్రద్ధచె విశ్వరూపుఘను శాశ్వతుఁగొల్చుటకంటె వేరుగా
సిద్ధతధర్మముల గలవె నీ నిజరూపముగాంచి మాయకుఁ
బద్ధతగాక నిర్విషయ భావముతో పరిపూర్ణసేవలో
తద్ధయునున్నజాలుగద ధాముని గొల్చి సుఖింపుచిత్తమా. 83

ఉ॥ కోరినకోర్కెలిత్తువని కూరిమితో మహనీయులెల్లరుఁ
జేరరె నిర్మలాత్మనిను శీఘ్రగతిఁ సుజనాళిబ్రోవవే
దూరముజేయుబోక నను తోడయిబ్రోవగదే రమేశ నా
భారమునీదటంచు నిజభక్తిచె నీశ్వరుగొల్వుచిత్తమా. 84

ఉ॥ ఎచ్చటజూడనీవెయయి యెవ్వరికిన్ గనుపట్టరాక నీ
ముచ్చటగా భజింపుమని ముఖ్యులకెల్ల భయంబుదీర్చియున్
స్వచ్ఛతనుందువయ్య పరసౌఖ్యనిధాన పరాత్మయంచు యా
సచ్చరితున్ భజింపుచును స్వానుభవంబున నిల్పు చిత్తమా. 85

ఉ॥ కావున ముందుమార్గమును గానక భీతిలునట్లు యాత్రితో
పూనిక చే పరాత్పరుని పుణ్యకథాశ్రవణంబు జేయుచున్
మానక సర్వకాలములు మానసవృత్తులణంచి నిత్యునిన్
దీనతతోడగొల్వు నిను దివ్యతరంబుగ గాంచు చిత్తమా. 86

ఉ॥ సూరిజనంబులెల్లపుడు జూచుచునీదు స్వరూపమున్ వృథా
కోరికలందుబోక నినుగోరుచు మాయకుదూరులై సదా
భారము నీపయిన్ నిలిపి భక్తి చెగొల్తురుగాదె యుద్ధరన్
నేరములెంచబోకుమని నిర్మలునమ్మి భజింపు చిత్తమా, 87

ఉ॥ దిక్కును లేనివారలకు దిక్కయి బ్రోచెదవంచు నిన్ను నే
మక్కువతోడ నమ్మితిని మర్మముగల్గిన బ్రోచువారలిం
కెక్కడ నుందురయ్య యిటు కేవలనిత్య పరాత్ప నీవెగా
కొక్కరుగల్గిరేయనుచు కోరి నిరామయు గొల్వు చిత్తమా. 88

ఉ॥ అన్నిటినంటియున్ మరలనంటకనుండియు పూర్ణమై గనన్
యెన్నగరాని దైవమయి యేకముగా వెలుగొందురూపమై
మన్ననగల్గి తన్నుగన మాయనుజేర్చని సుప్రసన్నమై
యున్న జగద్విలక్షణుని యొప్పుగనమ్మి స్తుతింపు చిత్తమా. 89

ఉ॥ చట్టు విధంబునన్ వెలిగి సర్వజగంబుల నిండియుండి నీ
గుట్టు గుఱుందు దెల్ప నతిగోప్యతరంబయి యుండి మాయకున్
పట్టుబడంగ రాక సమభావులపట్టయి యున్న యోపవిభో
రట్టులజేయుబోకుమని రక్షితు గొల్చుచు నుండు చిత్తమా.90

ఉ॥ లేని శరీరమెప్పటికి లేక నే పోవునుగాని నిత్యమా
పూనక శాశ్వతంబనుచు పూర్ణుని గొల్చి సుఖింప మేలు నీ
మానసమందు యెల్లపుడు మానక శాశ్వతు కీర్తనంబులన్
ధ్యానమొనర్ప జాలు నిక దప్పక నిర్మలు జేరు చిత్తమా. 91

ఉ॥ చీమును రక్తమున్ గలిగి చెప్పనశక్యము గాని బాధచే
స్వామిని తల్వలేక నిటు జచ్చుచు పుట్టుచు నుండు దేహముల్
కామవికారదోషములు గప్పమి జెందుటెగాని లాభమె
నీమముతో పరాత్పరుని నెప్పుడు గొల్చుచునుండు చిత్తమా.92

ఉ॥ కోపము గల్గియున్న నది క్రూరత దెచ్చి భవంబుకీడ్చు నీ
కోపమె తాపమయి సుఖము గోల్పడ జేయు వృథా ప్రయాసలన్
డాపదు జెందనేల నిటు తాలిమి గల్గి నిరామయున్ సదా
ప్రాపని నమ్మి నిష్కపట భావముతో స్మరియింపు చిత్తమా.93

ఉ॥ నీకలలోన దోచునవి నిత్యముగాక లయింపవే గనన్
లోకముగూడ నట్లెయని లో వెలినిండి యఖండమా వరున్
జోకతొ సర్వకాలముల జూడుగ నాత్మలొ నెంచి బుద్ధికిన్
యేకపదంబునన్ నిలువ యీశ్వరు జేరగవచ్చు చిత్తమా. 94

ఉ॥ వేదములందు నీవె సమవేద్యుడవై భజియింపు భక్తులన్
మోదముతోడ బ్రోతువని మ్రొక్కెదనో పరమేశ నేడు నీ
పాదములందు నా శిరము బాగుగ నిల్పి యహర్నిశంబులన్
బేధము చేయబోకుమని బ్రీతిచె చిన్మయుదల్ప చిత్తమా. 95

ఉ॥ గొప్పకుగాదు నీ స్మరణ గొబ్బున బ్రోచెదవంచు జేతునన్
తిప్పలు బెట్టబోకుమిక దిక్కెవరుందురు నీవుగాక నా
తప్పులు దిద్ది కష్టములు దాపున జేరనిమార్గమందున
నొప్పగనుంచుమాయనియు నోపికతో గురు వేడుచిత్తమా. 96

ఉ॥ శాంతిశమాది సద్గుణ విశాలురు నీదు కథామృతంబు నా
శింతుర పేక్షచే సకల శ్రేయకరంబని యాత్మలోన
సర్వాంతరవర్తియా సుగుణరక్షితు నాదు భయంబుదీర్పవే
యెంతని వేడుకొందునని యీశ్వరునమ్మి స్తుతింపుచిత్తమా. 97

ఉ॥ భూరి మహాప్రతాప పరిపూర్ణ పరాత్పర భక్తపోషణా
నేరము లెంచకన్ కరుణ నేలవె సర్వశరీరధారులన్
కూరిమితోడ బ్రోతువని కోరిభజింతు మహర్నిశంబులన్
భారముదీర్చ నీవెయని భక్తసుపోషణు గొల్వు చిత్తమా. 98

ఉ॥ సారడిరీతి నీ జగము కల్పనజేసి యదార్థలీలలన్
గూరిచి దేహభ్రాంతులచే గూలగజేసెడుశక్తి యెట్లు జే
కూరెనో దెల్య నెవ్వరికి గోచరమానిక నీకెగాక యో
ధీర మహానుభావయని దివ్య ప్రభావుని గొల్వు చిత్తమా. 99

ఉ॥ ఎవ్వరు నీ పదద్వయము నెప్పుడు గొల్తురు భక్తిశ్రద్ధలన్
యెవ్వరు నీదు నామమును యెయ్యెడ దల్తురొ సర్వకాలముల్
యెవ్వరు నీదు రూపమును యేకముగా మదియందు నిల్పిరో
యద్దివ్యమలాత్ముజేరియును యార్తితొ నమ్మి స్మరింపు చిత్తమా. 100

ఉ॥ పుట్టకముందె భూమిపయిఁ బుట్టిన జీవులకెల్ల క్షీరముల్
బెట్టియు గాచియున్న హరి బెంపడె సర్వశరీరులన్ దయన్
పొట్టకు దుఃఖమేలనిక పుట్టని చావని త్రోవ జూడగన్
గట్టిగ నవ్వయున్ గొలువ గల్గినజాలు తరింప చిత్తమా. 101

ఉ॥ నేరక చేసియుంటి బలు నేరమతి భువి హీనబుద్ధిచే
సారవిహీనమయ్యె సుసారమటంచును గుర్తులేక యో
కారణమూర్తి నీదు దయ గల్గ యఘంబులు బోవునంచు వే
మారక నిన్ను గొల్తునని మానక నిత్యు భజింపు చిత్తమా. 102

ఉ॥ నీట చరించు జంతువులు నీట నెరుంగక నున్నయట్లు యీ
బూటక నాటకంబునను పూర్ణస్వరూపుడవైన నిన్ గనన్
చోటురవంత లేక యతిచోరుడవై చరియించు నాదు జం
ఝాటము తెల్లదీర్చుమని జంకక నిర్మలు నమ్ము చిత్తమా. 103

ఉ॥ ధారుణిలోన మానవులు ధర్మము నెరుగక పూరకే తీ
రని భ్రాంతితోడ బహుతీర్థములన్ దిరుగంగ గాంతురే
కారణమూర్తి సత్కరుణ గాంచక యెన్నటికైన సత్యమున్
వేరుగ జూడగ బోకు పరమేశ్వరు నీలో నెరుంగు చిత్తమా. 104

ఉ॥ పావనమైన బ్రహ్మపద ప్రాప్తిగలుంగ గోరఁగ లేదు నీ
జీవనమావునుగాదె గురుజేరక్షయఘంబులుదూరమౌను యీ
భూవలయంబునందు పరిపూర్ణునిగొల్వుమెగాక వేరుగా
త్రోవ మరేమిలేదుగద దోషవినాశు భజింపుచిత్తమా. 105

ఉ॥దీనజనుల్ తరింప నిజదేశికమూర్తిగ నవతరించి
సుజ్ఞానమొసంగి మానవులగాచి యవిద్యనుద్రుంచు కేవలున్
స్వానుభవంబునన్ నిలుపు సౌజ్ఞయొసంగిన నిర్వికల్పు
మాయానటనావతారుదరియాగురు దేవుస్మరింపుచిత్తమా106

ఉ॥మోదము తోడ(శ్రీ)హరికి మొక్కి మహాత్మప్రభావముల్
సదాబోధితమై పఠించుటలు పూర్ణునిసత్కరుణావిశేషతన్
గాదె మహాత్ములార యిటు కల్పనజేయుట నాతరంబె యే
బేధము లేక నాయెడల బ్రీతి యొకించుకయైన యుంచి యీ
బీదని తప్పులెల్లయును బిడ్డలతప్పు రీతి దిద్ది నిం
పాదిగ జూచి ఖాశీమును పాలనజేయుగరాదె యంచు యీ
మేధినిగల్గు సద్బుధుల మెల్లనజేరి నమస్కరింపుచున్
వాదము లేక నిర్మలుని వారకనమ్మి నుతింపు చిత్తమా. 107

ఉ॥ మంగళ మ్రపమేయ పరమాత్మ పరాత్పర మంగళంబు ని
సంగభవాపహార నిజ సాదుసుపోషణ మంగళంబు స
ర్వాంగ విలక్షణ పరమరక్షిత మంగళమంచు బాడెదన్
భంగము సేయుబోకుమని బాగవతాధిపుగొల్వుచిత్తమా.108

# మంగళహారతి

మంగాళమనిపాడరే శ్రీ గురునకు ॥మం॥
మంగాళమనిపాడి మహనీయుమైవెల్గు - మేటిశిఖరమందు దీటు
లేని గురుని ॥మం॥

మూాటి కవ్వాలయున్నా శ్రీ గురునీ సోహమను గుర్తుతోను-
సోహమని జపియించుచుండిన కీలు తా గుర్తెరింగియు - రాక
పోకలు లేనితావున ప్రాకటంబుగ నిలచి నీలో ॥మం॥

నాదీ నీ దని యేమి లేనట్టి-శ్రీగురుస్వామిని హృదయమందున-
నిల్పిఎప్పుడును జోడుపక్షుల - పట్టుబట్టియు తానునేననుగుర్తు
మరచీ - కేవలానందమున గురునిజాడ తెలసి నీలో నీవై ॥మం॥

గురుడు తంగెళ్ళార్య్యనెప్పుడును - తనహృదయగుహను పదిల
ముగ - ప్రార్థింపుచుండియును అదురుబెదురును లేక శ్రీ గురు
పదములనుబంధించి మోదమునొంది - దరియా దానునెప్పుడు
నాదతీతంబైన గురునకు ॥మం॥

## గద్య

ఇది శ్రీ దరియాహుస్సేన్ వలీ షా ఖాదరి దేశిక సుజ్ఞాన
సుత శ్రీ ఖాశీం వలీ షా ఖాదరి దేశిక ప్రణీతంబైన
పరమామృతంబను గ్రంథంబునందు చిత్త
శతకము, నూట ఎనిమిది ఉత్పల
మాలలు సమాప్తము.

# గురుస్తోత్రములు

శ్రీరమణీయమై నిగమ సేవితమై సకలార్థ సంపదల్
భారము లేక గూర్చు భవభంజనుఁడై వెలుగొందు మద్గురున్
గోరిభజింతు నాహృదయ గోచరమై అజుభావ వర్తిగా
నేరుపునందజూపి భవనేరధి దాటు సుశీలమే యగున్ 1

కం॥ పదునాలుగు భువనములలో
యెదు రేమియు లేక వెలుగు ఏకేశ్వర నీ
సదనము జేరినవారికి
కొదువేమియు లేదటంచు గొలుతును తండ్రీ. 2

కం॥ సర్వము నీవై యుండగ
సర్వేశ్వర నిన్ను వెదుక జాలిరె భువిలో
గర్వ గ్రంథులనణచిన
నిర్వాహకు లందగలరు నిను గురుదేవా. 3

ఉ॥ పావనమైన నీకథలు భక్తులకే విననౌను యింపుగా
భావము లేనివారికవి బంధములై గనుపట్టునే భువిన్
నీవె గదా యనేకమయి నిండి పరాపరమూర్తి వౌదువో
కేవలనిర్వికల్ప నినుకీర్తనజేయగ నిల్పు మెవ్వడున్. 4

కం॥ ధర్మార్థ కామ మోక్షము
నిర్మితమై నీదుదయచే నిలచినవని యీ
మర్మంబెరిగినవారలు
కర్మాకర్మముల నిన్ను గాంతురుగాదే. 5

చ॥ రసికులు నీమహామహిమ రాత్రిబవల్ స్మరియింపుచున్ వృథా
వ్యసనములన్ త్యజించియును వ్యాపకమానిను అంతరాత్మగా
విసువుజనింపకన్ వెదకి వేడుకతో తమలోనగాంచియున్
మసలుచునీమహోన్నతికి మాటికిమాటికిగాంతురియ్యెడన్. 6

శా॥ లోకారాధ్యునిసర్వలోకనియతున్ లోపంబు నేమాత్రమున్
జోకన్ జేర్చని సుప్రసన్న వరదున్ జ్యోతిర్మయాకారునిన్
ఏకాకారు ననంతు నాదిపురుషున్ యెన్నంగ రానట్టిసుశ్లోకున్
నాహృదయాబ్జమందుగొలుతున్ శుద్ధాత్మునన్ జేయుతన్. 7

మ॥ భవముల్ బాపెడు భక్తరక్షణుని నే భావింతునిత్యంబు నా
స్తవమున్ జేకొని ధర్మమార్గములలో స్థాపించి నిర్వాణమై
భువి రాజిల్లెడు నిత్యమోక్షవరమున్ భోగింపగా జేయుచున్
సువిచారంబుననిల్పి నాదుయఘముల్ చూరంబుగా జేయగన్. 8

సీ॥ తాపసులెల్లరు ధైర్యంబు మదిబూని
విపరీతములెల్ల విడచితాము
చపలత లేకను సర్వ కాలంబులు
తపసులైన నీ పదధ్యానమందు

నిలచి నినుబొందిరని నిగమమ్ముల్ వచియింప
నీవె దిక్కని నమ్మి నిశ్చయముగ
నీదు పాదంబులు నియతితో తలదాల్చి
ప్రస్తుతి జేతునో పరమపురుష

వేరుగతిలేదు ననుబ్రోవ త్రోవ నీవె
పరమపురుష పరాత్పర భక్తవరద
తెరవు జూపియు కరుణించు దేవదేవ
శరణు శరణని మొరలిడితి దురితదూర. 9

సీ॥ భక్తుల బ్రోచెదు పరమాత్మ
నీకరుణ బాగుగా నిల్పిన భయముగలదె
ముక్తు లెల్లపుడు నీ మూర్తివంతము జూచి
మురయు చుందురు గదా మూలమనుచు
ఆదిదేవుడ నీవె అపరాధములు బాప
సాదుమూర్తివి నీవె సత్యచరిత
వేదాంత వేద్యమై వెలుపల లోపల
వెలుగు వారెవ్వరయ్య వేదవిహిత

పాప పుంజములెల్లను భగ్నపరచు
దీపమై నాదు భయంబులు దీర్చుమయ్య
దాపు నీవైతివిక వేరు దారిలేదు
పాపరహిత పరమాత్మ భక్తవరద. 10

సీ॥ కని కానకను జేయు కర్మంబులెల్లను
ఘనమైన నీదయ గలుగ బోవు
పాపంబులెల్లను పరిహారమై పోవ
నీపదధ్యానమె నిరతిశయము
అఖిలలోకములకు ఆధారమా నీవు
ఒకమాత్రమని బల్కు వర్ణితంబె
సజ్జనావళి బ్రోచు సచ్చరితుఁడవనుచు
ముజ్జగంబుల బ్రోవ నిల్తువయ్య

భక్తులెల్లరు నినుస్మరియించుటయె దప్ప
నియతి గలదె యెన్ని భావముల గలిగిన నిన్ను గనక
యున్నదే వేరుమార్గంబు కన్నతండ్రి
నన్నుబ్రోవుమె పరమాత్మ నిన్ను గొలుతు. 11

ఉ॥లోకము లెల్ల జూచి పరలోకముజేరెడు త్రోవగానక
చీకున జిక్కి మానసము చింతల బొందుచు నున్న వారికే
రాకడపోకడల్దెలవు రాత్రిబవల్ పరమాత్మ సేవలో
నేకవిధంబునన్ మెఱగు విజ్ఞులకెన్నటికైన గల్గునే. 13

గీ॥ భక్తిగలిగియు పరమాత్మ భజనజేయు
వ్యక్తిగల వారికే నిజము వ్యక్తమౌను
శక్తిలేనట్టి జనులకు శక్యమౌనె
ముక్తికిరవైన మార్గంబు మూలమెఱుగ. 14

చ॥ పరమన వేరుగా గలదె బంధవిముక్తి చె భావమాత్మలో
స్థిరముగ నిల్పి వేమరకు శ్రీశు భజింపుచు నుండుటల్ గదా
వెరపుజనింపకన్ ప్రభుని వేడ్కతొ గొల్చిసుఖింపుచుండు మీ
తరుణమిదేను వీడుటకు దైన్యము వీడి తలంపు చిత్తమా.15

శా॥ దారేమున్నది సర్వలోక విభునన్ దర్శింపకన్ దేహా
ధారంబౌనని యెన్నిపాట్లుపడినన్ దారిద్ర్య దుఃఖాబ్ధిలో
జేరదే నిజమవుమగాని సుజనుల్ జెందంగరాదెప్పుడున్
ధారాళంబుగ నిత్యమైనప్రభున్ ధర్మంబుచె గొల్వుమీ.16

ఉ॥ అర్థములేనివాదముల నాత్మసుఖంబును జెందరాదు స
ర్వార్థ విశారదుల్ బుధుల వాక్యముచే దెలియంగనౌను యే
వ్యర్థపు బోధలన్ జొరక వ్యాపకుజేరెడి నేర్పుజూపుమా
సార్థకమైనమాటలను సన్నుతిజేయుచు నుండుమిత్తరిన్. 17

శా॥ ఆర్భాటంబునమాయలో బొరలుచున్ ఆయాసముల్ జెందినన్
దౌర్భాగ్యంబట పాపకూపములకున్ దాపౌను వ్యర్థంబుగా
గర్భాత్యంతర ముక్తులై క్రిములచే గ్రాలంగ నీకేల యీ
సద్భావాంతరమూర్తియైనపురుషున్ స్వాంతంబునన్ జూడుమా.18

గీ॥ యెన్నిపాట్లయిన జగదీశు నెరగ లేక
వున్నదే జన్మఫలమిక నెన్నడైన
సున్నగాజూచి జగమిదె చోద్యమనుచు
యెన్నువారలె పరమాత్మ నెరగగలరు. 19

శా॥ కామాదుల్ కడుదోషమైనపనులన్ గల్పించునీధాత్రిపై
నీమంబేమియులేదు నీచయుతులై నిత్యత్వమున్గానకన్
ప్రేమన్ దారసుతాదులందు భ్రమచే బేలత్వమై పోవుటల్
సామాన్యంబదిసాధువర్తనమునన్సర్వాత్మచింతింపుమా 20

కం॥ శమదమము మరియు చిత్స్వ
ఖము నయముగను వారిజేరి మానక నీవా
విమలుల సేవించెదు యా
క్రిమమెరిగిన నిత్య సుఖము గాంచగవచ్చున్. 21

ఉ॥ఆపదలన్ని వీడుటకు ఆర్తిచె సద్గురు పాదపద్మముల్
ప్రాపుగ నమ్మి కొల్చినను పాపములన్నియు బారిపోవునో
పాపపుజీవమా పరమ భాగ్యము మాని వృథా ప్రయాసచే
తాపము నొందబోకుమిక తప్పక ధార్మికు జేరగోరుమా. 22

చ॥కలవరమెల్లమాని కలకాలము నిల్చెడు కలిమి గోరియున్
నిలకడబూని అవ్యయుని నిత్యుని నిర్మలమానసంబుతో
దలచుచునున్న వారలను దాపునజేర్చి యదార్థ లీలలన్
దెలుపుచునిత్యసౌఖ్యమున దేల్చును దేవునినమ్మియుండుమా 23

ఉ॥ ఆ పరమాత్మ సన్నిధిని ఆపదలన్నియుబోవుగాని యే
చూపును జూచినన్ విషయచోద్యము లే కనుపించు నూరకే
తాపము జెందబోకుమిక తాలిమితో సదయున్ దలంపుచున్
యోపికతోడ సర్వసము యోచనజేయుచునుండు జీవమా 24

శా॥ కల్పనలన్ని మానియును కారణమూర్తి నిజస్వరూపముౕ
స్వల్పముగా దలంపకను స్వానుభవంబుననిల్పి యెప్పుడుౕ
అల్పవిచారముల్ బడక ఆదియు అంత్యము లేని దేవునిౕ
దల్పవిచార మేమి గురుదైవముగా దలపోయుచుండుమా. 25

శా॥ శాంతాకారుని సర్వలోకవినుతుౕ శంకల్ నివారించియే
భ్రాంతిౕ జేర్చని భక్తవత్సలుని నీ భావంబులోనిల్పి వి
శ్రాంతిౕ జెంది నిజాత్మతోకలిసియుౕ శ్రద్ధానిబద్ధుండవై
స్వాంతంబా పరమావధిౕ గలుపుమీసర్వార్థంబా నీధరౕ 26

సీ॥ పరమార్థమునకున్నె పాటుపడిననుచాలు
పెరచింతలను జేయు ఫలమదేమి
బ్రహ్మాది వినుతుని బ్రస్తుతించినజాలు
యిమ్మహీస్తులను నీ వెదుక నేల
పాపాబ్ధి తరియించు బాట నెరిగినజాలు
కోపతాపంబుల కుంద నేల
అఖిలార్థములఁ జేరు నదియెరింగినజాలు
సకల పాండిత్యములఁ జదువ నేల

సత్యమైయున్న పరమాత్మ జాడ తెలియ
పరిత్యగాత్మను జెందు టే పరమ పదము
యిదియుగాకను యింతరము లెన్నియున్న
వదలదీ దేహవాంచ యేవలననైనా. 27

సీ॥ విషయేచ్ఛలను బడి విర్రవీగిన నేమి
 విషయానుజగమునకు మూలమేది
పంచభూతంబులు బలసిన ఫలమేమి
 సంచితాగములను ద్రుంచలేక
కఫవాతములచేత గ్రాలుచుండిన నేమి
 విపరీతముల ఏ విధముగనక
దేహాభిమానమును దీర్చకుండుటయేమి
 అహమన్నిటికి పెద్దననుచుయనక

వట్టిభ్రాంతిచే భువిలోన పుట్టి చావ
దిట్టతనమేమి నిజముగ దేవదేవు
గట్టిగానమ్మి మట్టుపరుప
గుట్టుదెలియును లేకున్న గురుతుగలదే. 28

కం॥ విచ్ఛలవిడిగా దిరిగిన
వచ్చును కష్టములు నీకు వాంఛింపకు మీ
తుచ్ఛపు సౌఖ్యంబులకై
సచ్చరితుని విడువబోకు సతమిది మనసా. 29

కం॥ అద్భుతమైన మాయ లీల
బుద్బుదములరీతి దోచు బోవుచునుండున్
సద్భక్తు లెరుగుదు రీవిధి
చిద్విమలము తోడనీవు జేరవె మనసా. 30

చ॥మలినము గల్గియుఖ విఫలమార్గము జేరుట పాడిగాదు నీ
తలపును సర్వకాలములు దైవపరంబున జేర్చి భక్తిచే
నిలచిన సర్వదోషములు నీరయిపోవును నిర్మలంబు నీ
కలవడికష్టముల్ దొలగు కావున సర్వమయుఖ భజింపుమా 31

కం॥ నీలోన నిలచి యుంటివి
కాలము వ్యర్థంబుజేసి గడుపకు మిలలో
చాలా కాలము గడిచెను
వేలాయీతుచ్ఛభ్రాంతి విడువుము జీవా. 32

తే॥ వారిజ మార్గంబు విడిచి విరాగివైన
ఫలము లేదెందుకే వృథా ఆజ్ఞనీకు
పూజితంబైన పరమాత్మ బోధగాంచి
విడువబోకుము నిజతత్వమూడువునీవు. 33

కం॥ వృదఆజ్ఞ మందునిండిన
సదయునిగనలేక నీవు జాలింబడినఖ
వదలవు భవబంధంబులు
పదిలముగ నిలుపునీకు భావముజీవా. 34

ఉ॥ఒక్కడె సర్వలోకముల నోపికతో భరించు తాను ఏ
దిక్కున చూడబోకుమిక దీనదయాళుని పాదపద్మముల్
మక్కువతోడ గొల్చుచును మానక శాంతము గల్గి ఎప్పుడా
చక్కనిస్వామిసన్నిధిని జడతగలుంగక నున్న మేలగుఖ. 35

ఉ॥ధన్యుని జేయగా గురుడు దాతయు దైవము లై వెలుంగగా
అన్యము గోరనేల నిక ఆపదలున్నవి యెన్నడైన నీ
దైన్యముతోడ ధార్మికుని దాపున జేరి మెలంగుచుండుమో
మాన్యతగల్గు నీకు యవమానము లేదిక ధాత్రిలోన్. 36

ఉ॥ ఏల విచార మొందెదవు ఏకముగా పదునాల్గుభువనముల్
పాలనజేయు సత్ప్రభువు భక్తుల బ్రోచుచు నిండియుండగా
కాలునిభయము లేదు కడు కష్టము లేమియు జేరరావు ఏ
జోలిదలంప కాత్మభవు జోక్యముగల్గి నుతింపుచుండుమా.37

కం॥యీాషణములలో జిక్కక
దోషహారంబైన వరుని తోడుజూచియున్
భాషింపుచు గృతి వాక్యము
పోషిత మది యెరుగు మిదియె భూషణమవనిన్. 38

సీ॥ సగుణ నిర్గుణముల బ్రబలించు జగదీశు
విగతసందేహులై పొదకువారు
నిగమాగమములచే నేర్పరుంగగరాని
సుగముని తమలోన జూచువారు
ఆర్తశరణ్యుని ఆజ్ఞలోనిలచియు
మూర్తివంతముగాంచి మురయువారు
విజ్ఞానులై సదా విభవంబుగలిగియు
సుజ్ఞానపదమున సౌఖ్యవారు

బలుతెరంగుల భయముగలిగి
తెలియవలె పరమాత్మ దేవదేవు
నిత్యకల్యాణయుక్తమై నెగడు వాని
నరయఁగల్గుదునే దీన వరుడ దేవా. 39

ఉ॥ వేదమయుండు సర్వజన వేద్యుఁడు భక్తపరాయణుండునై
సాదుజనావళిన్ కృపతో సాకెడు సత్ప్రభువైన దేవునిన్
మోదముతోడ గొల్చినను మోక్షముగల్గునుముజ్జగంబులన్
బేధము లేని వాని నిటు భీతిచే గొల్చితరింపు చిత్తమా. 40

ఉ॥ నిందితమైన కార్యముల నీచత దెచ్చి భవాంబురాశిలో
గుందగజేయు నావదల గూడక ధర్మవిశారదవరివై
బొందిలొ ప్రాణమున్నపుడె పూర్ణునిగొల్చిజరింపుచుండుమీ
బంధము లేలనీకు నిజభావముగల్గి దలంపు మవ్యయున్ 41

ఉ॥ ఎప్పటికేమి కాగలదొ ఎవ్వరెరుంగుదురీ ధరాస్థలిన్
గొప్పలుకారిచేమాను మరికొంచెము గొప్పలు నెజరించుయీ
చొప్పు పరాత్పరుండెరుగు చోద్యము యెవ్వరికర్మమెట్టిదో
తప్పదటంచు నీవెరిగి ధైర్యముగా పరమాత్ము జేరుమా. 42

కం॥ భావ భగవంతునిపై నిడి
త్రోవ దొలంగినను మిగుల దోషంబని యా
కేవలు సన్నిధి బాయక
నీవై యుండంగవలయు నిజము నెరింగియున్. 43

కం॥ హంస నటించేవిధమును
సంశయములు వీడి నీదు స్వానుభవమునన్
హంశఃబిది యని దెలిసిన
హింసలు నినుజేరరావు హితమిది జీవా. 44

చ॥మనసాక్షైన గాదె రుజుమార్గము దప్పక దైవసన్నిధిన్
అనిశము జేరియుండుటలు అన్నిటికిన్ మదిమూలమౌను యా
ఘనమగు మానసంబితర కార్యములన్ జొరనీక నెప్పుడా
జననములేని యీశ్వరుని జండలొసల్పి మెలంగు జీవమా 45

చ॥పరమ మునీంద్రహృత్సదనభాగ్యము నై బరితోషయుక్తమై
సరసులబ్రోచు సత్యమయి సర్వవిలోక విభావమైన యా
పరుని మనంబులో నిలిపి ప్రార్థనజేయుము బంధరహితమా
పరపదంబు జెందుదువు భారముదీరును దెలియుమీభువిన్. 46

సీ॥ తనువులోపలనున్న దైవంబు నెరుగక
తబ్బిబ్బు పడినను దారిలేదు
జ్ఞానాగ్నిఖర్మల గాల్చకుండిన లేదు
ఘనమైన పరమాత్ము గాంచు త్రోవ
యింద్రియంబులబట్టి విడళించగాలేక
యెందుదరిగిన గురుని వేదుక లేవు
అంతరజ్ఞప్తి నీ కనుకూలమైయుంటి
వింతవింతలు నీవు విడువగలవు

చింతలెల్లను దీరి యనంతు జేర
ఎంతే నేమాత్రమును లేవు వసుధలోన
భ్రాంతి విడిపోవు బహుళ విశ్రాంతమైన
శాంతి నిలయంబు జేరుదువు సత్యముగనూ. 47

సీ॥ యితరార్థములుజూచి యిచ్ఛయించుట దేల
జతగలిగియుండ నీ జన్మఫలము
మతిలేక విషయంబుల మగ్నమైపోనేల
సతమవునె యిహసుఖము జడతగాక
పాపాబ్ధిలోబడి బరితపింపగనేల
దాపుగా మృత్యువు దసిలియుండ
చిక్కులలోబడి చీకాకు గానేల
ఎక్కవో సదయుని ప్రక్కనుండ

దిగులు పడనేల దివ్యమా తెలివిగలుగ
అగణితంబైన అఖిలాత్మ అండజేరి
పగలు రేయన రాతి యా పరమపురుషు
మిగుల మదినెంచి తలచిన మేలుగాదే. 48

కం॥ మాయాతీతుని మహిమలు
వేయువిధంబులను నీవు వెరుగంగలవె
కాయమనిత్యంబనియును
బాయక బ్రహ్మాదివినుతు భజియింపగదే. 49

చ॥ పలుకులు వేయునేల భవ భంజనుడైన పరాత్పరుండు నీ
వెలుపల లోపలన్ గలిగి ఎక్కువతక్కువ గాక యెప్పుడున్
తెలిసినవారి దేహముల తెలివియునై దెలియంగబడును యా
మలినవిహీనుఁ డీశ్వరుఁడనుచు మనుజు వేళ్ళలన్. 50

కం॥ చల్లగ పాలించెడుప్రభు
నుల్లంబున జూడవలయు నుర్వీస్థలిలో
యల్లెడల వెదకుచుండిన
తెల్లముగా దెలియరాదు తెరవిదిమనసా. 51

చ॥యతులు మునీశ్వరుల్ సతతమే విభుచింతన జేసి తృప్తులై
మితరణచే మెలంగెదరొ విశ్వములో నది గాంచియెప్పుడున్
సతతముగాక భారమును బాగవతాధిపు పాదసేవలో
హితవుగనిల్పియీజగము హేయమటంచుతలంచ మేలగున్ 52

మ॥ వినుమా అద్భుతమైనస్వామికథలన్ యింపారగా వీనులన్
మనుమా సత్యముధర్మముల్ విడువకన్ మర్యాదతో నెప్పుడున్
గనుమా శాశ్వతుపాదపద్మములెదన్ గల్యాణసంయుక్తమా
జనుమా భక్తులతోడ జేరుటకునై జన్మంబుసాఫల్యమా 53

కం॥శుభచరితుని నామామృత
మభయంబని దెలిసి గోపికలు మహనీయులకున్
యుభరాద్వరదుని సత్కృప
శుభమే జేకూర్చు సకల శోభితమదియై. 54

కం॥ కాళానుగుణ్యమనకను
నీలో కలకాలమున్న నిత్యాత్మునితో
కాలము గడుపుచునుండిన
కాలంబే కాలమౌను గతియేమి భువిన్. 55

కం॥ ఎడతెగకను భగవంతుని
పుడమిలో గొనియాడుచున్న పుణ్యాత్ములకున్
అడలుట పనియేమింకను
తడవేమియు లేక బ్రోవ దైవమెగలుగన్. 56

కం॥ చిత్తము దైవపరంబుగ
ఉత్తములుంచెదరు దీని నుర్వీస్థలిలో
తత్తరపాటొందక నిటు
నుత్తగు పరమాత్మగాంచి సంస్కృతి సమసన్. 57

ఉ॥ ఆర్ధులబ్రోచు సర్వమయు నాత్మదలంపక కామ్యకర్ములై
వ్యర్థముగా జరింపుచును వ్యాకులతన్ జెడిపోవుచుండుటన్
సార్థకమేమిలేదు నిజ సౌఖ్యమునొందగ జేయు శ్రీపతిన్
ప్రార్థనజేయుచున్న నినుపాలనజేయును దెలియుచిత్తమా. 58

చ॥ సమమతులై సదా పరమశాంతి వహించిన వారికేగదా
విమలతగల్గి నిత్యగను వేదముతోచు నిరంతరంబు యీ
క్రియముదలంచిమన్నసతో కాలము బ్రహ్మస్వరూపముగను నీ
వమిత సుఖాబ్ధి దేలుమిక వారనిభక్తిచె నిర్మలంబుగన్. 59

కం॥ సత్య మసత్యం బెఱుగక
వ్యత్యస్తం బైన నిటుల నిరిగెదవవనిన్
ప్రత్యక్ష దైవరూపము
నిత్యులకే దెలియుచుండు నిజమిదిజీవా. 60

ఉ॥ అంతరదృష్టిచే బుధుల యాజ్ఞనుమీరక జ్ఞానదృష్టిచే
స్వాంతముచిన్మయాత్మకుని సన్నిధి బాయకనుండు నట్లుగా
చింతనజేయుచున్న నిక చింతలుజేరవు నిర్వికారివై
వంతములేక భక్త పరిపాలుని పాదములాశ్రయింపుమా. 61

కం॥ అన్నిటికిని మూలము మది
మన్ననతో సువ్రసన్ను మరువక గొలువన్
భిన్నము లేమియు లేవని
యెన్నుచు నిగమార్థమయుని వేడుము మనసా. 62

కం॥ అండజేరిన వారల యార్తిబాప
దండి వారెవ్వరికను యీధరణిలోన
మండితాఖండ నిర్గుణాజాండకల్ప
పండితావన పరిపాలభవవిదూర. 63

సీ॥ భాగవతార్థముల్ పఠియించు వారలు
పగగొనరెన్నడు భావమందు
శత్రుమిత్రత్వము సమముగాజూతురు
శాంతులై యమిత విశ్రాంతిగలిగి

కోపతాపంబులు కోరక యుందురు
పాపంబులని తమకు భయముదోచి
గుణరహితంబైన కొదువగాదనుచును
యనుకొని జేరుదు రనవరతము

శుద్ధజ్ఞాననులైనను సుఖముగలదు
శ్రద్ధగల్గినవారికే జాడదెలియు
వ్యర్థమౌ కామ్యములుగొన సార్థకంబె
బుద్ధినిల్పియు దివ్యాత్ము బొందవలయు. 64

కం॥ దాపయియున్న నిరామయు
దీపకుడని తెలియుమిందు తెరవై యుండన్
కాపాడువారలిక నీ
కేపట్లను వెదుక లేరికేటికె మనసా. 65

ఉ॥ అద్దములోని చాయవలె అన్యమె కనుపట్టు ఆత్మతో
వద్దిక చేయలేక పలువాంఛలబోవ వృధా ప్రయాసమౌ
రద్దులపాలుగాకు నిను రక్షణ జేసెడు నిర్వికల్పునిన్
బుద్ధికదల్పకన్ గొలువ భుక్తియుముక్తియుగల్గు నెరుగుమా 66

సీ॥ అవికారమైనట్టి అపరాత్పరునందు
భువనముల్ గలిగియు పొరలు టెట్లొ
ఎవరెరుంగుదురిట్టి విపరీతచర్యలు
వివరమెరిగెడివార లెందుగలరు

మాయామయంబని మహనీయు లెందరో
ఏయుపాయంబున నెఱుగలేక
కలవంటిదని తాము గలయక నుందురు
తలపులలో దాని దలచబోకు

రూపనామంబులును నీవు రూఢిపరుప
గలవె యెన్నటికైనను కలతగాక
శాశ్వతంబైన బ్రహ్మంబె సర్వమవును
వేరుగా దలచబోయిన వెతలుగాదె. 67

సీ॥ అన్నిరూపములైన ఆపరమాత్మని
గన్నవారలెగదా ఘనులు భువిని
జలములో వడిగల్లు సంభవించినరీతి
సర్వేశ్వరునిలోన జగము గలిగె
వడిగల్లు జలమవుట వసుధ నెరుంగనె
యారీతి జగము బ్రహ్మంబుగాదె
బాహ్యదృష్టికి జగము బలురూపులై తోచు
అంతరదృష్టిచే నరయవలయు

యిదియె వేదాంతసమ్మతం బిదిరహస్య
యింతెకంటెను వేఱులేదెంత వెదుక
సంతసంబున సర్వాత్మజాడలోన
అంతరాత్మని గాంచుమి యనవరతము. 68

సీ॥ లోఁజూడఁగల్గిన లోకముల్ గనరావు
వెలికి దిరిగినఁగదా వెగటుదోఁచు
దృష్టినిల్పినఁగదా దృశ్యదము నీవనుచు
వ్యష్టిగాదోచక దృష్టయువును
నిలకడచే మది నిలచియుండినఁగదా
తలపు లెఱుంగని దారిదోరకు
కీలెరుఁగకఁగదా క్రిందుమీఁదౌటలు
పాలుమాలకుమిట్టి కీలుదెలసి

కాల కాలంబులునుగాని ఘనునిగలియు
తోలుబొమ్మల జగమని విడుచుగాదె
పరము సుఖమైన మార్గంబు బడయకున్న
తరమె సంసారజలనిధి దాటుటయును. 69

గీ॥ హంస నెరిగిన పాపముల్ ధ్వంసమవును
సంశయము లేదు పరమాత్మ సన్నిధికిని
హింసలేకను జేర్చు నీవిధము పరమ
హంసులకు దెలియు యితరులకలవిగాదు. 70

గీ॥ నాశికాగ్రమందు నటియించు పరమాత్మ
వేసటేమిలేక వెదుకవలదె
బాసిపోను సకల బంధంబులెల్లను
యీశుకరుణ గలుఁగనిదియె నిజము 71

కం॥ మాంసాస్థిచర్మయుతమై
హింసలుగల దేహమాను యిదినిజమనక౯
హంసోహంబను మంత్రము
సంశయములు వీడి జపము సలుపగవలయు౯ 72

చ॥ మదమును బెంపుజేయకను మానవజన్మము దైవసన్నిధి౯
వదలక నిల్పి సద్బుధుల వాక్యములాశ్రయమంచు నెంచియు౯
ముదము జెలంగ శాశ్వతుని మ్రోలను నిల్చియు ముచ్చటింపుచు౯
పదిలముగా మెలంగ నిలబంధములుండవు దెలియుమీ భువి౯ 73

ఉ॥ శాంతము సర్వభూషణము శాంతము గల్గిన సర్వసంపదల్
చెంతను జేరియుండునట జెప్పుటకలవియె శాంతిసౌఖ్యముల్
మంతము వీడి సర్వసము పాలనలో నివసించువారికే
శాంతముగాని యూరక యె శాంతిః శాంతియటన్న దెలియునే 74

ఉ॥ కాలమె బ్రహ్మమంచు మును గట్టిగ దెల్పిన వేదవాక్యముల్
మేలుగ జూడ రూపములు మేళ్ళనగాకది ఏక రూపమా
కాలమటంచు జెప్పుటకు ఖర్మయె సాక్షి మరేమిలేదు యో
కాలమె సర్వకాలమయి గన్పడు వేరుగ దల్పబోకుమా. 75

కం॥ కాలత్రయమని దెలుపుట
యేలాయని యనకు ఖర్మ యేర్పడగాదా
కాలంబని గుర్తించుట
కాలంబన పరము గాదె ఖర్మకు జగతి౯. 76

కం॥ భావము పరిశుద్ధంబై
దేవుని తెలియుంగ గలరు తెలివిచె తమలో
ఆవరణమైన మరుపును
యేవేళను జేరనివక యెరుకగలిగియుఁ. 77

చ॥ చిత్రిపటంబునందు లవి చిత్రిములై గనునట్లు నట్ల యీ
గాత్రిములోనజాగ్రతయుగల్గును స్వప్నసుషుప్తిమధ్యముల్
పాత్రతయైన తుర్యమున బంధములెల్లను దిరు నీవు యీ
సూత్రము నెరిగి కేవలునిసూక్ష్మముగామది నెంచుచుండుమా.

ఉ॥ శాంతియుతుల్ మహాపురుషులు శాశ్వితు పాదము
లాశ్రియించి యే
కాంతమునన్ విరామమున కర్మవిదూరు భజింపగల్గియుఁ
చింతలలేక నిర్మలతజెంది సుఖాబ్ధిని వాలలాడుచుఁ
అంతరజ్ఞప్తిచే నభవు నవ్యయు గొల్తురుగాదె చిత్తమా. 78

ఉ॥ జాగొనరింపకఁ విషయజాలము నావలదోసి సత్యమా
భాగవతార్థముల్ దెలసి భక్తసుపోషణు పాదపద్మముల్
బాగుగ గొల్చుచున్నసిదె భాగ్యమటంచు స్మరించి నిర్మలో
ద్యోగముబూనవాస్తవముదోచు భయంబినుమంత లేనిదై. 79

గీ॥ మూడవస్థలసాక్షియై మూలమాచు
నిలచియున్నట్టి ఆత్మానుభవము నెరుగ
సుగతహితముంచుగాదె యీజగములోన
యింతయును వేరుగలదె మరెందునైన. 80

గీ॥ సతముగాని ప్రపంచంబు సత్యమనకు
హితవుగల్గి ప్రవర్తింపు మాహీనవృత్తి
గత మనాగతమును దలుచ కలుషమొచ్చు
పతితపావను గొలుచుటే ప్రీతము మనకు. 81

గీ॥ భక్తవత్సలుడుండగా భయము గలదె
శక్తివంచనలేక యీజగమునందు
యుక్తమౌ దాని వీడక శక్తికొలది
ముక్తి మార్గంబు నరయుటె మూలమౌను. 82

కం॥యిడుముల కోర్చియు సద్గతి
బడయుటయే ఫలముగాని బలుచింతలలో
తడబడ సుఖమేమున్నది
యెడబాటోక యింతలేక యీశ్వరుగనుమా. 83

గీ॥ తప్పులు వెదుక రాదు గురు
దైవముగా తలపోసి యెప్పుడుక
ఒప్పులచూచుచున్న నిక
నెప్పటికైనను ముప్పుగల్గునే. 84

గీ॥ తృప్తిగలిగిన సర్వంబు ప్రాప్తమవును
తృప్తిలేనిది జనులకు ప్రాప్తి గలదె
పాసమున కంటె వేరైన సలుపగలదె
సుప్తమైయున్న సర్వాత్మ గొలువ వలయు. 85

మ॥ తరమే యెంతటి వారికైన భువిలో దప్పింప ప్రారబ్ధముల్
వెరువంగా పనిలేదు విశ్వమయునిన్ వేవేగ చింతింపుమన్
తిరుగన్ రక్షణగల్గు నీకు వినుమా ధీసాక్షియైనట్టి యా
కరుణామూర్తి యెగాక యన్యులెవరున్ గాపాడగా గల్గిరే 86

ఉ॥ చిత్తము శ్రీహరిన్ దలుచ చిన్మయుమొందెద వన్ని వేళలన్
తత్తరపాటులేదు పరతత్వము గోచరమౌను నీకు నీ
విత్తరి విశ్వమూర్తి కథ వీనులవిందుగ వినుము నీవు యా
సత్తగు స్వామినిన్ గలసి సౌఖ్యమునొందెద వెల్లకాలముల్ 87

సీ॥ సారెసారెకు గురుస్మరణ చేసిన గదా
దూరమౌ నీకున్న భారమంత
గురుపాదతీర్థంబు గ్రోలుచున్నను గదా
పరమ పదవికిజేరు బాట గలదు
గురుకృపకన్నను గొరతగినది గలదె
ధరణిలో నెంతటి ధన్యులైన
తరుణమిది వ్యర్థపరుపకు దైన్యమేల
పరమ పురుషుని గొలుచుటే భాగ్యమౌను
వెరవుజెందుట భక్తుల తెరవుగాదు
మరుపులేకను పరమాత్మ మురుగు గనవే. 88

ఉ॥ లోకుల మాటలన్ వినియు లోలత జెందకు సర్వకాలమున్
సాకుచు సాక్షియైన ప్రభుసన్నిధివాసి చరించబోకు నీ
రాకకు కారణంబు గురురాయుని గొల్చుటకంటె వేరుగా
నీకు పనేమిగల్గదిక నిత్యము శాశ్వితుజేరి గొల్చుమా. 89

చ॥ నరులనునమ్మరాదుగురురాయుని వాక్యమువీడరాదు యా
పరమరహస్యమైన నిజభాషణముల్ వెనుదీయరాదు పా
మరులను జేరరాదు పరమాత్ముని సన్నిధి బాయరాదు స
చ్చరితులజేరి సత్కథలజాడ నెరుంగుట మేలుచిత్తమా. 90

శా॥ లోకారాధ్యునికీర్తనంబులుగదా లోకంబులన్ బాపుటల్
చీకాకేలను సర్వకాలములలో చింతింపుమా శ్రీధరన్
ఏకాకారతగల్గు చిత్తమునకున్ ఏలాటి కష్టంబులన్
సోకన్ జాలవునిన్నునీవెరిగియున్ శోధింపుమాయీశ్వరున్. 91

ఉ॥ తల్లడమేల దీనేల పరతత్వము నెరిగియు నిర్విచారులై
యుల్లమునన్ సదా సుఖవియోగముగాకను భక్తిపూర్ణతన్
కల్ల జగంబటంచు గని కాలము వ్యర్థముజేయకున్నయా
చల్లనిస్వామి సత్కరుణ జాలగ గల్గును మరువబోకుమా. 92

ఉ॥ అంతరజ్ఞప్తి కలిగియును ఆపదోద్ధారకు పాదపద్మముల్
చింతన జేయగావలయు చిన్మయతన్ భవబంధరహితమా
శాంతియుగల్గు నీకిటుల శాశ్వతమా పరమార్థమబ్బు ని
శ్చింతుడవై వెలుంగుదువు శీలముగల్గి భజింపుమిత్తరిన్. 93

మ॥ అనుమానంబికయేల నీదుమదికిన్ ఆయాసమున్ బెంపగా
పనిలేదవ్యయుమూర్తియైపరిభలుచున్ భక్తార్తియున్ దురించునీ
మనమానిర్మలుసేసిలోజోనిపియున్ మాలిన్యంబుబోనాడుమా
ఘనమైయొప్పిన సర్వలోకవిభుడెగాపాడు నిన్నీ ధరన్. 94

క౦॥ క్షమగలిగిన సర్వంబును
సమకూడును మరువబోకు సత్వగుణముతో
క్రమమెరిగి నడచువారలు
విమలుని ఘనసమ్ముఖమున వెలయుదురెపుడున్. 95

క౦॥ తొలిజన్మ ఫలముగలిగిన
గలయుదురా సర్వమయునిగాక నితరులన్
గలయుదురె యిలలోన నరు
లలసటలేనట్టి మోక్షలక్ష్మి విభునిన్. 96

క౦॥ లక్షల పరిమాణంబులు
కుక్షిని భరియించినట్టి గోవిద వినుతున్
లక్షింపలేని వారలు
శిక్షితులై చెడుదురనుచు జెప్పవె శ్రుతులున్. 97

సీ॥ వేదార్థలు నెరిగి విమలులౌ వారికి
బాధయే లేదనిరి భాగవతులు
తెలిసెను తెలివికి తెరవులురెండౌను
మాయామయంబొకటి మహింకరమొకటి
మహితమౌ మార్గంబు మహనీయులను గాంచి
మాయామయంబైన మరుపుగలుగు
మరుపులేకను నీవు మహనీయులను గాంచి
పరమాత్మ ప్రార్థింప పాలుపడుము

యింతకంటెను దరిలేదు యెంతకైన
సంతసంబున సద్గురుచెంత జేరి
పాటుబడుమా పరలోకప్రాప్తిగలుగు
సూటి విడబోకు శుద్ధమౌచోటు దొరకు. 98

క॥ పరమాత్మ కిలను బల్కిన
పరిచారకులవుట యాత్మబలమనగాదె
యెరుగుట మరచుట గలిగెను
తెరవేదిక మన సుబుద్ధి దెలియుమటన్నన్. 99

క॥ దరియౌగురుదేవుని పద
సరసీరుహములకు మ్రొక్కిసన్నుతి జేతున్
పరమామృతమును గోరెడు
సరణిని దెలుపంగజాలు సర్వసాక్షియు నౌటన్. 100

సీ॥ అఘవినాశంబైన హరికథాశ్రవణము
పగలు రేయనకను భావమునను
వెగటుగా దోచక వినుతించు సుజనుల
దిగులు బాపెడు మహాదివ్యపదము
నిగమాగమములను నేర్పుతో చదివిన
సుగతికి వేరైన చోటులేదు
భగవంతుగొలుచుటే భవ వినాశంబని
నిగమాగములు దెల్పు నిశ్చయముగ

గావున నిత్యనిర్మలు కరుణవడసి
సేవజేయుచునుండిన చెసుసుభవము
నవిరళానంద పదవిని నందవచ్చు
వివరమెఱిగి భజింపుమా విశ్వమయుని. 101

ఉ॥ వింతలువింతలై విషయ వీధులయందుబడి సంచరించు యీ
వంతలమానియా మనసు వాల్చుము శిరము రవంతయైన శ్రీ
కాంతుని చెంతజేరకను గాడుమరెప్పటికైన దిని నే
కాంతముజేసి శాశ్వతుని గాంచినజాలుజయింపచిత్తమా 102

కం॥ పుట్టిన జీవులకెల్లను
గిట్టుటయేనిజము దీని కీర్తింపకుమా
వట్టిది మాయాజగమని
గుట్టెరిగియు పరమపురుషుగొలుపుము ధరలోన. 103

సీ॥ ఆపదోద్ధారకు నరయుటకన్నను
పాపముల్ వెడలెడు బాటగలదె
శ్రీపతి పదపూజ శ్రేయస్కరంబౌను
దాపుజేరినయట్టి ధన్యులకును
కాపాడి రక్షింపగలరె వేరొక్కరు
ఆపరాత్పరుడెగాకన్ని దిశల
తాపసులెల్లరు దైన్యంబు విడనాడి
యోపికతో సకల వ్యాపకాత్మగొలిచి
సుఖులైరి యనవిన కొరతగలదె
తలపు వేరైనదదిలేదు ధరణిలోన
కలిమి బలిమియు నొనగూర్ప గలరు
గలరు తెలివిగలిగి భజింపుమా దేవదేవు. 104

కం॥ దండిగ త్రిభువనములలో
నిండుక పరమాత్ముఁడుండ నెలవు దెలియక౯
కొండలు గుహలును దిరిగిన
గండములే గాక గురుని గాంచగ గలరే. ౧౦౫

కం॥ ఆనందమయులై నిత్యుని
గానంగల రవనిలోన ఖర్మరహితమౌ
స్థానం బావరమావధి
యైనందున విషయములకు వ్వైరెయొప్పగ౯ 106

శా॥ సాక్షాత్కారము గల్గువారలుగదా సంతోషులై బాయక౯
మోక్షాసక్తితో సర్వవాంఛితములకౕ మూలంబుగా ద్రోయుటల్
రక్షోమార్గము వేరుగాగల్గునే రవంతయైన౯ భువి౯
శిక్షారూపముగల్గిసర్వమయుని౯ చింతింపుమా మరువక౯ 107

కం॥ తప్పొప్పులున్న దిద్దుడి
గొప్పతనంబునకుగాదు కోరులరుచియవుర౯
అప్పతి కవుల నుడివిన
మొప్పేమియు రావటంచు మురయుచుదలతు౯ 108

గద్య

ఇది శ్రీ దరియాహుస్సే౯ వలీషా ఖాదరి దేశిక సుజ్ఞాన
సుత శ్రీ ఖాశీం పలీషా ఖాదరి దేశిక ప్రణీతంబైన పర
మామృతంబను గ్రంథంబునందు గురు స్తోత్రములు
నూట ఎనిమిది సీసములు, కందలు, ఉత్పలమా
లలు, శార్దూలములు గలస్తోత్రములు
స మా ప్త ము.



# బోధామృతము

శ్రీకారుణ్య పయోనిధిన్ సుగుణ సంశీలున్ మహనీయునిన్
లోకాధిక్యభవాపహారుడగు గురున్ ఏకాంతవాసున్ పరున్
ఏకాకారుని సర్వలోకనియతున్ లోకాంతర వ్యాపకున్
జోకన్ గొల్చెడు భాగ్యమివ్వగ మదిన్ జోహారొనర్తున్ దగన్. 1

శా॥ సారాసార విచారశోభిత కరున్ సర్వార్థ సంధాయునిన్
ధీరుల్ గొల్చితరించు దేశికప్రభున్ దివ్యాత్మునిన్ ధీయుతున్
కారుణ్యాభయదానహస్త వరదున్ గర్వాపహారున్ గురున్
జేరేమార్గము సంగబోధ నమృతున్ సేవింతు నెల్లప్పుడున్. 2

ఉ॥ దాసుల బోధించుటే పరమ ధర్మముగా నరుదెంచియున్న మ
ద్దేశికమూర్తియా దరియా దేవుని దివ్యపదార విందముల్
వేసట లేక నాహృదయవీధిని నిల్పి నిరంతరంబు చి
ద్భాసుర స్వప్రకాశు నతిభక్తిచె గొల్తు నభీష్ట సిద్ధికై. 3

కం॥ జగము సృష్టింపుచు మఱి
జగముల బెంపంగ దుడింపజాలిన జననిన్
నిగమార్థరీతి వేడెద
సుగుణాకరమైన పరమసుఖమొనగూర్పన్. 4

ఉ॥ వూనిన కార్యముల్ భువిం పొందుగ జేసురు నట్లు నీపద
ధ్యానమొనర్చి విజ్ఞులు సుధామృత పానముగ్రోలి తృప్తులై
న్యూనము లేక యుందురని నొప్పగ గొల్తును శీఘ్న దేవ నా
మానసమందు నిల్చి యవమానము లేని పథంబు జేర్పవే. 5

శా॥ శ్రీవాణీ సకలార్థ సంభరిత సుశ్రేణిఁ దగఁ గూర్చు మ
ద్దేవీ నీదు కథామృతంబుగొని గాదె భక్తులాత్మార్థులై
సేవల్ జేయుచు సద్విచార నియతిఁ సిద్ధింపగా గల్గు యా
భావంబుఁ పరమావధిఁ గలుపుటల్ భక్తేష్ట ఫలదాయినీ. 6

కం॥ స్వార్థ త్యాగంబున నిగ
మార్థంబులు నెరుగబలికి మానవావళిఁ
సార్థకపరచిన బుధులను
బ్రార్థింతు నహర్నిశంబు భావముల లోనఁ. 7

సీ॥ ధరణిలో సృష్టికి దగిన యాధారమై
కరుణతో బెంపగా గలిగి యుండి
ధర్మమార్గంబులు దయతోడ బోధించి
నిర్మలులను జేయు నేర్పు గలిగి
విద్యాభివృద్ధికై వెదకి బుద్ధులు గరపి
సత్యాశమున నున్న జాలు ననుచు
సంతోష మొందుచు తమ స్వతంత్రంబులను
పుత్రుల కొసగుచే పుణ్యమనియు

కష్టములకోర్చి నియమ నిష్ఠలును గలిగి
దృష్టిబేధంబులును లేక యదృష్ట మెల్ల
సుతులె యని జూచు సుస్థిరమతులైన
నాదు తల్లిదండ్రులను దలతు నాత్మలోన. 8

ఉ॥ లోపములెల్ల దీర్చియును లోవెలినిండి యఖండమైన చి
ద్రూపుని ప్రాపుజేరుటకు దూరములే విశ్వరూప పద్ధతుల్
తేపకు తేపకున్ దెలియు తెల్వియొసంగి దయావిశేషతన్
దాపున జేర్చుసత్కృపులు తాలిమితో భజియింతు ధాత్రిలోన్,9

చ॥ పరమపవిత్రమై భవము బాయు మహోన్నతభాగ్యరూపమై
సురమునిసేవ్యమై మిగులసూక్ష్మము నై వెలుగొందుగోప్యముల్
తెరవని సర్వకాలములు దేహవిలక్షణమైన మార్గములన్
నెరుగక బల్కు సద్గురుని చేర్పన జేరియు శిష్యుడార్తితోన్.10

గీ॥ జనన మరణములను జెందుచు బలుకష్ట
మనుభవింపబడుట మానవులకు
విహితధర్మమానో యిదిగాక మరి వేర
రహితమున్న దెలుపరా వెదేశా. 11

॥కం పుట్టకముందెవ్వరమో
పుట్టియు నడువంగవలయు పుణ్యామదెట్లో
గిట్టిన వెనుకను కాగల
వెట్టివో దయగలిగి దెలుపవే మహానీయా. 12

గీ॥ దేనివలన నిజము దెలియఁగబడలేదో
దేనివలన దానిదెలియఁగలము
గానదానివిధము కరుణతో దెలుపవే
దీనజన సుపోష దివ్యపురుషా. 13

గీ॥ సర్వసారమైన సత్కథావిధమును
యుర్విలోనదెలుప నొకరుగలరె
కర్వదీర నాకు కలవరమెల్లను
నిర్వహించి దెలుపు నిర్మలాత్మా. 14

కం॥ అనియిట్లు శిష్యుఁడడుగగ
పనిబూనియు సద్గురుండు బలుకదొడగెన్
ఘనమైన నీతిమార్గము
వినుమని దయగలిగి పూర్వవిధములనెల్లన్. 15

ఉ॥ జచ్చుచుపుట్టుచున్ విషయజాడలలోబడి స్వార్థరూపమౌ
తుచ్ఛశరీరముల్ విడువదోపక శూన్యవివాద సహితులై
ముచ్చటలాడుకొంచుతమమూలము నెరుంగకమూర్ఖచిత్తతన్
వచ్చుచుపోవుచుండుటలువారికెసహజముయీజగంబునన్. 16

కం॥ కన్నులు గానని వానికి
వున్నదివున్నట్లు దెలియ వుచితంబవునే
యెన్నగరాని మహాత్మును
గన్నంతనె గాదె సర్వకలుషములుడగున్ 17

మ॥భవముల్ బాయు భవంబు గల్గు సుజనుల్ భావంబు లో నెప్పుడున్
సువిచారంబును జేయుచున్ విషయముల్ భోజ్యంబుగా జూచియా
భువనాధిక్యుని బాయకున్న భవముల్ బూర్ణంబుగావీడు యా
వివరంబంతయుజక్కగా నెరుగియున్ విశ్వేశుచింతింపుమా. 18

కం॥ నిగమాగమముల కందక
సుగుణాకరమైన బుధులు సుఖముగ దాటవే
భగవత్ కరుణా రసమును
వెగటేమియులేక దాటవ వీడును భవముల్. 19

కం॥ పుట్టుటయన నెట్టిదియో
గుట్టెరుగగరాదు పరమ గోప్యంబాటన్
వట్టిదిగా జను మాయయె
పుట్టుటయన గిట్టుటనిన పుడమిలో దెలియున్. 20

కం॥ వట్టిది మాయాజగమును
గుట్టెరిగినగాని దీని గురుతు దెలియదా
పట్టున నమ్మి మహాత్ములై
యుట్టిదియని దెలియగలరు ఈశ్వరు కరుణన్. 21

కం॥ నీవే సర్వంబౌదువు
తా వెరిగినగాని నీవుదగ దెలియవు యా
కేవల పరమాత్మాంశము
రావుట పోవుటలేని రమ్యంబవుటన్. 22

కం॥ చచ్చుట పుట్టుట లేకను
వచ్చిన దేమియును గాని వైభవ మెఱుగన్
ముచ్చటగా దనుగాంచిన
సచ్చరితులకౌనుగాని సాక్ష్యమె జగతిన్. 23

చ॥ తొలుతను నేకమై భవము దోచక నిర్మల స్వప్రకాశమై
కలతయులేక నిర్విషయ కారణమౌ పరమాత్మయందు యీ
నిలకడలేని సంసృతి యనేకముతై గనుపట్టు చెట్లనన్
సలిలములన్ తరంగములుజాలగ బుద్బుదముల్ గలట్లుగాన్. 24

కం॥ ఈరీతిగ జూపట్టుచు
సారాసారంబు నెఱుగజాలని విధమై
నారాయణు కృపచేతను
ధీరుల్ దెలియంగ గలరుధీమతు నెలమిన్. 25

కం॥ సత్యాసత్యంబులుగా
వ్యత్యస్తంబైన ప్రకృతివ్యవహారంబుల్
నిత్యులకే గాకను మఱి
ప్రత్యగ భిన్నాత్ము దెలియబడుదురె కుమతుల్. 26

కం॥ దేహామె నిజమని జూచెడు
కూహకులకు దెలియబడదు గురుకృపగలుగన్
అహామణచి జితి పదార్థము
యిహపరములుగాక దోచు యిష్టార్థంబై. 27

కం॥ సర్వేశ్వరు కృపగలిగిన
సర్వార్థంబులవియె సమయును ధరపై
గర్వాపహారులకు యా
నిర్వైశ్యంబు గాంచు నిపుణత గలుగున్. 28

చ॥ గురుకరుణామృతంబు గొనగోరెడు సజ్జనులాత్మ ధర్మమా
సరణినిబూని సర్వఫలసారము గోరిలుచు సత్యధర్మముల్
మరువక నిర్మలాత్ములయి మాధవు సత్కథలాని యెప్పుడున్
వెరపు మరేమిలేక భవవేదనలన్ జొరబోరు ధాత్రిలోన్. 29

వ॥ మరియు జ్ఞాన దృష్టిగలుగని కతన సర్వమయుని దెలియుట సాధ్యంబుగాదు. అయినను సత్పురుష సాంగత్యంబున సర్వమును లభింపవలయును. కాని వేరుమార్గంబు తెలియుంబడదు. అందులకు పూర్వపుణ్యావిశేషంబు ప్రధానమైయుండు.

కం॥ తొలిజేసిన పుణ్యంబున
దెలియంగాబడును నిజము దేవుని కృపకై
మెలుగగవలె నెల్లప్పుడు
తలపులలో పరమ పురుషు దలచుచు జగతిన్. 30

సీ॥ సకల జన్మంబుల సార్థకమొందింప
మానవ జన్మమై మహిని బరగ
యిట్టి మానవజన్మమెత్తియు తానరో
పుట్టెయుంగక పోవ పుడమి లోన

పాపంబులకు నెల్ల పాల్పడి నిజతత్వ
భావంబెరుంగక భ్రాంతితోడ
దారా సుతాదులు తనవారు యని నమ్మి
యారాట మొందుట అనువు గాదు

గావునను భక్తిగలిగియుం కేవలాత్మ
తోవ విడకున్న పరలోక త్రోవ గలుగు
దెలియుమిటు పావనుని నీదు తెలివి యందె
కలత లేనట్టి సుఖమును గాంచు కొరకు. 31

క॥ పాపాగ్ని లోనబడియును
తాపంబును బొందియుండు ధర్మవిహీనుల్
యేపగిది నిర్వికారుని
దాపున జేరంగ గలరు ధర్మము లేమిన్. 32

కం॥ అఖిలార్థంబులు నొసగెడు
సకలేశ్వరు పాదపద్మ సన్నిధిలోనన్
నికరముగ నిలిచిన యా
సుకరులకే నిశ్చితార్థ సూత్రము దెలియున్. 33

చ॥ విమలమనస్కులై నిగమవేద్యు నిరామయు నిర్వికారునిన్
క్రమమును వీడకన్ విషయకాంక్షలుద్రోసి వివేక దృష్టిచే
సమత పరాత్పరున్ గలసి సఖ్యము బాయక నుందురాత్మలో
శమమున జేరకన్ పరమధార్మికులై భువిలోన నెప్పుడున్. 34

శా॥ పశ్వాదుల్ మొదలైన భూతతతులన్ భావింపుచుం సర్వదా
విశ్వాకారము దాల్చి భక్తజనులం వీక్షించి సద్భక్తిచే
విశ్వాసంబునుజూపు సర్వమయునే విజ్ఞాన దృష్టిం గనం
విశ్వేశుడె గలండటంచు మదిలో విశ్రాంతితో వేడెదం. 35

కం॥ ధర్మేతర మార్గంబుల
ధర్మంబున విషయములకు దాపై భువిలో
నిర్మల మొందగ నీయవు
దుర్మదమున దిరుగ సకల లోపిత మవుటన్. 36

కం॥ గావున నీ సర్వాధారుని
భావంబున నిల్పి విషయ పటలము ననుపం
ధీవరులయ్యెద రిలమిం
త్రోవయిదె దీనిబాసి దొలగకు మెప్పునన్. 7

సీ॥ సద్భక్తిచే గురుని నిబ్బరంబున
మదినిలుప సచ్చరణంబులు
అర్భకవృత్తిచే ననవరతము
బాయక బహుళ సంకటంబులు
ప్రాప్తించిననుగాని యిహ
చింతలలో మునిగి వెరువ రాదు
యాపదోద్ధారకుండైన గురుస్వామి
ప్రాపకంబబ్బిన భయము కలదె
కరుణాన్వితుండయ్యు కాపాడుటకు తాను
బిరుదుబూనె నటంచు సరసులెల్ల

పరమ సంతోష యుక్తులై భ్రాంతి దొలగి
నిరతమాత్మార్థములుగను నెఱవు గలిగి
నేర్పుతో గురుని సేవింప వలయు
తరుణమిది వ్యర్థపరచిన దారిలేదు. 38

క॥ నిన్నే నీవెరుగగ లే
కున్నను కుటిలంబు విడదు కూహకములకున్
యెన్నడు జొరబోకుము
నీకన్నను వేరేమిగలదు గాంచుము ధరణిన్. 39

క॥ పాపల లోపల వెలియై
దీపకమా ఆత్మ నెరుగ దెలియును సర్వం
బేపగిది వెదుక లేదిక
దాపయి యున్నట్టి దాని దలపుము ధాత్రిన్. 40

చ॥ చనిన దినంబులెల్లయును జననము మరణము దెలియకుండియున్
జనెను మరేమి లాభమిది జన్మతరించెదు త్రోవగాంచియున్
జనము భవాబ్ధి నీదుచును జావని పుట్టని మార్గమందు నీ
వనయము నిత్యముక్తిగని వారక నెప్పుడు నిశ్చితుండవై. 41

గీ॥ లేని భ్రాంతి నొంది న్యూనంబు జెందకు
హానివచ్చు తుదకు హాయిలేదు
జ్ఞానివైనగాని మానంబు దక్కదు
బూని సర్వమయుని పూజసల్పు. 42

గీ॥ అతిరహస్యమైన ఆదినారాయణు
మతిని నిల్పి విషయ మలినములను
సతమటంచును యనకు సర్వాత్మసేవలో
హితవు గలిగి యుంట యిదియె నిజము. 43

శా॥ పాపాబ్ధిన్ బడి పొర్లనేల మనకున్ ప్రార్థించియున్నట్టి ని
ర్లేపున్ నిత్యనిరామయున్ భవహరున్ లేశంబు జింతించినన్
తాపంబుల్ విడిపోవు సర్వసుఖముల్ దాపౌను సత్యంబుగా
లోపంబేమియులేక ఆత్మమయునిన్ లోలోన జింతింపుమా. 44

చ॥ నిగమములన్ పఠించినను నిత్యసుఖంబును జెందనౌ నా! కో
సుగతికి మార్గమింతె పరిశోధన జేయ సుఖంబుగాదు శ్రీ
ఖగపతి వాహనున్ గొలువగల్గినవారలె కర్మరహితులై
అగణితమైనబ్రహ్మపద మందుదు రన్యయుగొల్వగాదగున్. 45

చ॥ గురుకారుణ్యముగల్గియున్న సుజనుల్ గోర్కుల్ నివారించి యా
పరసౌఖ్యంబును నొందగల్గుదురు సద్భావజ్ఞులై యెప్పుడున్
వెరపున్ జెందక ముక్తిమార్గయుతులై వేదార్థ సువేద్యునిన్
పరమానంద సుపాలునిన్ భద్రాత్ములై యంతటన్. 46

చ॥ యిహపరభోగత్యాగులయియీప్సితమీశ్వరునందునిల్పుచున్
సహనముగల్గి యల్లపుడు సద్గురు పాదము లాశ్రయించుచున్
అహమును వీడి అజ్ఞతను ఆవలద్రోసి సుఖాబ్ధిలోపలన్
విహరణజేయు వారలకు విశ్వము ఈశ్వరు రూపమై దగున్ 47

కం॥ తల్లియు దండ్రియు గురుడని
యుల్లంబున నిల్పి వారి యుపదేశముచే
చల్లగ నిలచిన వారికి
తొల్లిటి కర్మంబులన్ని దొల్లును గాదె. 48

సీ॥ తడబడ పనియేమి ధైర్యంబు వీడియు
జడమైన సంసార సరణి జూచి
మాయామయంబని మదినెంచ కున్నను
బాయునే సంసార పటలమిందు
కాయమస్థిరమని గనుమిది యెప్పుడో
కర్మదీరెడు వేళ గడచిపోవు
జన్మకర్మంబులు సమ మవును భువిలోన
మర్మంబు దెలియక మరియు పోవు

వ్యర్థమైన బాములచేత వెతలుబెట్టు
సార్థకంబేమియును లేదు జగములోన
కావునను నిత్యసత్యసంకల్ప చరితు
భావమున నిల్పి యుండుటే భవము విడుట. 49

కం॥ సకలార్థంబులు నొసగెడు
అకలంకుని గానలేక అరడిజెందక
సుఖమేమున్నది నీకిక
వికలత లేకున్న సర్వవిభవము గలుగున్. 50

సీ॥ అన్యమేమియు లేక యీవ రాత్మ్మనుగొల్వ
ధన్యతగల్గు నీ ధరణు నీకు
పాపాబ్ధిగడువ నుపాయంబు మరిలేదు
పరమాత్ము్ణదలచుటే పద్ధతిందు
మును వేల్పులను బోధిప మూలంబు దేవుడే
యన వినలేదె నీవఖిలశ్రుతులు
భక్తిచే పరమేశు బ్రార్థించుటయెగాక
యుక్తివేరున్నదే యూహసేయ

ఆదిమధ్యాంత రహితుని ఆజ్ఞగలిగి
మోదమందియు చరియించు ముక్తులెల్ల
వేదమయు చింతనము దప్ప వేరుగలదె
ఖేవమేలను భజియింపు బేధరహితు. 51

కం॥ చపలము జెందుట ఫలమా
విపరీతము గాదె దానివివరింపంగ౯
నిపుణత గల్గియు నీవే
అపరోక్షనొందు సుఖమలవరు నీకు౯. 52

కం॥ కాగల కార్యములెల్లను గాలిం
పగ సర్వమయుడు కర్తయి యుండ౯
మేగతి గల్గునో యంచును
నీగతికిటు వగవనేల నిర్మలు గనుమా. 53

ఉ॥ ఎందరు భూమిపాలురటు లేగిరొ రాజ్యము వీడి సంపదల్
గందువె యెన్నడైన నతికాలము దీరెడు వేళ నీవు నీ
బొందిలొ ప్రాణమున్నపుడె భోగము లస్థిరమంచు నెంచియుం
అందముగా పరాత్పరుని అంజలిజేసి నుతింప మేలగుం. 54

కం॥ పరిపక్వకాలమెప్పుడు
దిరమనునది యంత్యకాల స్థితియన నొవ్వం
తరుణము వ్యర్థము చేయక
పరమాత్ముని సేవజేయ భాగ్యము గనుమా. 55

కం॥ దాపయి యున్నది మృత్యువు
తాపసులకు దప్పలేదు తథ్యంబిది నీ
వేపగిది దప్ప నెంతువు
కాపాడుక సర్వమయుని గనుగొను జీవా. 56

గీ॥ ఉన్నదున్నట్లు దెలియుమీ వూహలోన
కన్న విన్నదిగలదె యేకాలమైన
యెన్నరానట్టి బ్రహ్మము న్వేదుక వలదె
అన్నిటికి మూలమానని యనుదినంచు. 57

సీ॥ ఎచ్చట జూచిన నచ్చట బ్రహ్మంబు
సచ్చరిత్రుల హృదయ సాక్షిగాదె
హెచ్చైన పరమాత్మ వెదుక వేఁడున్నదె
తనకు తానై యున్న తత్వకోటి

లోవెలి ఏకమై లోపంబు లేకున్న
కేవలాత్మను జూడ తావుగలదె
సత్యమై నిత్యమై జడత గాకున్న యా
ప్రత్యగాత్మకు భువి ప్రతియు గలదె

సర్వలోకంబులకు తానె సత్యమగుచు
సుఖము నొనగూర్చి బంధముల జోలిగాక
నొకటిగా నున్న పరమాత్మ నోర్పు గలిగి
అఖిల జగములలో గాంచుటదియె వ్రతము, 58

కం॥ ఆత్మానుభవము గలిగిన
ప్రత్యక్షముగాను దోచు పరమసుఖమిందున్
సత్యము దెలియుము యీవిధి
భృత్యత్వము గలుగ విషయ భోగము అణగున్. 59

మ॥ నిరతంబా నిగమార్థ సేవ గనుచున్ నీమంబుతో మరువన్
శరణార్థుండయి సంచరించునతడున్ శాంతాత్ముడౌగాదె యీ
దురితాంబోనిధిలోన దోర్ణియుజగమున్ దూరంబుగా జేయకన్
పరువుల్ బారిన ప్రాప్తమానె పరమై భాసిల్లు బ్రహ్మంబిలన్. 60

శా॥ శాంతాకారునిసర్వలోకనియతిన్ శాసించుసద్బ్రహ్మమున్
చెంతన్ జేర్చుకనున్న వారలు భువిన్ జన్మింపగా బోరు దు
శ్చింతన్ దూరుచు అంత్యకాల సరణిన్ చింతింప లేనట్టి దు
ర్భ్రాంతుల్ జేరగజాలిరెపరము నై భాసిల్లుసద్బ్రహ్మమున్. 61

శా॥ నానాత్వంబును వీడి బ్రహ్మమయులై నత్యంతసంతోషముల్
బూనం జూచినగాని బంధములు సంపూర్ణంబుగా బోవు సు
జ్ఞానం బంటియెగాని వేరుగతులన్ గానంగనౌనె భువిన్
దీనిం బాయక నిల్పుమీ విధమునన్ దివ్యాత్మరూపంబగున్. 62

చ॥ అకుటిలులైనవార లిల నందగ గల్గిన నిత్యసౌఖ్యముల్
వికలత లేక జెందు మిటు విశ్వము వేరుగ జూడ బోకు మీ
సుకరము నీకు నిత్యమిది సువ్రతులెల్లరు బాయకుండియున్
ప్రకటితులైరి విజ్ఞులయి ప్రాజ్ఞులనన్ భువి నెల్లభంగులన్. 63

చ॥ చపలుర కందరాని తొలిజన్మ ఫలంబయియున్న సద్గతిన్
నిపుణతగల్గి వీడకను నిర్మల వృత్తిని సంచరింపుమా
వుపమిది యింతకంటె మరి వుత్తమమార్గము లేదు గల్గునే
కపటము లేక నీవు కలకాలము యోచనజేయ గాదగున్. 64

ఉ॥ నిర్భయమైన మార్గమును నీతివిదుల్ కృపగల్గి దెల్పగా
దుర్బలమైన నింకెవరు దోడ్పడి బ్రోచెదు వారలిందు నీ
వర్బకవృత్తి మాని గనుమద్భుత కిల్బిష రూపమై సదా
దుర్బలమయ్యు దుఃఖములదూగుచునుండెదు వ్యర్థజన్మమున్. 65

కం॥ మానవజన్మం బెత్తియు
హీనంబున బొరలనేల విశ్వమయునిన్
సుజ్ఞానంబుగల్గి దెలియుము
బూనికతో నింతకన్న పుణ్యము గలదే. 66

క॥ నీ వెవరో దెలియకున్నను
తా వెందులనైన గలదె ధన్యత గలుగన్
జీవుడె దేవుండనుచును
త్రోవెరిగినవారు దెల్ప దోచుచు నీకున్. 67

సీ॥ అర్థంబు దెలియని వ్యర్థపు చదువేల
సార్థకమైన యీజన్మమందు
దేహంబు లోవెలి దెలియని తెలివేల
యూహింపుమా నీవు యూహలోన
గురుకృప గల్గిన కొరతయేమున్నది
మరుపు లేకుండిన మానవులకు
పాపాబ్ధి వెడలెడు బాటదెలిసియు నీవు
తాపంబునను బొరలదగునె యిందు
పాలుమాలక సర్వాత్మ బడయగలుగు
లీలనెరిగియు విడబోకు లిప్తమైన
నిలకడుండిన దెలియును నిజము నీకు
కలత లేనట్టి క్రియమిది గనవె మనసా. 68

క॥ అంతర్ముఖమై యుండిన
చింతలు విడిపోవు నీకు స్థిరరూపంబౌ
శాంతము గలుగును మరువకు
సంతోషముతోడ మెలగి జరుగుము మనసా. 69

సీ॥ జడమైన దేహంబు జతయని నమ్మిన
విడివడి బోవదా యెప్పుడైన

ధనగృహ క్షేత్రముల్ తథ్యంబటన్నను
తాను బోయెడు వేళ తరలిరావు
మాయామయంబైన మనసు నెరిగెదమన్న
హాయిలేకుండును అన్ని విధుల
తొలిజన్మఫలమున దోచినలాగున
తెలియుము నీలోన తెలివి గలిగి
యిప్పుడే దెలియకున్నను ఎప్పుడైన
తప్పబోదిక దుఃఖంబు తథ్యమనని
తప్పుత్రోవలు విడి గురుదైవము నెడు
చొప్పుగాంచియు సుఖమొందు చోద్యమనకు. 70

సీ॥ పారమార్థిక దృష్టి బడయుట బహుజన్మ
ఫలమని దెలియుమీ భక్తి గలిగి
అన్నిట పరమాత్మ డావరించిన విధము
గన్నవారలె పరము గాంచగలరు
నిరుపాధికముగాను నిలచిన నిర్మలు
నెరిగెడు వారలే నిత్యులవని
సచ్చితానందమా స్వప్రకాశము బుధులు
స్వాభావికంబనిరి జగమునందు
దెలియు మీరీతి దెలిసిన తెలివి తెలివి
కలత గలిగిన గాంచుట కల్లగాదె
తలపు వేరైన గనరాదు ధర్మపథము
నిలచి నీలోన నినుగాంచు నేర్పు జీవా. 71

# దండకము

శ్రీరమణ రావా చిదానందభావా సుధీజనులగావా
సదానీదుసేవా విధానంబె దేవా ముదంబబ్బుత్రోవ వ్యథల్
బాపలేవా నిరాకార నిర్లేప నిర్ద్వంద్వ నీదివ్య సంకీర్తనం
బింతయనుచుఁ నుతింపంగ నేనెంతవాడఁ మహానీయ సం
పూర్ణ సద్భాగ్యమందంగ సామాన్యమే యిట్టిమాయాప్రపం
చంబె నిత్యంబుగాదోచి దేహేంద్రియాది భ్రమల్ తుచ్ఛ
సౌఖ్యంబులన్ గోరియున్ సూక్ష్మదృష్టించుకైనన్ వ్యర్థసంక
ల్పముల్ గల్గి సవ్యాపసవ్యంబులన్ దెలియలేకన్ భువిన్ మూఢ
చిత్తుండనై కామక్రోధాది వర్గంబులన్ గెలువతరముగాకున్న
యీదీనునిన్ బ్రోవ నీవే దయామూర్తివంచుఁ మదిన్ గోరి
నీపాదపద్మంబులన్ గొల్వ నానేరములఁ బాపిమన్నించినీసన్నిధి
జేర్చ నింకెవ్వరున్నారు నీదివ్యసంకల్పమే సృష్టికాధారమై శక్తి
రూపంబునై పవనజాలంబులన్ బుట్టి పెంపొంది సమయింప సామ
ర్థ్యంబుఁ గల్గి మాయాస్వరూపుండవై వెలయు నీసత్యరూపంబు
నెవ్వారికిఁ దెలియసాధ్యంబు గాదంచు భూలోక మందవత
రింపంగనూహించి శ్రీసద్గురుస్వామివై వచ్చి సద్బోధలఁ దెలిపినీ
సన్నిధిఁ జేర్చి నిఁ గొల్చుభక్తావళిఁ ప్రేమతో దాపునన్ దీసి
మోక్షార్థులఁ జేసి నిర్మలానందమై నిత్యశుద్ధత్వమై నిర్వికల్పం
బునై వెలయు నిజతత్వసాజ్ఞఁ క్రమంబొప్పబోధించి కడ తేర్చె
నావంచు సద్గ్రంథపఠనంబునఁ సజ్జనుల బల్కు వాక్యంబు
లాత్మార్థముల్ దెలియ సాక్ష్యంబులాయెన్ మహాదేవ దేవా

మహా సుప్రభావా ధరణ్ నన్ను బ్రోవ మొరాలించినావా యదార్థంబుగానీవె నాపాలి దైవంబవై దరియుగురురూపమై ధర్మమార్గంబులన్ దెల్పి నిర్భయానందపరతత్వముఁ దెలియ భోధించితివురా దయాపూర్ణసింధో క్షితింభక్తబంధో సదానీదు సంస్మరణ నెడబాయకున్నట్ల ఖాశీందాసున్ కటాక్షించి రక్షింపవే నీసమస్తంబు సర్వోత్తమా సద్గురుస్వామి.

నమస్తే. నమస్తే. నమస్తేనమః.

# గురుదేవస్తోత్రములు

(నవరోజురాగము—ఆటతాళము.)

ఓన్నమోనారాయణా యనుచునిన్నునే - ఓపికతోదలతునో గురుదేవా
స్వానుభవమున నీవుసాక్షాత్కరింతువని సాష్టాంగమిడుదునో గు॥
అక్షరుడవైనీవురక్షింతువు నీదు పక్షమునజేరితిని గు॥
మోక్షప్రదుడవీవె ముజ్జగంబులలోన దీక్షచెగొలుతునో గు॥
ఆనందమొసగి నా యపరాధములుబాపు అప్పుడవీవెగద గు॥
ఏనిందలునులేక ఏకమైయెడగ మేలు విశ్వాత్మ ననుగావు గు॥
ఇతరమేమొల్లక నుయింపుగామీసేవ యిష్టార్థమనియుంటి గు॥
పతితపావననిన్ను భావంబుననునిలుప భయమేమిగలుగునిక గు॥
ఈవికారకై గాదువిచరించి వేషటలు యీజన్మకడతేర్చు గు॥
నావికుడవై మాయజలధిలో యీనావనడిపి కడతేర్చుమో గు॥

ఉత్తమోత్తప్రుడవని యుర్విలో నీకథలు సత్యముగ బలుకనో గు॥
సత్తయిన నీరూపు సాక్ష్యపడు కొరకై నినుభక్తితో గొలుతునో గు॥
ఊపిరి నిన్నాళ్ళు ఊహించి నినుగొలువ ప్రాపకంబివ్వవే గు॥
తాపసోత్తములెల్ల ధన్యులై కడతేరు దారిజూపిరిగదా గు॥
ఋతమైన నీవాక్యహితవుగలిగినవారు మతిమంతులైరిగద గు॥
గతిజూపువారలకు కారణాచార్యులిక గలిగిరే నీకంటె గు॥
రూఢిగను నినుగొలుచు రుషులెల్ల సిద్ధులై రుజువుగానుందురట గు॥
గాఢముగా నీమాయగనుటకును వేరేమి గలదు నినుగనుటగద గు॥
లుబ్ధుడను నేను సంసారాబ్ధిలో చాలనబ్దములు గడిపితిని గు॥
లబ్ధమౌ నినుదెలియు లక్ష్యంబులేక బలు శబ్దజాలము వింటి గు॥
ఘాటిజేయుచు నన్ను శత్రుబల మార్గునులోపమెంతురు తండ్రి గు॥
నాటియొందువలేప సంపూర్ణతత్త్వంబు సాక్షిచేయగనుంచు గు॥
ఎవ్వరిని వేడనిక ఈవసుధలో నికను దవ్వుజేయగబోకు గు॥
రవ్వంతదయదప్పరాబోకు నీకృపను రాత్రిబవలునుగోల్తు గు॥
ఏ వేళకేమౌనో ఎరుగకున్నానిటుల ఏకాంతమున గూర్చు గు॥
గానగలిగిన ఘనులు గలరెవ్వరిచోట నీవెగాకింకెవరు గు॥
అయినకాని స్మరించుచు ఆపదలకోర్చియును ఆర్తితో నుతియింతు గు॥
పయినమైపోవువడ పనికిరారెవరింక పాపములు బాపుమో గు॥
ఒక్కడవెనీవనుచు దిక్కులెల్లను బలుక మక్కువతో వెదకితి గు॥
చక్కజేసియు నీవు సాన్నిధ్యమున నన్ను గ్రక్కునను జేర్చుమో గు॥
ఓంకారరూపమై పసరియున్న నిన్ను వదలకనుయున్నాను గు॥
అహంకారమును బాపి ఆనందవార్ధిలో జంకుదీర్చుము నాకు గు॥

జౌననుచుబుధులెల్ల అభయమిచ్చితిరనుచు ఆశజెందితినయ్యా గు॥
వశానమున నినుజేరు మరియాదలో నిల్పి మందలించుచునుందు గు॥

అంతనీవై యున్న అర్ధమెరుగక భువిని చింతలలో దిరిగితిని గు॥
సంతోషమున నిన్ను చింతించు మార్గమున వంతలెల్లనుదీరు గు॥

కపటమేమియు లేక కలకాలమును నిన్ను గణుతింప వేడెదను గు॥
ఉపమైన నీవాక్యమూహించి నాహృదయ సఫలతనుదయ జేయు గు॥

ఓం బ్రహ్మమని శ్రుతులు ఘట్టిగా బలుకవిని కారణాత్ముడవంటి గు॥
చిన్మయానందమును జెంద జేయుక ధరలో శ్రేష్ఠులెవరున్నారు గు॥

గగనారవిందముగ తిదోచు జగముతో కలయ జేయగ బోకు గు॥
నిగమాంత వేద్యమై నిలచినది నీవెగా నిఖిలాత్మ వేరెవరు గు॥

ఘనమైన నీనామస్మరణకంటెను భువిలో ఘనమేమిగలదిక గు॥
వినయమున నినుబుధులు సన్నుతి జేయుచును సదా
వివశులై యుందురు గు॥

చనిపోవుకాలమున జనదెంచుట్లో డెవరు జగమునను నీవెగా గు॥
తనుధనంబులు ముందె తత్వజ్ఞులెల్లరు దారబోయగ వినమె గు॥

ఛత్రచామరములను జగములో కొన్నాళ్ళు జాలమేగద తెలియు గు॥
పత్రమైనను రాదు పరికింప తనవెంట భవభయంబులు బాపు గు॥

జన్మకర్మ ఫలంబు నిర్మూల మొనరింప చిన్మయుడవీవెగద గు॥
మునుముందుగా నీవేమూలమని వేడితి మురయుచు మదిలోన గు॥

జంకు లేకను నీదు చరణాబ్జములు గొల్వ శంకయేమున్నదిక గు॥
పొంకముగ నిన్నెపుడు పూజించువారలకు కింకరుల భయమేమి గు॥

జ్ఞానదృష్టిచే నీవు ధ్యానంబు లేకనిటు గానంగబడుదువో గు॥
హీనబుద్ధికినీవు వెగటుగా దోచెదవు వెరుగశక్యముగాక గు॥
టక్కుమాటలచేతటాటోటులై తేను వెక్కువేమున్నదిటు గు॥
దిక్కునీవని మిగులదీనులైయున్ననిక తక్కువేమియుగలదు గు॥
టాకుటీకులతోను లోకంబులోదిరుగ చీకాకుజెందెదరె గు॥
నీకథలువినగోరి నిర్మలంబున మెలుగ నిత్యసుఖమేకదా గు॥
డబ్బుకొరకై ఏమొ యిబ్బందులనుజెంద తబ్బిబ్బుగాకేమి గు॥
మబ్బువలెమాయలో ప్రబ్బితిరిగిన చాలదెబ్బలున్నవిగదా గు॥
డాక వేసియునీవె ధన్యులనుజేతువని జోకతో బల్కిరిల గు॥
ఏకరసమొందియునువిమలమానసులగుచు వెదకియుందురుగదా గు॥
తప్పకనునినుజేరుగొప్పయగుమార్గంబుయివ్వదేవయసేయు గు॥
ఎప్పుడేమానో నాకెరుగశక్యముగాదు తప్పులనుమన్నించు గు॥
స్థావరంబులజంగమాదులనునీవెగద దర్శించువారలకు గు॥
కేవలాత్ముండవని కీర్తింపనేరరిటుకిల్బిషంబులజిక్కి గు॥
దయగలిగిదీనులను ధన్యులనుజేయగల దైవమెవ్వరునీవె గు॥
భయమేమినీచరణ పంకేరుహములను భావంబుననునిలుప గు॥
ధర్మార్థకామమోక్షములను సమకూర్చు దాతదైవమునీవె గు॥
మర్మంబులనుదెలిపి మార్గమివ్వగనీవె మర్యాదగలదో గు॥
నానావిధంబులగు నటనలకునీవెగద నాటకుడవౌదువో గు॥
గాననేరనిజనులు కలుషాత్ములై విషయకాననంబునను బడిరి గు॥
పరుసమనుమునుసోకి పసిడివౌరీతి నిను బడయజాలినజనులు గు॥
ధరియించినీరూపు దాల్చెదరటంచు నీదరిజేరియుంటినో గు॥

ఫలము గోరియుఁగాదు భవమువీడుటకు నీభజన వేమరకుంటి గు॥
అలస టేమియు లేక ఆత్మార్థమున నన్ను ఆపియుంచగదయ్యా గు॥
బంధములు బాయుటకు భాగవతులతో చెలిమి బాయకుండగ జేయు
అంధకారము బాపి ఆత్మ తేజముజూప ఆధారులెవరింక గు॥
భావంబులో నిన్ను బాయకుండెడివారి భాగ్యమేమనవచ్చు గు॥
కావరంబున నిన్ను గానకున్నను మహాకష్టంబులేగదా గు॥
మరణకాలమునందు మరుపులేకను నిన్ను శరణుజొచ్చు విధంబు గు॥
కరుణసేయక యున్న కలుషంబులిడుటకు గతియేమిగలదింక గు॥
యంత్రంబులకు నీవు యంత్రికుడవై మాయతంత్రము నడుపుదువు
మంత్రమూలము నీవె మంత్రార్థమును నీవె మహనీయులెరుగుదురు
రక్షకులు లేరనుచు రాపుజెందగనేల రాజు నీవై యుండ గు॥
శిక్ష సేయక నీవు వీక్షించి భవబంధ శిక్ష విడిపింపుమో గు॥
లవమైన నీకరుణ లక్షలక్షలటంచు వివరింతు మదిలోన గు॥
భువనంబులన్ని మీ భవనంబులని నమ్మి స్తవము జేసెదనయు గు॥
వర్ణింపరాని నినువర్ణింపనావశమె వైభవంబై యలరు గు॥
నిర్ణింపగాలేక నిగమాగములలో నీవెవరికని యనిరి గు॥
శల్యమాంసయుతంబు చెడిపోవు దేహముః నశక్తియెటుగల్గునో గు॥
తెల్యనెవ్వారికౌను దేవుడవు నీవె కైవల్యాత్మరూపవో గు॥
సర్వార్థములనొసగు సర్వేశ నీచరణ సాక్షి జేయుదునయ్య గు॥
ఉర్వ్యస్థలంబులో వ్రూహాపోహలచేత వ్రూహింపగలరె నిను గు॥
హరిహరీయని నిన్ను ఆత్మలో దలచెదను ఆరాటమును బాపు గు॥
సరివారలెవరు యీధరణిలో నీవెగా మరుగుజొచ్చితినయ్య గు॥

ఫలముగోరియుఁగాదు భవముఁవీడుటకు నీభజన వేమరకుంటి గు॥
అలసతేమియు లేక ఆత్మార్థముననన్ను ఆపియుంచగదయ్యా గు॥
బంధములుబాయుటకు భాగవతులతో చెలిమిబాయకుండగ జేయు
అంధకారముబాపి ఆత్మతేజముజూప ఆధారులెవరింక గు॥
భావంబులోనిన్ను బాయకుండెడివారి భాగ్యమేమనవచ్చు గు॥
కావరంబుననిన్ను గానకున్నను మహాకష్టంబులేగదా గు॥
మరణకాలమునందుమరుపులేకనునిన్ను శరణుజొచ్చువిధంబుగు॥
కరుణసేయకయున్న కలుషంబులిడుటకు గతియేమిగలదింక గు॥
యంత్రంబులకునీవుయంత్రికుడవై మాయతంత్రము నడుపుదువు
మంత్రమూలమునీవెమంత్రార్థమునునీవెమహానీయ లెరుగుదురు
రక్షకులు లేరనుచు రావ్రజెందగనేల రాజునీవై యుండ గు॥
శిక్షసేయకనీవు వీక్షించిభవబంధ శిక్షవిడిపింపుమో గు॥
లవమైననీకరుణ లక్షలక్షలటంచు వివరింతు మదిలోన గు॥
భువనంబులన్ని మీభవనంబులనినమ్మి స్తవముజేసెదనయ గు॥
వర్ణింపరాని నినువర్ణింపనావశమె వైభవంబై యలరు గు॥
నిర్ణింపగాలేక నిగమాగములలో నీవెదిక్కని యనిరి గు॥
శల్యమాంసయుతంబుచేడిపోవుదేహముఁనశక్తియెటుగల్గునో గు॥
తెల్యనెవ్వరికౌను దేవుడవునీవె కైవల్యాత్మరూపవో గు॥
సర్వార్థములనొసగు సర్వేశనీచరణ సాక్షిజేయుదునయ్యా గు॥
ఉర్వీస్థలంబులో వ్యాహాపోహలచేత వ్యాహింపగలరె నిను గు॥
హరిహరీయనినిన్ను ఆత్మలోదలచెదను ఆరాటమునుబాపు గు॥
సరివారలెవరు యీధరణిలో నీవెగామరుగుజొచ్చితినయ్యా గు॥

దృష్టికి తెలియనిస్పష్టపరచిన యదృష్టంబయినది గురునామం
అష్టకమలముల కావలవెలిగే ద్రష్టయైనది గురునామం
పంచభూతములమించిన వెలుగై వంచనలేనిది గురునామం
మంచిగతను దానెంచినవారికి కొంచముగానిది గురునామం
నిరుపమానమై నిర్విశేషమై నిత్యంబైనది గురునామం
వెరుకమరపులకు వేరై యంతట తరుగులేనిది గురునామం
శమదమములుగ సాధుజనులకును సాధ్యంబైనది గురునామం
కూటస్థంబై కుదురుగనుండియు తేటయైనది గురునామం
మేటిశిఖరమున మెలగెడువారికి బాటయైనది గురునామం
అర్థవాదములు లేకను ఒకటై సార్థకమైనది గురునామం
అండపిండ బ్రహ్మాండములంతట నిండియుండినది గురునామం
పండితులెప్పుడు భావములోపల భావించినదె గురునామం
దినము రాత్రియు గాకను తానె దీపించును శ్రీ గురునామం
వివరముదెలిసిన విజ్ఞులకెప్పుడు స్తవమై యుండును గురునామం
పాదుదెలిసిన పరిశుద్ధులకును వేదవేద్యమౌ గురునామం
మోదముతోగను మునులకెల్లను మూలమంత్రమీ గురునామం
కన్నులలోపల సన్నపుబిలమున తిన్నగ వెలుగును గురునామం
విన్నకన్నవికనెన్నడులేకను వన్నెమీరినది గురునామం
ఫాలభాగమున మేలుగనెప్పుడు వాలలాడు నీగురునామం
కీలుదెలిసియును కీర్తనజేసిన తాలిమియౌ నీగురునామం
ధర్మముదప్పని నిర్మలులకు బహుమర్మంబైనది గురునామం
కర్మమకర్మము గాకను ధరలో కారణమైనది గురునామం

శాకపోకలును లేక లోకమును సాకుచుండునీ గురునామం
పాకము తెలిసిన పరముకోవిధులు బాయకనున్నది గురునామం
శబ్దరహితమై శాశ్వతమై ఘనశాసనమైనది గురునామం
లుబ్ధత్వంబును బాపినవారికి లబ్ధపడునుయీ గురునామం
అంటిఅంటకను అఖిలలోకములు నావరించినది గురునామం
బంటుతనంబులు గెంటినవారికి జంటయైనదీ గురునామం
లక్ష్యాలక్ష్యము లేమియుగాకను రక్షణయైనది గురునామం
దీక్షాపరులకు మోక్షరూపమై సాక్షియైనది గురునామం
గజిబిజి లేకను ఋజుమార్గంబున భజనీయంబౌ గురునామం
అజహరువాదిగ ననిశముదలచె అద్భుతమైనది గురునామం
బాధలేనిదై బోధరూపమై సాధించినది గురునామం
మేధావులుగన మేధినిలోపల నేటియైనది గురునామం
సచ్చరిత్రులకు సౌఖ్యంబొసగుచును సాటిలేనిది గురునామం
హెచ్చుతగ్గులును ఏమియు లేకను ముచ్చటైనది గురునామం
వేదమయంబై వెలిలోతానై వెలుగుచునుండును గురునామం
సాధనచే సాధింపవీలుగల సత్పదమౌ నీ గురునామం
ఆరుచక్రముల కావలనుండియు అఖిలంబైనది గురునామం
కోరినవారలకోర్కెలొసంగుచు కొంతదీర్చునీ గురునామం
ఈడయింగళలో జోడుబాయకను వేడుకయైనది గురునామం
జాడదెలిసినసర్వజ్ఞులకును తోడుగనుండును గురునామం
సంగరహితమై యింగితపరులకు భంగములేనిది గురునామం
అంగలింగముల కంటకవిషయ ప్రపంచముగానిది గురునామం

చూపురూపులనునొకటిగ జేసిన సూక్ష్మరూపమీ గురునామం
యోపికగలిగిన యోగాత్ములకును దాపుననున్నది గురునామం
స్థూలసూక్ష్మకారణములకావల మేలుదెలుపునీ గురునామం
కాలునిబాధలు దీరుటకొరకై వీలుగనున్నది గురునామం
పంచకోశముల నెంచిమించిన భక్తులుగన్నది గురునామం
కొంచెపువార్తలు గోరనివారికి గురుతరమైనదిగురునామం
జన్మదుఃఖముల సమయజేయుటకు నిర్మలమైనది గురునామం
పున్మనిగనుగొను వుచితులకెల్లను చిన్మయమానీ గురునామం
సర్వము తమలోనుంచి జగంబును నిర్వహించునీ గురునామం
గర్వగ్రంధులు బాపుటకొరకై ఘనమైయుండును గురునామం
వాక్యత్రయములు దెలిసినవారికి శక్యపడునుయీ గురునామం
ముఖ్యముగాపరమార్థమునొందెడు మూలమౌనుయీ గురు॥
నుఃఖకారంబును బొందనివారికి మార్గమౌను సద్గురునామం
సుమతులు తమలో సుఖముగజూచెడు క్రమమైయుండును గురు॥
జ్యోతిరూపమై నాతిపురుషులలో ఖ్యాతిగనుండును గురునామం
నీతివంతులకు నిలకడగలిగే నీమమైనది గురునామం
నిద్రలో నిద్రను దెలిసినవారికి భద్రమవును శ్రీగురునామం
చిద్రూపంబై శివపరులకు బహుశ్రేష్టంబైనది గురునామం
నేనునీవనే బేధములేకను నిలచియుండినది గురునామం
హానిలేనిదై యవస్థలిలో హాయినిజూపును గురునామం
గుట్టుదెలిసిన గుణవంతులకు పట్టయియున్నది గురునామం
దిట్టలువీడక దివ్యమైనదని స్పష్టపరచిరీ గురునామం

ఆజ్ఞలోనిలచిన యనుభవపరులకు సౌజ్ఞగనున్నది గురునామం
ప్రజ్ఞానంబై భాగవతులకును ప్రాపైయున్నది గురునామం
యుక్తాయుక్తము నెరిగినవారికి రక్తిగలిగినది గురునామం
ముక్తియుతంబై ముజ్జగములకును మూలంబైనది గురునామం
త్రిగుణములంటక నిగమవేద్యమై అగణితమైనది గురునామం
విగతకల్మషము విశ్వానందము విశ్వరూపమా గురునామం
వాసి వన్నెలును లేని సుశీలములోనగూర్చును యీగురునామం
యీశునిసన్నిధి జేరుటకొరకై మోసములేనిది గురునామం
ఘట్టిగ తపమొనరించువారికి పట్టుకొమ్మయా గురునామం
తుట్టతుదకు జగమొట్టిదియనుచును స్పష్టపరచునీ గురునామం
రూపరహితమా వ్యాపకు జేర్చెడు దీపకమైనది గురునామం
లోపములేకను స్థాపితమై నిర్లేపకమైనది గురునామం
భ్రాంతిరహితమై సంతోషంబును బాయకనుంచును గురు॥
వింతవింత తావిధివాదముల వీడద్రోయునీ గురునామం
పురుషార్థంబుల దొలగుచుధరలో పోషించుగద గురునామం
తరుణమువ్యర్థము జేయకదలచిన ధన్యుల జేరును గురునామం
సంచితములునదలించియు దేశికు పంచజేర్చునీ గురునామం
అంచితమై అపరోక్షపదవికిని ఆస్పదమైనది గురునామం
తప్పులుదీర్చియు దైవసన్నిధిని వొప్పుగనుంచును గురునామం
ఎప్పటికప్పుడె ముప్పులన్నియు తప్పకదీర్చును గురునామం
సమ్మతిగా కొమ్మాలపాటిలో యిమ్మైయున్నదిగురునామం
నమ్మినవారికి నమ్మినట్లుగా సొమ్మనజెల్లును గురునామం

దరియాగురువరురూపంబున యీ భ్రాంతికొచ్చినది గురునామం
సరిదవ్వనిబుధసత్తములకు మహాసౌఖ్యంబైనదగురునామం
ధరలో కుందురువారిపురంబున దారిదెలుపునీ గురునామం
మరువక ఖాశీందాసుమనంబున మననమౌను శ్రీగురునామం.



## గురునినామము

దేశికుని నామంబు మహా దుపదేశమని గొనియాడు చుండిన
మోసమేమియు లేనిదై పరవాసమీనామం॥ దేశి॥

లోకలోకము లేమిగాకను వ్యాపకంబై సర్వదిశలను యేకమై
సుజనావళినిగని సాకునీనామం॥ దేశి॥

భిన్నభిన్నములైన వెరుకను ఎన్నడైనను వెరుగకుండియు మన్న
నెరిగిన మానవులకు ప్రసన్నమీనామం॥ దేశి॥

ఆపదోద్ధారకమునై గన రూపరహితంబవుచు భక్తులప్రాపు
దాపై భవములంటని భాగ్యమీనామం । దేశి॥

నిత్యమై నిగమాగమములచే నెరుగరానిమహత్తరంబై మృత్యు
భయము బాపుటకు ఘనమూలమీనామం ॥ దేశి॥

తాను నేనను బేధభావము మానియుండిన మానవులలో జ్ఞాన
రూపంబవుచు నొకటిగ గాంచునీనామం ॥ దేశి॥

మనసులీనంబొటకిదియే మార్గమై మర్యాదగలదై వినయ
భయభక్తులతో గాంచెడు విద్య యీనామం ॥ దేశి॥

తప్పులన్నియు దీర్చుటకుసదె ధర్మమై దైవాజ్ఞబడసిన గొప్ప
వారలు బాయకుండెను గోప్యమీనామం॥ దేశి॥
వాసిగాదరియూహలు శేషా దేశికోత్తములనగ బరగియు భాసి
తంబుగ భాశింపా హృదయనివాస మీనామం॥ దేశి॥

## 1. తోహార

(ఆదితాళము-నాదనామక్రియ)

జ్ఞానానందమయుండగు దేవుని ఘనకీర్తిని గొనియాడవలె
గానకున్నయీమానవజన్మము కడుహీనంబని తెలియవలె
జీవగుణంబులువీడి నిజంబగు దేవగుణంబులు గలుగవలె
చావుపుట్టువులులేనిసుఖంబా తావుజేరితానుండవలె
అపరిమితానందంబున నెప్పుడు వుపదేశంబుననుండవలె
చపలగుణంబులులేకనిజాత్మతొ చెలిమిగలిగియును మెలగవలె
తనకుతానైయె వేరుగానకను తత్వశోధనము జేయవలె
వెనుకముందు రెండెరుగక తనలో వేదవేద్యుశోధింపవలె
దీక్షచే గురుపదలక్ష్యమునిల్పియు మోక్షసతివిభుగొలువవలె
సాక్షియైన సర్వేశ్వరుజేరు రక్షణయునిమది నెరగవలె
శుక్తిరజతమను భ్రాంతినిబొందక వ్యక్తిగలిగి తానుండవలె
ముక్తిమార్గమును విడువక శాశ్వత భక్తితోగని సేవింపవలె
హృదయునిలోవలసదయునిపొడగని వదలకుండతానుండవలె
విదితమనుచు యాశ్వమయుని కథపీనులవిందుగ వినగవలె

దేశికప్రభుడౌ దరియాగురువరు దేవదేవుడని తెలియవలెన్
యీశునిదెలియక వేసటగలదని ఖాశీంమదిలోగాంచవలెన్.

## 2. తోహార

పరమాత్మా నీభజనచేయగల పద్ధతిలోనను నిలుపుమయా
వరదుడవనిమును ఘనులన విని నీశరణుజేతు కరుణింపుమయా
ధన్యునిజేసెదవని నీపదములుఁదలదాల్చెద దయయుంచుమయా
అన్యుడవని ననుజూచిన భువిలో నాప్తులెవరిక లేరయ్యా
వేసటగలిగెడు దాసులఁబ్రోచెడు నీసమానులెవరుందురయా
దోసిలొగ్గి నేనాసజెందితిని గాసిపెట్టకను గావుమయా
ని కడగలిగియు నినుసేవించెడు నీతిమార్గమున నిలుపుమయా
కలలోనైనను నీదుయాజ్ఞగన కాలముగడుప కాపాడుమయా
హాయిగలుగ ఆయాసమిడువ నీసాయమున్న నికజాలునయా
కాయమువదలెడుకాలముననునినుబాయనిమార్గముజూపుమయా
అందమైన నీకథలనువిని యానందించుట నాకాసగుమయా
మందమతితోయిహాపొందుగోరిబహు సందడిలోబడి ఉంటినయా
మోక్షాపేక్షజనించినవారికి రక్షకుడవు నీవుందువయా
దీక్షాపరులాపేక్ష చెనినుగని లక్షణయుతులై యుందురయా
దరియాగురువరు చరణములబ్బిన పరమపదమునకు బాటయ్యా
మరుగుజేర స్తుతియించెడు తంగెళ్ళదరిజేరుట కిదెదాపయ్యా.

## 3. తోహర

లోకాధీశుని సత్కృపగనుగొన లోకభ్రాంతిదిగనాడవలెన్
శోకమోహములులేనిమార్గమును జూచిసుఖంబుననుండవలెన్
రకరకముగలవికృతియాజగమునుఒకటిగగను నేర్పెరుగవలెన్
ప్రకృతిగుణంబుల బడనియాత్మను భావశుద్ధిచే నెరుగవలెన్
ఆత్మానాత్మవివేకముతో పరమాత్మ తా జేరియు మెలుగవలెన్
ఆత్మయే దేహంబనుయవివేకమునణచి అవ్యయునిగలియవలెన్
చూచినదంతయుసుఖముగదోచె లోకనమాలోసింపవలెన్
దాచినధనమునుజూచినరీతిని యోచనతనలోనుండవలెన్.

## 4. తోహర

పాలనజేయుచు పరమాత్ముడునిను బాగుపరచునే ఓమనసా
కాలునిచే బలుకష్టములొందక మేలుదెలియవే ఓమనసా
కర్మబంధములు జన్మహేతువని మర్మమెరుగవే ఓమనసా
దుర్మోహంబుల దొలగద్రోచినిను నిర్మలులెరుగవె ఓమనసా
దుష్టగుణంబులు దోచుచున్ననిక నష్టంబేగదా ఓమనసా
స్పష్టంబుగ సర్వేశ్వరు పదములు దృష్టిలోనిలుపవలె ఓమనసా
గురుడే దైవంబని నీవెప్పుడు గొలుచుచునుండవె ఓమనసా
యెరుకగలిగియును యెరిగినవారికె వేడుకదోచును ఓమనసా
తోలుబొమ్మలీ దేహములని నీవు కీలుదెలియవే ఓమనసా
నీలతోయదమున నిలచినవారలె నిశ్చయులౌదురు ఓమనసా

హాంసనటించె విధము నెరింగిన హింసలు శేవే ఓమనసా
మాంసనిర్మితంబైన శరీరము మరుపు జేయునే ఓమనసా
సతినుతహితులను చర్చలలోబడ హితవు దెలియదే ఓమనసా
మతిమంతులకిది మార్గము కాదని మరువకుండవే ఓమనసా
సతతంబాత్మసమాధిలోనిలచే జాడవీడకే ఓమనసా
వెతలుదీర్చుదరియాగురుకరుణయె సశమునినమ్మవే ఓమనసా
పాశబంధములు దొలగుటకొరకై ఖాశిందాసుడు ఓమనసా
అశించియు గురుసేవచేయుచును దోసిలొగ్గనే ఓమనసా.

కం॥ శ్రీగురుపదపద్మంబులు
బాగుగహృదయంబులోనపదిలపరచియా
ఆగురువేద్యుని దలచుచు
సాగరసమమైన విషయసస్మృతి ద్రోషక.

## 5. తోహర

విధియని సద్గురు బోధామృతమును వీడక గ్రోలుట సుజ్ఞానం
బధిరునివలె వినగోరక భవములబడి పొరలుటయే అజ్ఞానం
అధికబలంబున ఆత్మను జేరియు వదలకనుండుట సుజ్ఞానం
అంధత్వంబుననటునిటు దిరుగుచు అలసట జెందుట అజ్ఞానం
దృష్టినివీడక ద్రిష్టనుగలసియు నిష్టగనుండుటే సుజ్ఞానం
వ్యష్టిగుణంబులు విడువని చేష్టలనష్టపడుటయే అజ్ఞానం
మనసుసన్నగిలిమార్గమెరసియును మననము జేయుట సుజ్ఞానం
ధనజనయవ్వన సంతోషంబున కనుగొనని దే అజ్ఞానం

వాసనత్రయముల వేసట నెరుగక నాశమొందుటె అజ్ఞానం
అంతరజ్ఞప్తిచె ఆనందంబున చింతలణచుటే సుజ్ఞానం
చింతలలోబడి చిందులు ద్రొక్కుచు వంతలునొందుట అజ్ఞానం
ప్రాప్తఫలంబును పరిశోధించక తృప్తినొందుటే సుజ్ఞానం
గుప్తమైన సుఖభావమువదలియు వ్యాప్తినొందుటే అజ్ఞానం
రక్షకుడౌ దరియాగురువను శిక్షణనొందుటేసుజ్ఞానం
మోక్షమార్గముదెలియక వివిధాపేక్షనొందుటే అజ్ఞానం
గురుచరణంబులు విడువక ఖాశీఁగొల్చుచునుండుట సుజ్ఞానం.

## 6. తోహర

సూటిదెలియకను శుష్కవాదముల చాటుచుందు వేమి
మాటలలోగల మర్మమెరింగియు పాటబాడ వేమి
హాటకశైల త్రికూటమందు నీవు చోటుజూడ వేమి
కాటుకపక్షుల గదియపరచు నీబాటనుండ వేమి
సంసారంబున హింసజెందుచును హంస నెరుగ వేమి
మాంసమయంబౌ దేహముజూడని మార్గ మెరుగ వేమి
జాతకమున సంజాతమైన నీజాడదెలియ వేమి
జాతిపురుషులను గాని పరాత్పరు నమ్మియుండ వేమి
ఖండితముగ యీమాయాజాలము గాల్పవైవ వేమి
పండితులకు నిజభావమునుండుట పద్ధతియన వేమి
మాయమర్మములు మరిమరిజూచుచు మరుగుచుందు వేమి
హాయిగనుండె మార్గములోపల అణగియుండ వేమి

కోరికలెల్లను గుదియపరచి నీవు దారి నుండవేమి
ధీరులు బొందిన మార్గము మనకది దిక్కని యనవేమి
నిలకడతో దరియాం గురుస్మరణయె నిత్యమన వదేమి
తలపులలోపల ధైర్యమొసగు నిజధామ మొందవేమి
దాసదాసుడౌ ఖాశీందాసుని వేసమెరుగవేమి
మోసపోయినను శాశ్వత సౌఖ్యము నాశమగాను యనుమీ.

## 7. తోహార

అన్నిలోకముల కాధారంబౌనున్న పరాత్పరునెరుగ వలెన్
భిన్నమైన యీలోకములన్నియు సున్నజేయుమిగిలున్నదగున్
తుదమొదులనియనరాని మహాత్ముని వదిలముగ సాధించవలెన్
ముదమున మదిలో వదలక దలచుచు సదయుని సన్నిధి జేరవలెన్
అంతటతానై యనుభవపరులకు సంతోషంబున గూర్చవలెన్
వింతవింతలౌ మాయను జేరని విబుధులచె వివరింపబడున్
శాంతాకారుని సర్వమయుండని భ్రాంతివీడి భజయింపవలెన్
సంతాపంబిసుమంత లేకను శాశ్వతు సాక్షిగ జూడవలెన్
నామరూపగుణ స్థానమునంటని స్వామియనుచు సాధింపవలెన్
నీమము గల్గియు నిర్వికారులై నిత్యసుఖంబును పొందవలెన్
భవము వీడుటకు భక్తవత్సలుని భావంబున పఠియింప వలెన్
సువిచారంబున సూటి వీడకను సుస్థిరు మరుగు జూడవలెన్
దరియాసద్గురు పదపద్మంబులు తాల్మిగలిగియును దలచవలెన్
వెరపుదీర్చియను ఖాశీందాసుని యేలిన ప్రభువని యెరుగవలెన్.

## 8. తోహర

వలదని చెప్పిన వదరుచునుందును పలువగదా యీమనసూ
నిలకడజేసిన కొలది కాలమే నిలచి నిలవదు యీమనసూ
నీవు నేనను త్రోవవిడిచి పెడత్రోవల దిరుగును యీమనసూ
కేవలమాత్మఫలంబుగనుటకు కేకలు వేయును యీమనసూ
యెంతజెప్పినను వెనుకటిదారికెయీడ్చుకపోవును యీమనసూ
అంతరాత్మనిలో అనుభవమెరుగక ఆరడిబొందును యీమనసూ
తప్పులు వెదుకుటగొప్పతనంబని తలచుచునుండును యీమనసూ
యెప్పుడో మరణముదప్పదనుచు యీచొప్పదెలియదీమనసూ
శ్రీగురుదరియా గురువరు సేవయె ధన్యతదలచదుయీమనసూ
మరువని భాశింమననములోపల నిలచి తెలియదుయీమనసూ.

## 9. తోహర

పరమపదంబది దూరంబని నీవు భావింపకవే ఓమనసా
మరువక నీవై యున్నమర్మమది మరిమరి దెలియవె ఓమనసా
ఘట్టిగ సద్గురు పాదము నమ్మిన పట్టుగల్గునే ఓమనసా
వట్టిమాయలోబడి పొంలిన నీగుట్టుదెలియదే ఓమనసా
వెలిలో బయలను విధమెరింగినను కలతలేనుగదె ఓమనసా
పలుమాటలతో పనియేమున్నది భయము వీడునే ఓమనసా
యీషణములలో జిక్కికృశించిన మోసమానుగదె ఓమనసా
భూషణమా పరలోక నివాసము ఆసింపగదే ఓమనసా

సంశయములచే నిలకడలేకను హింసజెందకే ఓమనసా
మాంసయుతంబౌ మలిన శరీరము మాటదలపకే ఓమనసా
ఆపదలన్నియు బాపుటకొరకై హానుడే గురుడౌ ఓమనసా
లోపములేని సుఖాబ్ధిని దేలుచు పాపము వీడవె ఓమనసా
నిజమెఱుంగుచును సుజనుల జేరియు భజనసేయవే ఓమనసా
కుజనులగూడకు కుచ్ఛితమార్గము గజబిజిగదవే ఓమనసా
దరియాగురువరు దరిజేరిన నీగురుగు దెలియునే ఓమనసా
తరుగులేని యాబ్రహ్మపదంబది దాపునయున్నది ఓమనసా
మరిమరి దలచెడు ఖాశీందాసునిమాయలోముంచకే ఓమనసా.

## 10, త్రో హా ర

పరమపురుషులై ప్రబలుచుండెను ప్రభునిసన్నిధినిగాయకుమా
మరుపకహృదయములోన జేర్చుకొని మాయకులోబడి మెలగకుమా
సతతముసద్గురు సాక్షి జేయుచును మతిమంతుడవదై జేయుసుమా
హితవుగ కారణగురువరుపదములుమతియని మదిలోనెంచుసుమా
పంచకోశములమించిన ఆత్మను వంచనలేకను గాంచుసుమా
మంచికాలమిదిమరుపుగలిగిననుకొంచెమాదువనిగొలువుసుమా
నీలో సకలము నిలిచియున్నదని నిర్మలజ్ఞానము నుంచుసుమా
మేలగువార్తలు మెలుకవతోవినికాలముగడుపుట ఘనముసుమా
ధరలో దరియాదేశికు కరుణయె ధన్యతగల్గునుయనుముసుమా
మరుపులేక భజియించెడుఖాశీంమార్గమిదేయనియనుముసుమా.

## 11 తోహర

పరమాత్మా నీభజనజేయగను పాపములేవియు లేవుగదా
హరిహరాదులకు ఆధారంబై తెరవుదెలిసినది నీవెకదా
కరుణాకరుడవు కారణమూర్తివి పరమపురుషుడవు నేవెకదా
దురితములెల్లను దూరపరచ నీసరివారలు భువిలేరుకదా
ఆపదలెల్లనివారణజేయు హృద్దేవకులెవ్వరు లేరుకదా
ఓపికతో మును తాపసులెల్ల నీతావుజేరి సుఖులైరిగదా
హాటకశైలత్రికూటాద్రిపై నాటకధారుడవీవెగదా
బాటలోనిలచిన భాగవతులకు నీచోటుజూపినది నీవెకదా
కాలునిచేబడి కష్టములొందని కీలుదెలిపినది నీవెకదా
పాలభాగమున యీలలుబాడుచు పరముదెలిపినది నీవెకదా
గండములెల్లనుగాచి సుజనులను అందగజేస్పినది నీవెగదా
దండిగ కుండలిశయనుడౌ అఖండమూర్తివి నీవెగదా
జాలవిద్యల జోలిదలంపక మూలముజూపుట నీవెగదా
నీలతోయదమున నిలచి జగంబులు నిర్మించినదియు నీవెగదా
వాసిగ దరియాదేశికు ప్రభువై గాచిదీర్చినది నీవెగదా
ఆసించిన యీఖాశీందాసుని దోషము బాపినది నీవెగదా.

—ద్విపద—

శ్రీగురుపదములు చిత్తంబునను జేర్చి
బాగుగా వినుము సద్భావంబు గలిగి
యెరిగిన వారలకెరుకయై యుంట
మరుగెరింగిన వారు మరువబోరిలను

ముందు గురుసేవయే మూలంబు గాంచి
యెందెందు తిరిగిన యేమి ఫలమౌను
నాల్గుశుశ్రూషలు నయమొప్ప జేసి
పాలౌన గావలెను పరమార్థ మిటుల
గురు కరుణామృతము గ్రోలు వారికి
పరమర చేతిదై బరగుచు నుండు
సాధనంబులు నాల్గు సాధించిపైని
బోవదెలిసిన గదా పూర్ణాత్ముడౌట
కాలంబు వ్యర్థమై గడవ సుఖమేమి
తాలుమాటలచేత దారెరుగరాదు
లోలోనజూచుచు లోకంబు మరచి
పాలముందున దృష్టి పదిలంబుజేసి
లీలగా గని మాయలోలత గాక
కాలంబు గడపుచు ఘనతరంబైన
సర్వాత్ము నూహించి సాక్షిగా జూచి
నిర్వాణ పదవిలో నిపుణత గాంచి
మనసు ఒక్కటి జేసి మర్యాద గలిగి
వినయంబుగా గురుని వేడుచునున్న
తనివిదీరను తుదకు ధైర్యంబు గలుగు
చనిపోవు కాలమును జాడెఱుగవచ్చు
దరియూ గురువరు దయవలన నిట్లు
భావంబు నెప్పుడును బరగును ఖాశీము.

## —ద్విపద—

మరణ జననము లేని మార్గంబు దెలియ
కారణాచార్యుని ఘన కృపగాదె
యెన్నియన్ని విధముల యెంచి చూచినను
తన్ను తా నెరుగక దైన్యంబు విడునె
సాటిలేనటువంటి సర్వాత్మ గనక
కోటివిద్యలు నేర్చు కొరతయేగాదె
భక్తి శ్రద్ధలు లేక పరమాత్మకరుణ
యుక్తిచే గననౌనె యోగులకైన
దాసదాసులబ్రోచు దరియా హుశేనా
దేశిక ప్రభుగాదె దిక్కనుచు ఖాశీం
వేసటేమియులేక వేగిరపడక
కోసిలొగ్గి భజించదొరకి కను ముక్తి.

## —:మంగళహారతి:—

1 మంగళం మంగళం శ్రీగురురాయ మంగళం మంగళం
మంగళము నీకు నిన్ను మహానీయులెప్పుడు రంగుగా త్రికూట
సౌధమందునిల్పి పొంగుచును ఆనంద పురములోపలనిన్ను
ఏకరూపముతోడ గొల్చుచుందునుస్వామి ॥మం॥

2 పంచభూతములకు పంచకోశములకు మించినీవుందువు మేటి
గనూ ఏమనరాకనూ ఎందుజూచిననీవై సందు లేకనునీవు
నిండియుందువుస్వామి ॥మం॥

3 స్థూలము సూక్ష్మము కారణములకును ఆవలయుండెడి
యనుభవంబుస్వానుభవులకు దెలియు స్వాంతమందున నిపుడు
ఆరుకమలములకు ఆవలఃందువుస్వామి ॥మం॥

4 శ్రీగురుతంగెళ్ళ స్వామిరూపముతోడ నాదుబిందుకళల
నావలియై పాటించిప్రణవము పలుకుచుండినరూపై నిండి
నిర్మలముగ నిలచియుందువుస్వామి ॥మం॥

—: గద్య :—

ఇది శ్రీ దరియాహుస్సేన్‌వలీషా ఖాదరి దేశిక సుజ్ఞానసుత
శ్రీఖాశింవలీషాఖాదరి దేశిక ప్రణీతంబైన పరమామృతం
బను గ్రంథంబునందు స్తోత్రములు సమాప్తము.

ఓం శాంతిః. శాంతిః. శాంతిః.



ఓం శ్రీ గురుభ్యో నమః

# తత్త్వములు

(కేదారిగౌళ - త్రిపుటతాళము)

శ్రీ గురువరుని కరుణచే గుర్తెరిగి మిముజేర గుణవంతులైరి భువి రామా । తరింపుచుటకు తన్ను దర్శింపవలెను వేరు తెర వేమిగలదు శ్రీరామా.

2 దయజూపి బ్రోచుటకు దైవమైన నువులో దాగియున్నావిట్లు రామా । భయమెల్ల విడుటకీ ప్రాపుదొరకినగదా నియమమని బుధులనుట రామా.

3 వసుధలో దరిజూపుస్సేన్ పా గురురూపమై వచ్చితివి మము బ్రోవగా రామా । వశమె తంగెళదాసు వర్ణింప నీమహిమ అసమాన సువిలాస రామా.

## 2 తత్త్వము

(శంకరాభరణం - ఆటతాళం)

శ్రీ రమణ నినుగొలువ నేరని నరజన్మ మేరీతి కడ తేరునూ భవముల బారలి ఘోరాగ్నిలో గూలును ॥శ్రీర॥

1 సారవిహీనమౌ సంసారాబ్ధిలో జిక్కి ధీరత దరిగిన దిక్కెవ్వరున్నారు - వారు వీరను మాయలోబడి కారణం బరయంగ లేకను నేరముల పాలైన నిను గను దారి గలదే కారుణీస్థలి ॥శ్రీర॥

2 చిత్త మింద్రియముల మొత్తముననుజేర్చి తత్తరపడ సౌఖ్యమా నిజమెరుగని పెత్తన మదిభేష్యమా - విత్తమార్జన జేసి విరక్తి వీగిన ఫలమా సత్తయిన నీఘన శాసనం బెరుగక మత్తునను మానావమానము మరచి విషయ విరక్తి గానక రిత్తలై వర్తించు వారికి యెత్తెఱంగున దెలియబడుదువు ॥శ్రీరమ॥

3 ఆదిఅంత్యములంచు శోధింపనేరని బోధరూపుడ వందురూ విజ్ఞులు తమలో సాధించి నిను గందురూ - వేదవేద్యమవుచు వెలుపల లోపల బాధ లేమియులేని పరిపూర్ణతను గలిగి నాద నీదనరాక నెప్పుడు మేదినాకాశములు గాకను పాదుగను బ్రహ్మాండముల నిటు మోదమున నాడింప నీవే॥శ్రీ॥

4 తుదలేనినీఘనము తెలియ శక్యముగాక నిలచి నీలోగ సిరి నిర్మలులౌచు కలువరింతలు వీడిరి - చులకన గాదిది నిలకడ గలుగుట తొలిజన్మ ఫలమనియు దెలియవలయు నిట్లు అలసటలు బాపియును భక్తుల కాశ్రయంబై యున్న నినుగన గలరె నీవేగాకితరులు ఘనతగాంచిన ఘనులు జగమున ॥శ్రీరమ॥

5 వాసిగ దరియాగుఱు దేశికరూపమై మోసములనుబాపుచూ సుగుణములనివాసమై దరిజూపుచూ - ఆసించి భజియించు ఖాశిందాసుపై వేసటలేక కృపజేసి రక్షించెను వాసన త్రయరహిత హృదయ నివాసమై వెలుగొందు సత్ప్రభో నీసమానులు లేరనుచును వాసనాదులు బలికిరిటు మును ॥శ్రీరమ॥

## 3. తత్వము

(ఆనందభైరవి-ఆటతాళం)

1 దేవాదిదేవ మహాదేవానిన్ను భావంబులోగనుటెట్లో వా-
లావుసన్నముగాక కేవలాత్ముడౌచు నీవేగ సర్వము నిండి
యున్నావిట్లు ॥దేవా॥

2 ఉత్తమోత్తములైనవారునిన్ను చిత్తమున జేర్చియున్నారు-
తత్తరంబులు దీర్చి తత్వజ్ఞుడవు నీవు హత్తుకొని సర్వమున
ఆవరించున్నావు ॥దేవా॥

3 దండిప్రభులెవరు నీకంటె విషయధర్మముల్ విడచియుంటె-
ఖండితంబుగ నీవఖండమూర్తివటంచు మెండుగ బుధులెల్లా
మేటిగా దలచిరె ॥దేవా॥

4 అన్యచింతనలేక నిన్నుదలచుచున్నవారలె గనిరి మున్నా-
ధన్యులై వెలయుటకు దారి గలదా వేరే శూన్య భావం
బునను జూడ శక్యము గాని ॥దేవా॥

5 సర్వరూపములు నీవనుచు దెలిసి యుర్విలో నిన్నెప్పుడు
గనుచు - నిర్విచారంబునను నిత్యసుఖులై తాము సర్వార్థ
ములు గలిగి సమభావులయినారు ॥దేవా॥

6 వాసిగ దరియాగురుండేధరను యీశుడై విహరింపుచుండే-
దాసుడై ఖాశీం దోసిలొగ్గి దలచు దేశికులెవకు దీనుల
పోషింప॥దేవా॥

## ౩. తత్వము

(బేగడరాగము-అటతాళం)

1 ఉన్న దానిని దెలియవలెగదరా ఓరోరి జీవా భిన్న పడి
నను నీకు బిడియము రా - ఉన్న దానిని దెలియలేక నువెన్ని
విధముల వెదుక ఫలమా నిన్ను నీ వెరిగినను సర్వము నీవె
నీవై యితర మెరుగవు॥ఉన్న॥

2 కాలమాసన్నమై యున్నదిరా కలకాలమును యీకలను
జూచియు కలువరింపకురా - నీలతోయద మధ్య మందున
నిలచి నిర్మలమైన వారలు పాలుమాలక బ్రహ్మమయులై
పరమ సంతోషమున నుందురు ॥ఉన్న॥

3 కామమున కడతేరగలవటరా కాగలవి యెట్లాగాకపోవను
నీమ మిడువకురా - సోమ సూత్రమునందు పసిశివు జూచు
నేర్పెరిగినను విషయ స్తోమమంటని సుఖము గలిగి విరా
మమై వెలయుదువు నీవే ॥ఉన్న॥

4 సత్యమను పథ్యంబువిడువకురా విజయంబుకోరకదిముఖ్యమై
యున్నట్టి మంత్రము రా - ప్రత్యగాత్మను గలయు వారలు
భావ మానందామృతంబున మృత్యు వెన్నడో భయము
కోర్చి మోదమున మురయుచును వెలిగెను ॥ఉన్న॥

5 గురుని కృపయే గురుతు గాదటరా గుర్తెరిగిమరువని తెరవు
గలుగుటె తెలివియగా గదరా-కరుణగలిగినదరియగురువరు
చరణములు శిరమునను దాల్చక నిరతమా దేశికుని కృపకై
నిలువ నిజమె తెలిసె తంగెళ ॥ఉన్న॥

## ౫, తత్త్వము.

(ఏకతాళము - కల్యాణిరాగము)

1 యేల యీజన్మము గురుకృపలేని దేల యీజన్మము -
యేల యీజన్మ మివరమెరుగకున్న కాలుని బారిలో కష్ట
మొందుటగాదె ॥యేల॥

2 ధన జన పశు గేహముల్ నిజమని నమ్మి వనజాక్షుపదపద్మ
ముల్ - గననేరకను మాయ వనధిలోబడి అనుమాత్ర
మైన చిత్తాత్మ నెరుగనివారి ॥యేల॥

3 నరరూపమున బుట్టియు పరమార్థము తెలియని గననట్టియు-
దురితాత్ములకు పరము దొరకు టెట్లానిట్లు వెరపు లేకను
దిరిగి వ్యర్థులై జనువారి॥యేల॥

4 వృత్తి వాంఛలతోడను గురు తెలుగక దిట్టలై దిరిగియును -
పుట్టి పాపులై పోవునట్టి దేహములను ఘట్టిగ నమ్మియు పట్టు
విడువనివారి ॥యేల॥

5 నియమములను దప్పియు నిత్యానిగనక కామములను గప్పియు-
సోమరులై భువిని సారతత్త్వమును జూచి తామసపరులవుచు
దారి తెలియనివారి ॥యేల॥

6 కులగోత్రములు లేని తానని భ్రాంతిచే నిలిచియె కలకాలములు
గలవని-యిలభోగములచే తనివి రవిగున పట్టిక యుపరితలలోన
తెలిసి బ్రోలినవారి ॥యేల॥

7 పరమాగురుని నెరి సేవయే ధర్మముల జేయు సరియైన సరణి
నిరుహమో-మురుహరు క్షాంతి మదినిలుపగా మాకు తిరిగిన ఫలమానె
దెన్నక తెలియకున్న ॥యేల యీజన్మము॥

## 6. తత్వము

(మిశ్రగతి తాళము - శంకరాభరణము)

1 యెందుజూచిన నందెయున్నదిగా సర్వాత్ముసదనము నొంద
గోరినవారి కందునుగా - బంధములకేర వైనమాయా సంధి
దెలసి చరించుసుజనుల కెందములకానందమై భవమొంప
జేయుని బాంధవంబిది ॥యెందు॥

2 గొప్ప కొద్దియుగాక యున్నదిగా బ్రహ్మానుభవము
ముప్పాలన్నియు దీర్చుచున్నదిగా - తప్పుద్రోవల బోక
సర్వము - నొప్పతికినర్పించి ధర్మముదప్పకను తను తాను
గాంచెను చొప్పుదెలిసినవారికిప్పుడె ॥యెందు॥

3 దండివారల భాగ్యమదియవుగా దయజూపి నిరతము నిండు
ప్రేమనుజూపునది యదెగా - మండలంబులకును నావల
నిండి సర్వాధారమవుచును పండితుల హృదయంబులందు
నఖండమై వ్యాపించుచున్నది ॥యెందు॥

4 వెరపులన్నియు దీర్చుచుండునుగా దురితాంబురాశిని జరి
రాకనే వెలుంగుచుండునుగా-పరమపదమై భక్తగణ్యులభాగ
మందున తేలుపడుచును మరపులేనటువంటివారలు మర్త్యమై
మహనీయమై తా ॥యెందు॥

5 పద్ధతెగిన ప్రసిద్ధమున్నదిగా పరమార్థసంపద సిద్ధులకుప్రసిద్ధ
మైనదిగా - బుద్ధిమంతులలోనని యాపద్ధతులబోజూప
సర్వము శుద్ధముగ గనుపింపజేయు సార్థకంబై యుబుకు
చున్నది ॥యెందు॥

6 చింతావింతాలైనమాయా అంతయూ దెలిసియున్న నీకు చింతలేమి జేరా రాబోనె-ఓఓ జీవా రాయా భ్రాంతిపోదీ భయము దొలగూనె.

7 రూపారహితాత్మైన దాని ప్రాప్తు జేరియున్న నీకు ఆపదా లేమి యూ రాబోనె-ఓఓ జీవా రాయా లోపములదాపు జేరాకే.

8 దోషారహితాత్మైనదరియూ దేశికుని జేరియున్నా ఖాళీమూపి వేసాటుమగూనె-ఓఓజీవా రాయా వేషభాషలెల్లవిడువావే.

## 8. తత్వము

( మిశ్రగతి తాళము - శంకరాభరణము )

1 రామభజనా సేయురే ఓనరులార రామునిమరిగొలువరే ప్రేమతో-శ్రీరామనామామృతముగ్రోలబాము లేమియు రాప్రు భయమేల మనకిపుడు ॥రామ॥

2 అంతరాత్ముని చేరియు పరమార్థమున చింతలెల్లనుపీడియు-సంతాపమునపగమాంతూని సేవనిరంతరమొనరింప భ్రాంతి రహితంబౌను ॥రామ॥

3 అరిషడ్వర్గములణచియు హరిహరియనుచు ఆనందమును బొందియు - సరిబోల్చరాని యూనస ర్వోపాసత్సఫలు మరణజననము లేని మార్గమొందగజేయు ॥రామ॥

4 మోసమేమియు లేనిది రాముని భజన వేసాటలను బాపేది - ఆసించిమునుభక్తులాశ్రయించిన పదవి దోసిలొగ్గియు సేవ జేసిన సుఖమాను ॥రామ॥

5 బూటకములు లేకను మానికొండ మేటిశిఖరమునందును-
చోటుజూచియు నిలచి సుజనూల దరిజేర్చు నాటకధారియై
నటియించుచున్న (శ్రీ) ॥రామ॥

6 (శ్రీ)మీర దరియూవ్రిభుక్ గొలుచుచునున్న పాపముల్ విడి
పోవును-ఆసించ ఖాశీందాసు ఎల్లప్పుడు నాశికాగ్రమునందు
నానందముగనుండు ॥రామ॥

## 9 తత్త్వము

( మిశ్రగతి తాళము - శంకరాభరణము )

1 రాముని భజియింపరాదా ఓ వెర్రిజీవా స్వామిని సేవింప
రాదా - స్వామిని సేవింపనీకు ప్రేమగలిగియున్న సకల
బాములణగి భద్రగిరిలో ధాముని జేరేవుయిపుడే ॥రామ॥

2 ఆపదు లేమియులేవా శ్రీరాముల జేర పాపాము లేమియు రావు
రేపుమాపనగ రాక తాపాసవరదునిస్మరణ - యీప్రొద్దే
జేయుట మరమ్మ విడువరాదు విశ్వాసి భజనా ॥రామ॥

3 అందరానిదనుచు భయపడకు సర్వాత్మరూప మందాకిలో
నున్నాది విడకు- సందియు మేలాను నీవాసంధి దెలిసియున్న
జాలు బంధములు లేని తావుభావాము దే వెదుకదొరకు॥ రామ

4 శ్రీగురుదరియారూపై యున్న రాము నేప్రొద్దుదలచుచును
ఆశించి - ఖాశీముదాసు ఎల్లప్పుడు రాక పోకలు లేని స్వామిని
గొల్చుశ్రీ ॥రామ॥

## 10. తత్వము

( ఏకతాళము - బేహాగ్ రాగం

1 దయామయుడవో దేవా నీధ్యానమ్మె మోము క్షితిలో (వ దయా
నయంబులు దెలిసియు మనుజులు - భయాపహారులై
బరగుచునుందురు ॥దయా॥

2 అఖిలార్థంబులుగలిగి నాయాపదలెల్లను దొలగి - సుఖముగ
మీవదసేవారతిలో నిఖరముగనను నిలుపవెదయుతో॥దయా

3 అన్నిలోకములనిండి నీయాకృతి దెలియకనుండి - తిన్నగ
గనుగొనను్న మహాత్ముల సన్నుతికే నీవుసాక్షివైతివిటు
॥దయా॥

4 విపరీతములుమాని నీకృపదెలియుటకై బూని - అపరోక్షం
బున అనుభవపరులై సఫలతనొందిరిసాధువులై భువి॥దయా॥

5 యిష్టార్థంబులుజూపి బలుకష్టంబుల నెడబాపి-దృష్టికావలను
దృష్టవునీవై స్వష్టపరచెదవో సృష్టివిధానము ॥దయా॥

6 క్షితిపై దరియాగురుడై సద్గతిదెల్పెడు పురహరుడై-అతులి
తవా నీసదమలరూపము మతిలో ఖాళీం మరిమరిదలచును
॥దయా॥

## 11. తత్వము

( భూపాళ రాగం - మేలుకొలుపుసరళి )

1 నిన్ను నీవెరుగవే జీవా నీతిమానియుదిరిగెదావా - భిన్న
మైనమార్గములను యెన్నబోక వేజీవానిన్నుగనగదవే॥జీవా

2 అంతటా నీవైతివనియు అఖిలలోకములేకమనియు - చింత
మాని నిరంతరము గురుసేవజేయుగదే ॥జీవా॥

3 లోపలను వెలుపలనునీవె పాపలందున పరముగనవే - తాప
సోత్తము లెల్లగాంచెడు డారియదెగనవే ॥జీవా॥

4 నాలకుని యాధారమునకు దీటులేకను దిరుగనొవును -
బూటకంబీజగమటంచును తేటదెలియగదే ॥జీవా॥

5 స్వచ్ఛమైయున్నట్టి మార్గము హెచ్చుతగ్గులులేవననుము -
ముచ్చమైసకలార్థములకును మూలమిదెగనవే ॥జీవా॥

6 అంతరాంతరమైనదాని ఆదిదెలియగ మదినిబూని-చింతలేని
దాని నీవు శాశ్వితంబనవే ॥జీవా॥

7 ఆరుకమలములనుమీరి వేరుగాకను వెలుగుచున్న - తీరు
నీవని తెలిసి గురుని జేరి వీడవే ॥జీవా

8 కూటమై ము వ్యోటినడుమను బాటచూచిన వారుగను
గొను-చోటుబాయక నీలో నీవామాటుమరువక వే ॥జీవా॥

9 ఆపదోద్ధారకుడుదరియా దీపకుండను తెరవుదెలియ - పాప
మెడబాయుటకు ఖాళీందా పుయిదెనవే ॥జీవా॥

## 12. తత్వము

( ఆటతాళము - ఆనందభైరవి )

1 శ్రీగురుపదసేవాజేయువారల భవము శీఘ్రింబె తొలగి
చనును నిగమార్థసంచారము చేకూరును సుగతినిగూర్చ
యోగముసిద్ధించును రాగాదివిషయ విరాగమై సర్వాత్మలో
గలియుదువు నీకేలోపంబు లేదెందు భోగభాగ్యము లతుకు
లని నీవా సత్యానందమునసద్భాగవతులనుజేరి యిహపర
త్యాగివై మెలగినను మేలౌ ॥శ్రీగురు॥

2 కాయమందున గురుని గనజాలకున్నను బాయదెన్నఁడు యీ
మాయా దుఃఖముల బడద్రోయుచు నిజమాయ ఆర్యుల
కృపచే పోయి దెలియు విధాయ ఆయువతిస్వల్పమని ఆలో
చింపక వట్టిహేయమా ఘనులందు వెతలలోబడి మునిగి
ధ్యేయమగు పరమాత్మ నెప్పుడు తెలియబడదని యూహచే
గురురాయ కరుణకు పాత్రుడై తనగురుతు మరువక యున్న
జయమా ||శ్రీగురు||

3 తులలేని పరసౌఖ్యముల దేలుచును బుధులు అలసకేమియు
గానరా యిలలో చాలబలవంతులై మెలగేరు భ్రాంతిని
వీడి కలవరములు మానేరు తొలిజన్మ సుకృతమున దోచు
నిరువ వేద్యగలసీ మరువక దలచగల భావమమరిన తెలివియే
దేవత్వమని మును తెలియపరచిన గురునివాక్యము తలపు
నను ధ్యానించువారలె ధన్యులై ధర్మాత్ములౌదురు
||శ్రీగురు||

4 నాదినీదనియేటి వాదులన్నియు మాని భేదమేమియు లేకను
సకలము తానై మోదమందుచు భువిలోను సతతము మాయ
పాడు దెలసియు మెలగుచును మేధావులై బ్రహ్మబోధ
యేమరకను శోధనజేయు నిక బాధలేమియు రావు ఆది
అంత్యము లేని పూర్ణనిధాను నిత్యప్రకాశు శాశ్వతు నాదు
బిందు కళావిశేషు ప్రధాను గొల్వ శుభప్రదంబౌ||శ్రీగురు||

5 దాసపోషణుడౌ శ్రీదేశికుదరియా ప్రభు వేసటలేక మదిలో
దలచినవారే దోషరహితు నిసన్నిధిలో దలచెదర తిసంతోష

ముగ తనలోభాసిల్లు బ్రహ్మాత్మపదేశమునను ఖాశీందాసు సంశయము మెల్లబాసి పోవుటనిజమా వాసనత్రియములను వీడి ప్రకాశమా పరమాత్మసేవ నిరాశులై జెందినను పరమోల్లాసమా పరతత్వమబ్బును ॥శ్రీగురు॥

## 13. తత్వము

( ఆటతాళము - శుద్ధకాంబోజి రాగం )

1 నిన్ను మదిలో సన్నుతింతునయా ఓసన్నుతాంగా నన్ను నీదరిజేర్చబ్రోవుమయా-మున్నుభక్తుల యఘములన్నియు నున్న జేసిన సుప్రసన్నా యన్నటికి నీవనుచు నిన్నేయన్ను చుంటిని కన్నతండ్రి ॥నిన్ను॥

2 అంతరాత్ముడవనుచు మదిలోనా గనునట్టివారికి చింతలేమి యుజేరరావనిన - మంతనంబులువినియు నాహృదయాంత రంగమునందునిన్నే కాంతమున భజియింతు భవహార సంత రహిత భక్తవరదా ॥నిన్ను॥

3 ఘట్టిగా నినుగొలుచువారలను కడతేర్చనీవె పట్టుగలిగిన ప్రభుడవనియిలను-గుట్టుదెలిసి స్మరించువారల కోర్కెలెల్ల యొసంగియును యేతట్టుజూచిన నీవెగా గనునట్టివారలు స్పష్టపరచిన ॥నిన్ను॥

4 సూక్ష్మమైయున్నట్టి నినుగనుటా ధరలోన నిజమై మునులను గననౌను యీ బాటా-రక్షగాను శిక్షితుడనౌ మును మోక్షకాముకులైనవారలు దీక్షచేనినుజేరి సర్వాపేక్షలను విడనాడిరని నే ॥నిన్ను॥

ముగ తనలోభాసిల్లు బ్రహ్మాత్మపదేశమునను ఖాళీందాసు సంశయము మెల్లబాసి పోవుటనిజమహా వాసనత్రయములను వీడి ప్రకాశమహా పరమాత్మసేవ నిరాశులై జెందినను పర మోల్లాసమహా పరతత్వమబ్బును ॥శ్రీగురు॥

## 13. తత్వము

(ఆదితాళము - శుద్ధకాంబోజి రాగం)

1 నిన్ను మదిలో సన్నుతింతునయా ఓసన్నుతాంగా నన్ను నీదరి జేర్చబ్రోవుమయా-మున్ను భక్తుల యఘములన్నియు నున్న జేసిన సుప్రసన్నా యన్నటికి నీవనుచు నిన్నేయన్న చుంటిని కన్నతండ్రి ॥నిన్ను॥

2 అంతరాత్ముడవనుచు మదిలోనా గనునట్టివారికి చింతలేమి యుజేరరావనిన - మంతనంబులువినియు నాహృదయాంత రంగమునందు నిన్నేకాంతమున భజియింతు భవహార సంత రహిత భక్తవరదా ॥నిన్ను॥

3 ఘట్టిగా నినుగొలుచువారలను కడతేర్చనీవె పట్టుగలిగిన ప్రభుడవనియులను-గుట్టుదెలిసి స్మరించువారల కోర్కెలెల్ల యొసంగియును యేరీట్టుజూచిన నీవెగా గనునట్టివారలు స్పష్టపరచిన ॥నిన్ను॥

4 సూక్ష్మమైయున్నట్టి నినుగనుటా ధరలోన నిజమై ముముక్షు లనుగననౌను యీ బాటా-రక్షగాను శిక్షితుడనౌచును మోక్షకాముకులైనవారలు దీక్షచేనినుజేరి సర్వాపేక్షలను విడనాడిరని నే ॥నిన్ను॥

తెల్పియు దయతో మేటిశిఖరమునను వెలింగెడు నాటకుడు
తానౌచు ముక్తి కవాటమిది శోధించుమనియును చాటి
శాశ్వత మెరుకపరచెడు ॥గురు॥

3 కనులపండువును తనలోగాంచు ఘనసంపదలను పసిబూని
వివరింప పరిశుద్ధమూర్తియై జనన మరణములేని జాడ
దెల్పియు దయతో వెనుకముందెరుగకను దేశికు అనయ
మును సేవించువారల మనమున సర్వాత్మసదనముగనుట
కిదియే త్రోవయనియును ॥గురు॥

4 విపులమైయున్నా త్రిపుటిని గలవ నుపమెరుగకున్న చప
లత్వమని కృపతో యపరోక్షమును దెల్పి విపరీతములు
గాని నిపుణత్వమున నిలిపి కపటరహితంబైన కేవలు గలియ
జూపి నిరంతరంబును తప మొనర్చుచు సుజనులందరి నెపము
నెన్నక నేలు దొరయని ॥గురు॥

5 వాసిగ దరియాగురు దేవుడె యీశుడౌ నరయ మోస
మెన్నడులేక ముజ్జగముల పరవాసుడై యున్న జగదీశు
సన్నిధి జేర్చ వేసటేమియులేక భక్తుల గాసిదీర్చెడు కార
ణుండై యాశజెందిన ఖాళీందాసుని క్లేశములు విదళించు
విభుడని ॥గురు॥

## 15 తత్వము

(నాదనామక్రియ — ఆదితాళము)

1 పరమాత్మానినుభజనజేయగలపద్ధతిలోనను నిలుపుమయా—
వరదుడవని మును ఘనులన వినినే శరణుజేతు కరుణింపు
మయా ॥పర॥

2 వేసటగలిగిన దాసులబ్రోచెడు నీసమానులెవరుండురయా— దోసిలొగ్గి నేనాశజెందితిని గాసిపెట్టకను గావుమయా ॥పర॥

3 ధన్యునిజేసెదవని నీపదములు తలదాల్చెద దయయుంచుమయా— అన్యుడనని నను జూచిన భువిలో నా పొత్తెవ్వరిక గనరాదో ॥పర॥

4 నిలకడగలిగియు నినుసేవించెడు నీతిమార్గమున నిలుపుమయా - తలలోనైనను నీదుయాజ్ఞగను కాలముగడుప గాపాడుమయా ॥పర॥

5 హాయిగలిగిఆయాసమిడువ నీసాయమున్ననికజాలునయా— కాయమువదలెడు కాలమునను నినుబాయని మార్గము జూపుమయా ॥పర॥

6 అందమైన నీ కథలనువిని యానందించుట నాకాసగుమయా - మందమతితో యిహాపొందుగోరి బహు సందడిలోబడి యుంటినయా ॥పర॥

7 మోక్షాపేక్ష జనించినవారికి రక్షకుడవు నీవుందువయా - దీక్షాపరులాపేక్షచె నినుగని లక్షణయుతులై యుందురయా ॥పర॥

8 దరియాగురువరు చరణములబ్బిన పరమపదమునకు బాటయ్యా—మరుగుజేరి స్తుతియించెదు తంగెళ దరిజేరుటకిది దాపయ్యా ॥పర॥

## 16. తత్వము

( నాదనామక్రియ - ఆదితాళము )

1 ఎప్పటికి నొకరీతి తప్పక నినుదలచు గొప్పపనినుంచుమో రామా - ఒప్పైన నీకథలు యోపికతో గొల్వ ముప్పు రాదనివింటి రామా ॥ఎప్పటికి॥

2 తెలివిహీనతతోడ బలుపాపములు జేసి మెలగితినికొన్నాళ్ళు రామా - వెలలేనినీ నామ మలసటలు బాపునని బలుక భయమొదవె నో రామా ॥ఎప్పటికి॥

3 తల్లిదండ్రివి దాత దయజూపగలవనియు యుల్లమున నమ్మితిని రామా - ఎల్లసమయముల నిను వేడుకతో సేవింప వల్లజూపి యుబ్రోవుమో రామా ॥ఎప్పటికి॥

4 సర్వభూతములతో సమముగానినుజూచు సామర్థ్యమొసగుమో రామా - దుర్వివాదంబులను దునిమి నీకృపజూప సర్వోత్తముడవీవే రామా ॥ఎప్పటికి॥

5 వింతవింతలుగాను వివిధరూపముల నీఅంతుదెలియగబడదు రామా - శాంతమున నిను బుధులు అంతరాత్మగజూచి సంతసము జెందెదరు రామా ॥ఎప్పటికి॥

6 సూక్ష్మదృష్టిచె నిన్ను వీక్షించు జనులకును మోక్షమర చేతిదో రామా - పక్షపాతములేని సాక్షివై వెలుగు ఘన నిక్షేపమైతివో రామా ॥ఎప్పటికి॥

7 సూత్రధారివిగాను గాత్రములనాడింప క్షేత్రజ్ఞుడవు నీవే
శ్రీరామా - శ్రోత్రములకింపుగా శాస్త్రములు మిము దెల్ప
పాత్రులై వెదకిరిటు రామా ॥ఎప్పటికి॥

8 గురువరుని కరుణచే గుర్తెరిగి మిము జేర గుణవంతులై రిభువి
రామా - తరియించుటను తన్ను దర్శింపకను వేరు తెర వేమి
గలదు శ్రీరామా ॥ఎప్పటికి॥

9 దయజూపి బ్రోచుటకై దైవమైతనువులో దాగియున్నావిల్లు
రామా - భయమెల్ల విడుటకీ ప్రాపుదొరకినగదా నయ
మని బుధులనుట రామా ॥ఎప్పటికి॥

10 వసుధలోదరియాంహసుస్నేహా గురురూపమైవచ్చితివి మము
బ్రోవ రామా - వశమె తంగెళదాసు వర్ణింప నీమహిమ
అసమానసువిలాస రామా ॥ఎప్పటికి॥

## 17 తత్వము

(శుద్ధకాంభోజి రాగము - ఆటతాళము)

1 శ్రీగురుదేవా చింతలు దీర్చ నాగతిగావా నమ్మితిబ్రోవ
॥శ్రీగురు॥

2 అవ్యయరూపా అఖిలము దెల్పా సవ్యప్రలాపాసత్యసంకల్పా
॥శ్రీగురు॥

3 అన్నియు నీవేయాధారుడవే సన్నుతిగొనవె సాక్షివిగావె
నిర్మలచరితనిగమాతీతా ధర్మసంభరితా విఘాంతా॥శ్రీ॥

4 త్రిగుణ వికారా అగణితధీరా జగదాధారా యగుణా చారా - సనుపోషా దరియాహుస్నేషా భూషితభూష పుణ్యావిశేషా ॥శ్రీగురు॥
5 తంగెళవరదా దయయిటులేదా మంగళమేగదా మహిని సుబోధ ॥శ్రీగురు॥

## 18 తత్వము
(శంకరాభరణము - ఏకతాళము)

1 ఎందుకూడదయగాదు పంతమా పరమాత్మ నన్ను బంధము లలో ద్రోయన్యాయమా- మందమతిని జమడ నాదు సంది యములుబాపి సర్వానందమా నీ రూపమేదో యిందెజూప వేడుకుంటి ॥యెందు॥

2 అండజేరి దలచువారాల దయజూపిబ్రోవ దండివారలెవ్వరీ యిల-దుండగములు దలచబోక నిండుకృపచే నిన్ను జేరి యుండుమార్గమొదలి నన్ను ఖండితముగా నీలోగలుపు ॥యెందు॥

3 ఆపదోద్ధారకుడవందురు నీదరికిజేరి తాపములను బాపు కొందురు-కోపమేమిలేక సకల తాపములను దీర్చుసుజన దీపకుడవటంచు మదిలో తేపతేపకును దలంతు ॥యెందు॥

4 తెలివిగలిగియున్న యప్పుడె నీపదములరసి గలియనెంచ కున్న ముప్పదే - సులభముగ నిను దెలియా వలన

నున్నవారు మలినయుతులునోచు విషయు కలవరములలో
గాఁ)లి చెడరె ॥యెందు॥

5 ధరనుదరియా గురుడవైతివి పరమార్థమునకు తెరవుదెలుప
దేవుడైతివి-తరుగులేనిపరమసుఖముయిరువుదెలియుటకును
భాశీంమరువులేకను నిన్ను వేడ కరుణజూడ రావదేమి॥యెందు॥

## 19, తత్త్వము

(నాదనామక్రియ - ఆటతాళము)

1 దరియాహుస్సేనుషా గురుదేవా మమ్ముదరిజేర్చి పోషింప
దైవమేగావా-దురితములుదీర్చ నీసేవా పరలోకమున
కేగు భావమబ్బినవారు వెరవులేకను నిన్ను స్మరియించిరని
వింటు ॥దరియా॥

2 లోకములను మన్నింప నీవే భువిలో సాకారరూపివై జను
దెంచినావే-నీకు సమమైన గలవే భువిలో రాకపోకలు
లేని యేక దేశంబున వరాకులేకను జగము జోకతో
గందువట ॥దరియా॥

3 నిర్మలంబౌ మనసుగలిగి సర్వధర్మంబులను దెలియు సాధ
నము నెరిగి - కర్మబంధములకు దొలగి మర్మమేమియు లేని
మానవులబోధింప నిర్మోహమునసీవునిలచియుండెదవయ్యా
॥దరియా॥

4 అర్థవాదములచేగాదునీదుసార్థకంబౌవాక్యసరణిగనుపాదు-
శుద్ధత్వమైయున్నగలదూ శద్దులేదని బలుకువ్యర్థులకుగన
రాక హద్దుగలిగిన వారికాత్మార్థమును దెలుప ॥దరియా॥

5 నీ వెదిక్కను గొలుచువారూ కుటిలభావము రానీక భక్తి
లయ్యెదరూ-కోవిదులగొలచు చుండెదరూ దేవదేవుడ
వనుచు దెలియగలిగినవాడౌ కేవలాత్మానుభవ కీర్తనము
సేయుదురు ॥దరియా॥

6 తొలిజన్మ ఫలమున్న గలుగూ - తన తెలివిలో తెలి
వియగా దివ్యమగా మరుగూ - తులువలకుగనరాని తెరగూ
కలవరింతలలోన గలయుకను ఖాళీము మలినమెల్లనుబోవ
మనసుతో ధ్యానించె ॥దరియా॥

## 20. తత్వము

(నాదనామక్రియ — ఆదితాళము)

1 హేయంబౌ విషయముల జొరక గురురాయుని పదములు
గను మనసా-కాయములో పరమాత్ముని గలసిన హాయి
గలుగునే ఓమనసా ॥హేయం॥

2 ఇహమ్మైయున్న మహాత్ముని ధ్యానమె సోమ్మైయున్నది
ఓమనసా - క్రిమ్ముకయున్న యీమాయా భ్రాంతిని
కడకు ద్రోయవే ఓమనసా ॥హేయం॥

3 గొప్పకొద్దియని వీలుగాని శ్రీహాప్పతిదలుచవె ఓమనసా-
యిష్టదైవమని ద్రష్టనుదెలిసియు స్వష్టపరచగదె ఓమనసా
॥హేయం॥

4 చప్పిడిమాటల దెలియరానిదని సాధించగదే ఓమనసా -
సృష్టిలో మానవజన్మంబునకిది కష్టములేనిదె ఓమనసా.
॥హేయం॥

5 యీడపింగళను గూడివచించిన జాడదెలియవే ఓమనసా-
ఆడుచున్న సురకామినిగలసియు క్రీడసలుపవే ఓమనసా.
॥హేయం॥

6 దీక్షచే గురుపదలక్ష్యమునిలిపిన రక్షణమానది ఓమనసా-
పక్షపాతములు లేనిజగద్విభు సాక్షిగజేయవే ఓమనసా.
॥హేయం॥

7 పట్టువీడకను పరమాత్మునిగన పాలనజేయవే ఓమనసా-
ఘట్టిగనీవీ గుట్టునెరింగియు దృష్టి నిలుపవే ఓమనసా.
॥హేయం॥

8 పావనమాందరియాగురుసేవయే నీకు జీవనమానే ఓమనసా-
భావములోపల భాశీందాసు గురుభజనజేయునే ఓమనసా
॥హేయం॥

## 21 తత్వము

(మధ్యమావతిరాగము - ఆటతాళము)

1 ఎంతదయలేదు గురుదేవా మాచింతలెల్లను దీర్పరావా
సుంతైన నీకృపలేదా-యింతకఠినముబూన సంతసంబా నీవు
సాక్షివైజూచుటకు ॥ఎంత॥

2 నీవున్నభయమేమటంటీవ భావంబులోమరువకుంటి యేవేళ
కేమౌనో యెరుగా శక్యముగాదు - తోవలో ననునిల్పి
తొట్రుపడజేయుటను ॥ఎంత॥

3 ఆపదోద్ధారకుడవనుచునిన్ను తేపతేపకుమదినిదలచు-నాపైని
కరుణించి నన్నేల రాకున్న దాపుజేర్చుటకునూ తగువార
లెవ్వరిటు ॥ఎంత॥

4 కులదీపకులు వేరే గలరా నీవె గలవనుచు బుధులెన్ను
కొనరా - బలమైన నీఘనము ప్రార్థించు వారలకు
కలవంటి సంసార కర్మమిడునని వింటి ॥ఎంత॥

5 చిక్కులన్నియు బాప నీవె మాకుదిక్కైతివని వేడ వినవే
ఎక్కువైనానిన్ను - మక్కువతోదలచ నీవ్రక్క జేర్చియు
నన్ను పాలింపగ రావె ॥ఎంత॥

6 బంధములు విడిపోవుకొరకు నీదు పొందు గోరినమమ్ము
లిడకూ-యెందుజూచిన నీవె ఏకమైయుందువని ముందు
వెనుకరయకను మొక్కిగొల్తును నిన్ను ॥ఎంత॥

7 తప్పులన్నియు బాపరావె యెంతో గొప్పవాడవునీవుకావె-
యెప్పుడో దయయుంచి ముప్పు దీర్చుటగాదు యిప్పుడే
మమ్మేలు తప్పదిక తడవేల ॥ఎంత॥

8 దరియా హుస్సేన్‌షా గురుస్మరణ ఖాశీం తరింపజేయు
సత్కరుణ - వెరపేమియును లేదు విస్మయంబదిగాదు
పరమార్థమని బుధులు పలుక విని నమ్మితిని ॥ఎంత॥

## 22. తత్వము

(శహన రాగము - ఆటతాళము)

1 గురుని పాదము లాశ్రయింపగదే ఓమనస పరమగురుని
కన్నను ధనము లేదనవే - గురుని పాదము లాశ్రయింపక

తెరువులేదని మరువబోకుము - తరుణమిది వ్యర్థంబుజేసిన
నరకబాధలు దొలగు దేశిక-స్మరణ వేమరకున్న జాలుగదే
పరమార్థసంపద బడయ గలుగుదురనుచు యున విన వే-
దురితజాలము దొలగుమార్గము నరయుకను భువిలోన దిరి
గిన చరణబాధయె గానిపరమును నెరగజోరని తెలిసినీలో
||గురుని||

2 అంతరాత్మను దెలియసుఖమౌను-గురుకరుణలేకను యెంత
వారలు గాంచిరీధరను-అంతులేనటువంటిమాయా చింతల
లోజొర ఫలములేదిక - స్వాంతమున సర్వాత్మ గొలచి
నిరంతరము భజియింపుచుండుము-మంతనములలో జేరఫల
మట వే-యేకాంతమున భవమంత మొందె విధము దెలియ
గదే-వింతవింతల భ్రాంతిపీడి రవంతవిసువక ఆత్మసుఖమున
సంతసింపుచు నుంటివా-విశ్రాంతియాయిది విడువకెవ్వాడు
||గురుని||

3 దొంగలార్గురు భంగపరచెదరు - మహనీయులెపుడీ సంగ
తెరిగి మెలంగు మనియెదరు - అంగములో పరమాత్మ
జూచుచు లింగభంగ మొసంగువారలు - మంగళప్రదులై
యశాశ్వత సంగమును గనబోరు భువిలో - యింగితుల
కీవిధము దెలియుగదా-అవివేకమైన ప్రసంగములతో నెరగ
రాదుగదా-నింగిపోలిక నిర్మలంబై భంగమేమిగాక నార్యుల
సంగమును విడనాడకున్న నెరుంగగలరాత్మార్థ మెల్లను
||గురుని||

4 అర్ధమెరుగని చదువు చదివినను -నిరర్ధకంబౌ సార్ధకంబేమి
యును లేకెలను-స్వార్ధవాంఛలు వీడియును పరమార్ధమును
గనుటెరిగి నీలో-శుద్ధమై వెలుగొందు ఆత్మను హద్దుగా
నిలుపంగ మేలౌ-బుద్ధిమంతులు దెలియజాలరు-నిగమార్ధ
సంగతి బద్ధులెటు దెలియంగ బడబోరు - గార్ధభమువలె
సంశయముల సమర్ధులై దిరిగేటివారికి - శుద్ధమౌ నిజతత్వ
మబ్బక మొద్దులై చెడిపోదురీభువి ॥గురు॥

5 అండబాయని దైవమై భువిని - వెలుగొందు నిర్మల దండి
ప్రభువౌ దరియగురువరుని - మొండివాదము లెల్లవీడి
యఖండమౌ నిజతత్వమరసియు- నిందు ప్రేమచె గొలుచు
చుండెడు-పండితుల భావంబులోపల వెలుగు మహాత్ముడన
యనవే-సద్గురుని కంటెను యొండు లేదని దాఢమిడుగదవే-
ఖండితముగను పరమపురుషులు గాంచగల సౌభాగ్యమున
నీవుండివిడువక మాయాభ్రాంతిని చెండితివ ఖాశీం సుఖంబని
॥గురు॥

## 23. తత్వము

(కన్నడ రాగము - ఆదితాళము)

1 ప్రభువా నీదివ్యరూపు భాగ్యమైనదీ త్రిభువనములకు మహా
తేజమైనదీ - శుభములెల్ల గలసియున్న సూత్రమెరుకా
పరచా నీవై-అభయమిచ్చి భక్తజనుల నాదరింప బ్రోచు
చున్న. ॥ప్రభు॥

2 యెల్లలోకములకు నీవే యేకమై యున్నావటంచు - యెల్ల
మున నిన్ను దెలియ వల్లపడునె యెల్లవారికి. ॥ప్రభు॥

3 కప్పియున్న మాయ తెరను విప్ప నెవ్వరి తరముగాదు -
గొప్పవాడవైన నీకేతప్ప నితరుల కలవి యౌనె ॥ప్రభు॥

4 పట్టిమాటలచే నీదు వైభమెరుగ వశముగాదు-పట్టగలిగి
హృదయములో గట్టివరుపకున్నగాదు ॥ప్రభు॥

5 నీలతోయదమునందు నిలచియున్న వారు కళలు - పాలు
మాలి యున్న వారికి భావముల కందపడవు ॥ప్రభు॥

6 వాసిగా దరియాహుస్సేన్షా దేశికుని కృప లేకున్న-మోస
మానుగాని ఖాశీం దాసుదెలియ వశమె నిన్ను ॥ప్రభు॥

## 24. తత్వము

(కళ్యాణి రాగము - ఆదితాళము)

1 యిందేగనుగొనవే పరసుఖమున్నా దిందేగనుగొనవే -
యిందే గనుగొనవలెను ముందరగతిజూచి అంధాకారము
లోన మందామతివి గాక ॥యిందే॥

2 మాటాలగాదూ మదినిల్పిన బాటయా మీదు-బూటాక
ములచేత పూటాలుగడపిన తేటైనమార్గాము తెలియ
బడవునీవు ॥యిందే॥

3 అతిశాయాములనుబట్టియు త్రుంప మతిమంతు వాడవును-
సతమౌనె దేహాసంపదలెల్ల క్షితిలోన హాతమై పొయ్యేటి
వేళ్ళ యారాటపడనేల ॥యిందే॥

4 తెలిసి తెలియకనూ చేసినపాపము నిలిపి నిశ్చలమొంది సర్విచారముతోడ ॥యిందే॥

5 దాసూల బ్రోవ దరియాగురుడై చూపె నీతో ౹వ- వేసాలే మియములేదు వెరువాకపరమాత్మ్మ నాశించివిడువాక నందె నిత్యమనిఖాశీం ॥యిందే॥

## 25. తత్త్వము

(కళ్యాణి రాగము - ఆదితాళము)

1 అదిగో మనకు గురునీ కరుణ అందీచూడారె - సదమా లాత్ములైన వారి జాడాగనుగొనరే ॥అది॥

2 వేదవేద్యమైన దాని వివరమెరుగారే - సాధానాల కందని మంచి బోధా దెలియరే ॥అది॥

3 పాలభాగ మందు గురుని యాలలుబాడరే- తాలిమిగలిగిన వారి దారిదియనరే ॥అది॥

4 లింగాభంగమైయున్న సంగా తెరుగరే - మంగాళప్రదమైన దాని మరువకుండరే ॥అది॥

5 తలుపూలుడిగేచోటా మీారు నిలచియుండరే - మెలుకువ గలిగిన వారిమేలే యిది వినరే ॥అది॥

6 కద్దూలేదని యనకను మీారీ పద్దుబూనారే - సద్భావను లెల్లదీరి సమరసులయ్యేదరే ॥అది॥

7 యెల్లాలోకముల కిదియే యేకమానరే - మళ్ళీరాని మార్గామనుచు మనసునుంచారే ॥అది॥

8 దేశిక ప్రభుడైన దరియా దేవుని కృపగనరే - మోసా మేమిలేదని ఖాశీం ఆసించిన దనరే ॥అది॥

## 26 తత్వము

(శంకరాభరణము - త్రిపుటతాళము)

1 చేరువనున్నదిరా పరసుఖ మూంతక దిరుగకురా - కారణ గురువరు కరుణగలిగి యేదారినజేరిన ధీరులకెల్లను ॥చేరు॥

2 కపట మిడువవలెరా తనలో వుపము దెలియువలెరా - విపరీతంబుల నేగక నెప్పుడు అపరోక్షులునా యనుభవపరులకు ॥చేరు॥

3 భక్తిచెగన్నదిరా యిదియె విరక్తుల కైనదిరా - శక్తి సహితమా శాశ్వితసౌఖ్యము - ముక్తిరూపమై ముజ్జగములకును ॥చేరు॥

4 వేసటలేనిదిరా సర్వ ప్రకాశమైన దిదెరా - భాసితమై బ్రహ్మాదులహృదయ నివాసంబై యే మోసములేనిది ॥చేరు॥

5 సత్యంబైనదిరా సరసుల సన్నిధినున్నదిరా - ప్రత్యక్షంబై వరగుచునంతట ప్రత్యగాత్మగా బ్రబలుచున్నది ॥చేరు॥

6 శబ్ధరహితమిదెరా పరమై జననములేనిదిరా - అబ్ధంబులు భువి దిరిగినదొరుకదు-ఉబ్ధవడును తమలక్షణములచే॥చేరు॥

7 లక్షణమైనదిరా మరియొక పక్షముకానిదిరా-అక్షయమని తమ రక్షణవెదకిన దీక్షాపరులకు మోక్షరూపమై ॥చేరు॥

8 దేశికుడగు దరియా గురుడై దెలుప దెలియునదిరా- ఆసిం
చిన యీ ఖాశీందాసుని గాసిదీర్చుటకు కారణమైనది
॥చేరు॥

## 27. తత్వము

(నాదనామక్రియ. మిశ్రగతి)

1 మేలైన యీమందు గొనరే చాల మెళుకువో వారు యిది
దినరే - తాలిమిచె దొంగలను తరిమివేసేమందు కాల
కాలమునాటి ఖర్మలన్నియుదీర్చు ॥మేలైన॥

2 సత్యమను పత్యంబుచేత దీని సాధించవలెను మీచేత-
వ్యత్యస్తమైతెను వెరుకపడదీవ్యాధి అత్యాశలను బట్టి
యావలకు దోసియును ॥మేలైన॥

3 యిహచింతలెల్లవిడిపోవా మిగుల సహజమైయున్నదిసేవా-
అహమాదివృత్తులను అణచివేయును దీని స్పృహ గలిగి
భుజియింప సుఖమిచ్చునందరికి ॥మేలైన॥

4 అనుమాన మేమిలేదనిరీ యిట్లు ఆచరించినవారు గనిరీ -
వినయ భయభక్తులను అనుపానమును దిన్న ఘనమైన
వ్యాధులను క్రమముగాదొలగించు ॥మేలైన॥

5 సంచితంబను రోగమునకు నిదియె మంచి యౌషధమాయె
మనకు-వంచనేమియులేదు వైభవంబదియాను లంచమే
మివ్వకను లభియించు మనకిపుడు ॥మేలైన॥

6 దేశిక ప్రభుడైనదరియాగురుడే దేశమునకిది దెచ్చెనరయా- ఆసించి ఖాశీమః దాసు ఎల్లప్పుడు భూషితంబని దీనిపూజించి తినుచున్న ॥మేలైన॥

## 28. తత్వము

(బూపాళము - ఆదితాళము)

1 పరంధామ నీభజన జేయ మము పాలించుటకిటురావా - నిరంజనుడవై నిఖిలలోకములు నిర్మింపను నీవే గావా ॥పరం॥

2 చరాచరంబుల భరింపనీవే పరాత్పరుడవై యుందువు - విరామమున నీస్వరూపమెరిగిన ధరాధరులగనుచుందువు ॥పరం॥

3 వియత్పవన మగ్నియు జల భూముల నయంబుగను గల్పింతువు - వ్యయంబుగాక స్వయంభవుడవై లయింపనూ నీవుందువు ॥పరం॥

4 సదా నీస్మరణ సుధగ్రోలియును విధానమున బుధులుందురు - యదార్థమౌ నీ కథల్ గ్రోలియును విధానమున బుధులుందురు ॥పరం॥

5 భవాంబుధిని దాటించునావ నీ స్తవంబని వినుతింతురా - భువిన్ నీదయ యెవ్వలవంబున్న యే యుగాంతరములను జేరరు ॥పరం॥

6 గతిగాంచు సద్ వ్రతా వలంబుల జతగూడినీవుందువు-
సతీసుతాదులు సతంబుగాదని హితంబునుపదేశింతువు
॥వర॥

7 పరాపరుడవై ప్రభలెను దరియా ప్రభుడవనుచు గొని
యాడెదగ-బిరాన ఖాశిం దాసునిబ్రోచే నిరాశ్రయుడవని
వేడెదగ ॥వర॥

## 29 తత్త్వము

(నాదనామక్రియ - ఆదితాళము)

1 అశరీరుడవై మృషయా జగమును వశపరచిన నినువర్ణిం
చుట - నా వశమా సద్గురు వాక్యముదెలియక అసమా
నుడవౌ ఆత్మస్వరూపా ॥అశ॥

2 దేహములో నిను దెలియువారలే మోహము లనుబడి
మోసపో రవని- సాహసులకెగద సర్వాంతరవా యూహ
గలిగి యీ దేహినరయుటలు ॥అశ॥

3 యీదండనకను బంధరహితమై యుందు వనుచు నిను
ముదముగ శృతులలో - బొందుపరచనవి విందుగలిగి
యాసంధిదెలసి యానందమొందుట ॥అశ॥

4 చూపులకందక దాపై వెలిగే ప్రాపక మబ్బిన పరమపురుషు
లకు - నీపై చింతమె నిలచునుగాకను వ్యాపకమున్నదె
యెప్పటికైనను ॥అశ॥

5 అన్నిటికిని నీవాధారుడవై యెన్నవలవి గాకున్న మహాత్మ-
తన్నే తాగనుచున్న వారలిటు భిన్నముగానక నిన్నే
గందురు ॥అశ॥

6 క్షితిలో దరియా గురువరు కరుణయె మతిమంతులు తమ మనసునసనుంతురు-సతమని భాశీంచాసు నిజాత్మను హిత వుగ గాంచుచు వెతకుట మరచెను ॥అశరీరుడవై॥

## 30. తత్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 సర్వజగదాధార నీతో సమమీభువిలోగలరా - నిర్వి చారులు నీఘనంబును యుర్విని ప్రకటింపగలిగిరి-పర్వ బారెడు నామనంబును పాలనము జేయుచు నిల్వవె ॥సర్వ॥

2 నిన్నుదలచనివారూ యిక నన్నిటికి చెడియెదరూ - భిన్న భిన్న మైనమాయా యెన్నటికి నమ్మరాదని-మన్ననాతో నిన్ను మదిని సన్నుతింతు జగదదీశ ॥సర్వ॥

3 తల్లి దండ్రియునీవేను దయతో నేలగరావే- యెల్లలోకము లను నిండి యేకమై వెలిగేదవని నా- యుల్లమూన నిన్ను నమ్మి కొల్లలూగ గొలుతుదేవా ॥సర్వ॥

4 దండివాడవుగావా నాపై దయనుజూవగదేవా - కొండపగి దిని నాదుయఘములు యుండుటలు గురుతెరిగినీవే - చెండి వేయుదువనుచు నే నీయండజేరితి యాదరింపవె ॥సర్వ॥

5 కాలమృత్యువు నాపై పడిగ కసరుచున్నది దాపై - కీలు బొమ్మల రీతి జగమున పాలుమాలుచు దిరుగ భయపడి- చాలగా నిను స్మరణజేయుచె మేలనుచు మదిదలతునయ్యా ॥సర్వ॥

6 పరమపావనమైనా గురుదరియా ప్రభుసన్నిధినా తెలిసిదే యని తెలుసికొలేం వెరపుసిడియు సినుజేరగ - కరుణ జూపిటు కావరావే పరమపురుషా భక్తవరదా ॥సర్వ॥

## 30. తత్వము

(నాదనామక్రియ - ఆదితాళము)

1 ఆనందమానందమైనది - భువిని యేనిందలునుజేరానిది - దేనందు మనసులేక దీనావనునిగలసి-ప్రాసింపవికువకున్న పుణ్యాత్ములకునెల్ల ॥ఆనంద॥

2 అన్నిటివిమిగిలి యున్నది-దీనిగన్నవారికెసుఖమైయున్నది- భిన్నమేమియుదోచకున్న సౌజ్ఞనుదెలసి - తన్నే తానెరుగు ప్రసన్నూలకెల్లాను ॥ఆనంద॥

3 పట్టిచూపుట కలవిగానిది - దీని గుట్టుగురునిచె దెలియునైనది - పట్టివాంఛలువీడి మొట్టమొదటికిజేరి - పట్టుపీడని పరమ పావనులకెల్లాను ॥ఆనంద॥

4 నామరూపములేమి గానిది - విషయమే మాత్రమున్ను దెలియరానిది - కామాదులనుజేరగల వాదములుమాని నీమంబుతో బ్రహ్మ నిష్టదెలిపెడువారి ॥ఆనంద॥

5 అన్యమేమియులేక యున్న - దీని ధన్యులౌవారిచెగన్నది- శూన్యమునుజేరక శుద్ధాత్ములై బుద్ధి - మాన్యులకు దెలియును మర్యాదగలిగిన ॥ఆనంద॥

## 33. తత్త్వము

(బేహాగ్ రాగము - మిశ్రగతి)

1 నీవేనీవాడవన్న నిర్మలంబైనా తావ్రాగన్న వారెల్ల ధన్యాంగోయన్నా - లావుసన్నములుగాని భావమువారి యున్నవారు - కేవలాత్మసదనమందే సావధానులయ్యే దారు ॥నీవే॥

2 చూపురూపు యేమైనా పాపుగన్నా వారలెప్పుడు - లోపమేమి లేక సర్వవ్యాపకులని గలయుదురన్న ॥నీవే॥

3 చట్టాలోపల వెలిగే గుట్టుదెలసియున్న ఘనులు - పట్టివాంఛలానుజొరక దిట్టలైయుండేదురన్నా ॥నీవే॥

4 అన్నిటా తానైనవిధము గన్న యితరమెరుగరాకా-భిన్నమేమిగాని సుప్రసన్నానందగలరోయన్న ॥నీవే॥

5 నాదానందమున పరము శోధానజేసిన విషయ- బాధలేమి గనక నిత్యమోదమందుదురన్న ॥నీవే॥

6 నాశికాగ్రమున దరియా దేశికునిగాంచుచున్న- మోసమేమియులేక ఖాశీం దోషరహితు గలయుదురన్నా ॥నీవే॥

## 34. తత్త్వము

(శంకరాభరణము - ఏకతాళము)

1 దివ్యమైయున్నదదీ సద్గురుకరుణ - దివసీశి యసరానిదీ సవ్యమై సర్వమై శాశ్వతానందమై-గర్వగ్రంథులుబాపు ఘనసారమైనది ॥దివ్య॥

2 చూపురూపులు గానిదీ-సద్గురుకరుణ తాపమేమియు లేనిది-
ఓపిక గలిగిన తాపసోత్తములకూ దీపకమగుచు నిర్లేపక
మైనది ॥దివ్య॥

3 శాంతి నిలయంబైనదీ-సద్గురుకరుణ అంతరాత్మగనున్నది-
వింత వింతలైన భ్రాంతీ యేమియు లేక - స్వాంతమందున
నెపుడు సంతోషమును గూర్చు ॥దివ్య॥

4 ఉదయాస్తములు గానిదీ - సద్గురు కరుణ పదిలామై బర
గునది - మొదలు తుదలనరాక మోక్షమార్గంబగుచు -
సదయాత్మలకు భువిని సర్వార్థములనొసగ ॥దివ్య॥

5 మగువపురుషులుగానిదీ-సద్గురుకరుణ అగుణమైయలరునదీ-
పగపులన్నియు మాన్పి వైభవమైయుండి సుగుణాత్మలకు
మిగుల సుఖరూపమొనరింప ॥దివ్య॥

6 వాదా భేదము లేనిదీ-సద్గురుకరుణ వేదావేద్యంబైనది -
నాది నీదనరాని - బోధారూపకమై యేబాధాలు లేకున్న
పరమార్థమన బరగి ॥దివ్య॥

7 నిండి నిర్మలమైనదీ - సద్గురు కరుణ దండివారలకైనదీ -
మండితమై దరియా మహనీయు పదములను ఖండితముగ
ఖాశిం గలియాజూచిన జాలు ॥దివ్య॥

## 85. తత్త్వము

(తోడిరాగము - ఏకతాళము)

1 భక్తులార యిటురండీ మన ముక్తి మార్గ మెరుకండీ -
భక్తులార యిటురండీ యుక్తమైనది దెనండీ - గురుసూక్తిని
మరువకనుండీ ॥ భక్తులార॥

2 పరుగు పరుగుననురండి పరమాత్మ భజన చేయుండి - యిరుకు తరుగులేదండీ విశ్వాసము వీడకనుండి ॥భక్తులార॥
3 తుద మొదలని యనరాని యాసదయుని సేవనుబూని - వదలకనుండియుదాని ఘనమై భవమెరుగునుజ్ఞాని ॥భక్తు॥
4 ఆత్మానాత్మను దెలసి అఖిలాత్ముని మదిలోగలసి-శత్రువు లందరిగెలసి దృఢ చిత్తముతో మదినిలచి ॥భక్తు॥
5 అంతరదృష్టి చెనిలచి యిహచింతలెల్ల బోనణచి - శాంతాకారుని గొలచి సర్వార్థమిదెయని దెలసి ॥భక్తు॥
6 సత్యవ్రతముగలవారు భువి నిత్యునిగనగలిగేరు - ప్రత్యగభిన్నునిజేరు పరిశుద్ధుల కిదియేతీరు ॥భక్తు॥
7 యితర వాంఛలనువీడి విశ్వేశ్వరుని గలియగగూడి-అతివినయంబున బాడి అభిమానమెల్ల దిగనాడి ॥భక్తు॥
8 మునుజనువారినిజూచి మన మురిపములను బోద్రోసి - తనువనిత్యమనిరోశి పరతత్వమె నిజమనియరశి ॥భక్తు॥
9 దరియా గురువరుసేవా నిజధర్మంబెరిగెడి త్రోవ - దురితములను బోద్రోవ గురుకరుణాన్వితునిగొలువ ॥భక్తు॥
10 ఖాశీందాసుగొలచె పరమేశుసన్నిధిదలచే-దాసునిమదిలో దలచె పరదైవమంతటను వెలసె ॥భక్తు॥

## 36, తత్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 జీవామా నీవెరో గానవా - భావింప నీవే దేవుడవని దెలియ జాలవా - చావుపుట్టువులేని నీదు తావుదెలియ

కన్న కలుష మాసరించి దుఃఖములకు ద్రోవయూ సంశ
యము లేదు ॥జీవామా॥

2 నిన్ను నీ వెరుగుట యె చాలును - యితరంబు గనక యున్న
సర్వసౌఖ్య మబ్బును-తన్ను దెలియ లేని వార లెన్ని శాస్త్ర
ములను జదువ భిన్న పడు టెగాక సుప్రసన్ను లౌ సంపన్న
లవుదు రె ॥జీవామా॥

3 దేహి నరయ లేని వారలు - సంసార తాపమోహములో
గలయుచుందురూ - సోహమను నెడు మర్మమేదో నూహ
జేసు జాలకెపుడు-సాహసమున తిరుగనహము ద్రోహిమై
భవములకునీదు ॥జీవామా॥

4 అంతరాత్మ జేరి సకలము పర - మాత్మయనుచు చింత
జేయు నదియె సుకరము - భ్రాంతిరహితమై సదాప్రశాంత
మైన మనసుచే యేకాంతు లైన వారలె విశ్రాంతులౌదు
రనుచు దెలసీ ॥జీవామా॥

5 ధరణిగోదరియాహను స్నేక గురు -చరణాబ్జములను శిరము
నందుదాల్చి ధీవరు - లరయు నిత్య పదవి నీలో మరువ
కున్న తరుగు లేని తెరవు గల్గు దెలియ మితర మురిపెములలో
జొరకు ఖాళీం ॥జీవామా॥

## 37. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 నీకుసములిలగలరె నిఖిలేశా - నిత్యప్రకాశా చేకొనవె
ననుకృపను సర్వేశా ॥నీకు॥

2 లోకత్రాణుడను నిన్నుదలచెదను - లోకమెరిగిన భక్తజనులను - సాకగల సర్వాత్ముడవు నీసదనమే సకలార్థమయమురా ||నీకు||

3 సాధుజన పోషకుడవనియంటి - సజ్జనులవంటి మోదమున విహరింతువనియంటి - బాధలన్నియు బాయుటకు నీ పాద సేవయే భాగ్యమని పెడవాదములను బోవకను నిను వాంఛతో భజియింతుతండ్రి ||నీకు||

4 ఆర్తులను దయజూచుమహనీయా - ఆనందనిలయా దాసుడను నను బ్రోవరావయ్యా - కీర్తిగల సర్వోత్తమా నీ కీర్తనంబే శ్రేయమని సద్వర్తనులు దెలుపంగనీవే భర్తవని భజియింతునశిశము ||నీకు||

5 వంతివరదుడవనుచు నినుగొలచి - ధర్మములనెంచి శాంతులై సజ్జనులు నినుదలచి - వింతవింతలు వీడినీకథ లంతరంగమునందునిడి యేకాంతులై సుజనాళిగూడుచు చింతలెల్లను వీడి వెలయరె ||నీకు||

6 ధరను దరియా హులశేషాళ్ళపగలిగి - దరిజేరిమెలగి దురితములుగని దూరమునదొలగి - పరమపద మార్గమునకిదియే తెరవటంచును తెలిసిఖాళీం మరువకను నీభజన జేయుటె మంచిదని మదినెంచగలిగెను ||నీకు||

## ౨౮. తత్త్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 ఎంతరమ్యముగను వెలుగును—దేశికునికరుణ — చింతలెల్ల దీర్పగలుగును—భ్రాంతిరహితమైనవారి యంతరంగమునను నిలచి — వింతవింతలైన మాయా నంతమొందజేయునహము ॥ఎంత॥

2 మండలత్రయములకు మీరియు — మహనీయమవుచు—దండి వారి దాపుజేర్చియు— అండదండమవుచుజగము నిండి నిరుప మానమై యజాండకోటి ప్రభల వెలుగుచుండి నిర్మలాత్మ యైన ॥ఎంత॥

3 అందమై యానందమవుచును — హృదయమునందుండి—మంద మతుల కందరాకను — బంధములకుమిగిలి యూర్ధ్వ మందె నిలచి భాగవతుల సందియములు బాపసుఖము నందజేయు మందిరంబు ॥ఎంత॥

4 లోకములకు మిగిలియున్నది— సర్వార్థములకు — ఏకమవుచు వెలయుచున్నది — శోకమోహములును లేక సాకగలుగు శాశ్వతంబు రాకపోకలులేని సత్యలోకమున లోపములు లేనిది ॥ఎంత॥

5 దృష్టికావల ద్రిష్టయైనాదీ — పరమార్థమిదియే—స్పష్టపరచ వలవిగానిదీ — అష్టకమలములకు వెలిని వృష్టిదోచకున్న వారికిష్టదైవా దయను మతమునభీష్టములకు జేయుమార్గ ॥ఎంత॥

6 క్షితిని కుందురువారిపురిమునను-గతిదెల్పునదెయూ- ఘనుని
కరుణ బడయగోరిన- వెతలు లేకటంచు భాసించు మతినినమ్మి
యాత్మతత్వ హితవుగలిగి వేదవేద్యు నెఱికి తెలియు విమల
మదియే ॥ఎంత॥

## 39 తత్త్వము

(భూపాళ రాగము - ఆదితాళము)

1 లుచ్చా నీకెంత జెప్పినను తుచ్ఛపుపనులవి మానవు ఛీ ఛీ
॥లుచ్చా॥

2 హెచ్చుతగ్గోవుచు గచ్చులుబలికెదవు - ముచ్చటలవి చూసి
మురయుచు నెప్పుడు-విచ్చలవిడిగా విర్రవీగినను- వచ్చును
అపద వదలదునినుగని ॥లుచ్చా॥

3 కొంటెలాస్గురను కూడిన బహువిధ-తంటలుగలుగును దాటి
తెలియదెటు-మంటికిబోయెడు తనువునుజూచిన-వెంటరాదు
నీవంటరివౌదువు ॥లుచ్చా॥

4 భోగభాగ్యములు సతమనినమ్మకు - రాగాదులనిటు రానీ
యకుమీ - త్యాగివౌచు నీయోగసిద్ధికై - ఆగమవేద్యుని
యంటితిరగు నీకే ॥లుచ్చా॥

5 తప్పుడుపనులవి గొప్పగావు - నీవెప్పుడుదలచకు ముప్పు
గలుగు-శ్రీహరిపాదములు నరయుచుదిరిగిన - తిప్పలు
లేవి చొప్పదెలియుమీ ॥లుచ్చా॥

6 కన్నుగానకను మన్నపోతువలె - మిన్నుమన్ను రెండెను
గకదరిగిన-మన్ననలేదిది మర్యాదానా - అన్నిటిజూడగ
అమహాదేవుడు ॥లుచ్చా॥

7 వాసిగ దరియూ గురువరుసేవయె- గాసిదీర్చునని దెలిసియు
ఖాశీం-మోసపోయినను వేసటగాదా - దోసిల్లొగ్గి పర
దాసుడిగనవే ॥లుచ్చా॥

## 40, తత్వము

(భూపాళరాగము - మిశ్రగతి)

1 పోదాముపదవే జీవా మనము పోదాముపదవే-పోదాము
పదవె యా భువనాకారునిజూడ-వాదాభేదములేని బోధా
గలుగును మనకు ॥పోదా॥

2 ఆదిఅంత్యములేని వేదవేద్యుడుమనలో- పాదుగా నివసించి
ప్రభలుచునున్నాడు ॥పోదా॥

3 యెన్నెన్నో విధములైయున్న మాయనుగూడి - తిన్నగ
నాశింప ధీరుడైయున్నాడు ॥పోదా॥

4 భిన్న భిన్నములైన వన్నెలకును మిగిలి - యున్నాడక్ష
రాత్ముడై యోగీశ్వరులబోధన ॥పోదా॥

5 సృష్టికాధారమై సర్వమెన్నడుగాక - శ్రేష్టత్వమున తాను
ద్రష్టయై యున్నాడు ॥పోదా॥

6 దండిప్రభువై మనకు దారిజూపుచు యూర్ధ్వ - కుండలికిని
నిశానై పండియున్నాడిట్లు ॥పోదా॥

7 నీవారశూకమున నిలచీ నిర్మలుఁడౌచు - భావాములో నిండి పరశివుడై యున్నాడు ॥పో దా॥

8 నాశికాగ్రమునందు దేశికమూర్తియై - భాసిల్లుచును పర నివాసియైయున్నాడు ॥పో దా॥

9 ధరలో దరియాగుడై పరమాత్ముడై భాసిం-తరియించుటకు మంచి తెరవు దెల్పెను నేడు ॥పో దా॥

## 41 తత్వము

(నాదనామక్రియ — ఖండగతి)

1 సర్వేశ్వరా నీదు చరణసేవకుడ నను శరణంటి రక్షింపరావా-నుర్విలో నినుదలచు యోగ్యతను దయజేసి నిర్విచారుని జేయలేవా ॥సర్వే॥

2 యతులితంబైన యానందపద మొసగి యాదరించుటకిటుల రావా - సతమైన నీవె నాగతియనుచు నమ్మితిని - హితవాక్యములు దెలుప రావా ॥సర్వే॥

3 నీవెదిక్కని నిన్ను భావంబునను గొలువ పావనుని నను జేయగావా - అవనిలో నీకంటె అధికులు లేరనియు యాసించు నను గావలేవా ॥సర్వే॥

4 ధీసాక్షి నీవనుచు లోజూచువారలకు - వేసటలు బావగా రావా - వాసనత్రయములకు వశపడని నినువేడు దాసులను కరుణింప లేవా ॥సర్వే॥

5 అరలేక భక్తాళి మొరలిడిన దరిజేర్చు - పేరుదుగలిగిన తండ్రిగావా - ధరణిలో బహు రూపధరుడవనగల నీవు పరమార్థ మొసగగాలేవా ॥సర్వేశ్వరా॥

6 వాసిగా దరియా హుస్సేన్‌షా గురురూపమై భాసిల్లు పరమాత్మ రావా - నీఅమును లేరవియు ఆసించు ఖాశీము దాసుమొర యాలింపలేవా ॥సర్వేశ్వరా॥

## 42. తత్వము

(మిశ్రగతి - కాంభోజి రాగము)

1 గురుదేవా నీవెయాధరను సుజనుల బ్రోవ-కరుణాన్వితుడ వైతివి - నిను గొనియాడ దురితములను దుంచితివి - పారామార్థికమైన తెర వెరుకపరచి సుస్థిరుల జేయగ నీవె- వరదుడవు వైకుంఠవాసివి వాంఛలెల్లను దీర్చ ప్రభుడవు- మరువకను నిన్నెపుడు గొలచెదు మార్గమున నిలుపవె దయతో ॥గురు॥

2 అంతు యింతనరాని బంధరహితుడనై నీ - వుంటివని విందురవని పరిశుద్ధాత్మ అందూ నివసింతూవని-విందూగ నీకథలందన ఋషులెల్లానందముతో సతరమొందుజూడక నిన్నె - డెందమున నిలిపియు ధనములనందబోరవి నీదు కృపకే - ముందుగా నీ పదములకు నే వందనంబొనరింతు ననిశము ॥గురు॥

3 కోరికవృక్షవర్తులై నిను జేరి భజియించిన-భారము నీదెక దా శుభములగూర్చ దూరము లేవుగదా - కారాణాచార్య ని

ఘనమెవ్వారెరిగిరో వారలె నినుగాంచి ధీనులై మెలగెదరు-
పోరిమాయతో మీరి సర్వాధారమౌనీస్మరణ విశ్వాకారమై
వెలుగొందు నినుగనుదారియు నిదెచూచెదరు భువిలో ॥ఘన॥

4 వాసరార్చితుడవై భాసిల్లుపరలోక-వాసివని బాగపొందిన
నీవే ధరలో దాసూల దరిజేర్చినా - యీశుడౌ దరియా
దేశికమూర్తి నీదాసుడనౌ ఖాశించాను నను కడతేర్చ -
దోసిలొగ్గి స్తుతింతు పరమోల్లాస పరశివ భక్తవరదా-
యాస జెందితినీకటాక్షముగానిదీర్చ్వ నటంచుమదిలో ॥ఘన॥

## 43. తత్వము

(ఏక తాళము - నాదనామక్రియ)

1 అన్ని దేహములలో వెలసి నిండిన యాత్మ నెరుగవలెను -
భిన్నమైన మార్గములను బోయిన భేదదృష్టియానూ ॥అన్ని॥

2 ద్రష్టను జేరిన వారలెభువిలో ధన్యులమనవలెనూ - దృష్టి
విధానం బెరుగనివారలు సుఖము జెందరిలను ॥అన్ని॥

3 గాత్రము లోపల సూత్రధారునితో కలసిమెలగవలెను -
నేత్రములో నిజరూపంబరసిన నిశ్చలతత్వమౌనూ ॥అన్ని॥

4 హాయిగల్గు సదుపాయము నెప్పుడు బాయకుండవలెను -
మాయామయమౌ జగమున జేరని మార్గ మెరుగవలెను
॥అన్ని॥

5 శక్తిని సర్వప్రపంచముకల్పిన రక్షకుగనవలెను- మోక్ష
శక్తి జనించినవారలె దీక్షయాను ధరను ॥అన్ని॥

6 దరియౌగురువరు కారణస్మరణయె వచ్చుని వనియానూ -
మరువక ఖాశీం తెరవులేని యాదరణంబికగల్గ ॥అన్ని॥

## 44. తత్త్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 గురుదేవ నీపాద స్మరణజేసెదనన్ను - కరుణించమని వేడితి-
పరమపద వాసుడవునీవని భావమున నినునిల్పియుంటిని-
మరువకను నీమరుగుజేరెదు తెరవుజూపవె పరమపురుషా
॥గురుదేవ॥

2 ఎంతవేడినా యిసుమంతైన దయరాదు-పంతామ నామీ
దను - చింతలెల్లను దీర్తువని నీచెంత జేరినవాడ - నీకృప
సంతసంబారసరించి గావవె వంతుకెక్కిన వైభవుడవో
॥గురుదేవ॥

3 ఆపదోద్ధారకా యానందనిలయా-నీప్రాపుగోరినవాడనూ-
కోపమెంచక బీదగను నీ దాపుజేర్చి యఘుంబులెల్లను-
బాపుమో భవబంధరహితా భావగోచర భక్తపాషణా
॥గురుదేవ॥

4 అండజేరినవారి దుండగములు దుంచ - దండిమూర్తివి
నీవెగా - పండితులు నీభజనజేయుచునుండి నిత్యానంద
మునను-యఖండమై వెలుగొందు సినుగనుచుండి బంధ
విముక్తులైరట ॥గురుదేవ॥

5 ఎల్లలోకములలో కొల్లగవెలిగె నీచల్లనిదయజూపవే -
తల్లిదండ్రియు దాతదైవము ఎల్లనీవేననుచు నెల్లపుడుల్ల
మున గొనియాడి యితరము నొల్లనను కడతేర్చగదవే
॥గురుదేవ॥

6 వాసిగా దరియూ గురుదేశికపదములు - ఆసించి నుతియింతును - మోసమేమియులేని పరమోల్లాస మొనగూర్చియును ఖాశీం దాసునీ క్లేశములణచి పరమనివాసమున నిలువంగగలశ్రీ ॥గురుదేవ॥

## 45. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 అంతరాత్మనుదెలియావె ఓమనసా భవమంతమొందును గానవె - సంతోషమున పరమశాంతునికధలు నీస్వాంతమందుననిలుప- చింతలేమియులేవు - వింతవింతలు గలుగు మాయను-చెంతజేర్చక యుంటివా సుఖమింతయని దెలుపంగరా దహమంత వదలు నిరంతరమునీ ॥అంత॥

2 సందేహములుపీడియు నీలోనీకానందముగలుగు మరియు - బంధమేమియులేనిసుందియు దే మును వేల్పులందారు తమలో తామందినవిధమిది - మందమతులకు తెలియకను యిహ పొందుగోరిరి ముందుగావక డెందమున నినునీవె గాంచిన అందమై యఖిలంబు నవుదువు ॥అంత॥

3 అంటిఅంటనిద్వైవము నీలోగలుగ జంటవిడి జనబోకుము - రెంటికావలను ముక్కంటిపదములుముట్టి వంటుదెలిసిన నీకే తంటాలేమియులేవు మంటిపాలై పోవు దేహము- వెంట రాదెప్పటికి వినుమా- బంటుతనములు వదలి పరశివునంటి మరువకనుంటె జయమా ॥అంత॥

4 మించిపోయెను కాలము యిహచింతల నుంచబోక వ
మానము - సంచితములుదీరు మంచిసాధనను నీవెంచి
శాశ్వతపదవి గాంచి సుఖింపుము - యుంచ నలవియు
గాసిమాయను ద్రుంచి నిస్త్రైలు లైనవారు-వంచ నేమియులేక
తమలో పంచకోశా తీతుగాంతురు. ॥అంత॥

5 దండివారెరింగించిరా మార్గము వీడకుండితములోగాంచినా-
పండితులకే దైవబలమబ్బు - భావమాఖండలుజేప్ప యే
దుండగములులేవు-మండలత్రియములకు నావల నిండివెలి
గెడు దరియుగురుకృప నుడజూచినజాలు ఖాళిం పంకుగై
పరమెరిగెదవు నీ ॥అంత॥

## 47. తత్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 గురుదేవా నీవే యాధరను సుజనులబ్రోవ కరుణాన్వితుడ
వైతివి - నినుగానియాసు దురితములనుద్రుంచితివి - పర
మాత్ముడనబరగి పారమార్థికమైన- తెరవు వెలుకపరచి
సుస్థిరులజేయుగనీవె - వరదుడవు వైకుంఠవాసివి వాంఛ
లెల్లను దీర్చు ప్రియుడవు-మనుజను నిన్నెప్పుడుగొలిచెడు
మార్గమున నిలుపవెదయుతో ॥గురు॥

2 అందుయిందనరాని బాధారహితుడవై నీవుందువని విందు
రవని-పరిశుద్ధాత్ములందు నివసింతువని - విందూగనీకథ
లందినబుధు లెల్లానందముతో నితం మెందుజూడక నిన్నే

డెందమున నిలిపియును భవములనందఁబోరసి నీదుకృపకై -
ముందుగా నీపదములకు నే వందనంబొసంగెంతుననిశము

||గురు||

3 మానకనిను గొలచు మాన్యులకును నీ ధ్యాన్నమె సుఖ
రూపము - విషయములచే సాధనముగోరి దృఢవ్రతులై
నిన్ను జేరి భజియించిన భారము నీదే కదా - శుభములను
గూర్చి పోరి మాయను మీరి సర్వాధారమా నీస్మరణా
విశ్వాకారమై వెలుఁగొందు-నినుగను దారియని దలచెదరు
భువిలో ||గురు||

4 వాసవార్చితుడవై భాసిల్లు పరలోక వాసియని బొఁగ
డొందినా - నీవెవరవో దాసూలదరిజేర్చినా-యీశుడవో
దయా దేశికమూర్తి నీదాసుడనౌ ఖాళింబాసు ననుకడ
తేర్చ-దోసిలొగ్గిభజియింతు పరమోల్లాసపరశివ భక్త
వరదా - యాశజెందిన నీకటాక్షము గాసిదీర్చునటంచు
మదిలో ||గురు||

## 47 తత్త్వము

(నాదనామక్రియ - ఆదితాళం)

1 మాయామయమాజగమునుజూచియు హాయినిమరచెదవా
ఓమనసా హాయినిమరచెదవా-ధ్యేయమైన యీయాత్మను
గలయుచు బాయకమెలగగదె ఓమనసా హాయినిపిడవే

||మాయా||

2 నిజమౌ సౌఖ్యము నీలో యుండగ కుజనులగోరక వేఓమనసా
సుజనులగూడగదే - గజిబిజిజేసెడు గారడికోరకె భజన
మరతువటె వే ఓమనసా భక్తిచె ప్రభుగనవె ॥మాయా॥

3 ఆదిఅంత్యములేనియాత్మలో యఖిలమున్నదనవె ఓమనసా
ఆర్తిజెందవలదే-బోధరూపమౌ సాధనదెలిసియు వేదన
పడవలదె ఓమనసా మోదమందగదవె ॥మాయా॥

4 హంసనటించేవిధము దెలిసియును హింసలకేగెదవె ఓమనసా
సంశయమునువిడవె - మాంసమయంబౌ మలినదేహమిది
ధ్వంసమౌనుగదవె ఓమనసా హంసోహంబనవె ॥మాయా॥

5 రూపరహితమౌ వ్యాపకుజేరిన పాపములేదనవె ఓమనసా
తాపమొందవలదె - పాపలలోపల పరమాత్మవ్యాపకము
భవమునదల్చగదవే ఓమనసా తన భవము వీడగదవె
॥మాయా॥

6 దరియౌగురుపరుదర్శనమబ్బెను దారిదొలంగకవె ఓమనసా
భారములేదుగదే- అరమరలేకను ఖాళీందానువి అలసట
దీర్చగదే ఓమనసా ఆలస్యమువలదె ॥మాయా॥

## 48 తత్వము

(పూర్వకళ్యాణి—మిశ్రగతి)

1 శ్రీ గురురాయ చింతనదీర్చ-నాగతిగావా నమ్మితిబోధ
॥శ్రీగురు॥

2 అవ్యయరూపా యఖిలముదెలుపా - సర్వపవిత్రా సత్య సంకల్ప ॥శ్రీగురు॥

3 అన్నియునీవె యాధారుడవె-సన్నుతిగొనవె సాక్షివిగావె- నిర్మలచరితా నిగమాతీతా-ధర్మసంభరితా పాపవిఘాత- త్రిగుణవిదూరా అగణితధీరా యగుణాచారా ॥శ్రీగురు॥

4 దాసపోష దరియాహుస్సేన్ షా - భూషితభూషా పుణ్య విశేషా తంగెళవరదా దయయుంచవేరా మంగళమొగద మహిమసుబోధా ॥శ్రీగురు॥

## 49, తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 పరమమోక్ష సతీవిభుండవయా - మునుభాగవతులెపు డాయకను నినుగొల్చుచుందురయా- మఱవకను నీమృదు పదంబులు శరణమనినా హృదయమున నిడి-స్మరణజేయుచు నున్న నను నీ కరుణజూపియు, గావరావె ॥పర॥

2 సకలలోకము లేలుదొరవయ్యా-నీవకడవనుచును సాక్షిగను వెలుగొందుచుందువయా - సుకరముగ నిన్నాత్మలో పరి శోధనము జేయుంగనీవె-ప్రకటమై భవబంధముల నెడ బాప గలవని ప్రస్తుతింతును ॥పర॥

3 నీవుగాకను వేరులేదయ్యా-నినుగన్నవారలు చావుపుట్టువు లేకయుందురయ్యా- దేవదేవుడవై ననీవె దిక్కటంచును దివమురాత్రియు - భావమున పరిశుద్ధులై నినుబాయకను భజియింతురయ్యా ॥పర॥

4 యోగిజన సంస్తుత్యుడవునీవయ్యా నినుదలచువారల- భాగ్య
మేమని బలుకనవునయ్యా - తామరస గర్భాదులకును
తెలియబడని నీకృపావన - దరియగురు పాదములరెంటిని
గలియజూచిన తెలియునయ్యా ॥పర॥

5 ధరను భాశీం నామమోయయ్యా యితరంబులేకను-దృష్టి
కావల నుందువోయయ్యా - సోమసూర్యుల భావమెర
గియు రాకపోకలు లేనితావున - పారికటంబుగ నుందు
వయ్యా ॥పర॥

## 50. తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 మాయామయమై యున్న దేహము దీనిబాయ పరమాత్మ
సహాయము - హేయమౌ విషయముల ద్రోయువారలు
భువిలో-న్యాయవర్తనులై యుందురు యెవ్వరు హాయిచె
నఖిలాత్మగందురు ॥మాయా॥

2 బుద్ధికుశలత గలుగువారలు భువిని శుద్ధులై సుఖరూప
లౌదురూ-శ్రద్ధతో గురుని పద్దుబూనినవారు - సిద్ధులై
శివరూపులౌదురు-వారె పద్ధతెరిగి భవమునందరు
॥మాయా॥

3 విపరీతములు వీడువారలు గురునికృపగలిగి గురుతులో
నుందురు- నెపములన్నియువదలి నేర్పరులవువారె సఫలులై

సదయాత్మగొల్తురు-ధర్మనిపుణులై చపలమును గెల్తురు
॥మాయా॥

4 యండమావుల రీతిజగమని దీని యండబాయుచు మహా
ఘనమని - పండితు లానందపదవిలో నిలచియు - ఖండా
ఖండములను గలియరు ధరను దండివారె ధర్మమీడరు
॥మాయా॥

5 మందమతులకు దెలియరానిది హృదయమందె నివసించు
పరమాత్మది - సందియములు మాని బంధరహితులెల్ల
అందియానందమైయున్నది సుజన బృందమెప్పుడు బూని
యున్నది ॥మాయా॥

6 ధరణుదరియాగురుని సేవలో వరుసదప్పక మెలగువారిలో-
పతితపావనమవుచు హితవుగగనువారి మతిలో మహిమను
జూపుచున్నది - మరి యేగతిలేనిదని భాశింగన్నది
॥మాయా॥

## 51. తత్త్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 ఉన్నదిఉన్నట్లు దెలియకున్న సుఖము లేదురా - నిన్నునీవు
గాంచ నీకు భిన్నమేమి లేదురా ॥ఉన్నది॥

2 భ్రాంతిమూలమైన జగము చింతలపాలౌనురా-వంతనొండ
ఫలము లేదు అంతు దెలియబోదురా ॥ఉన్నది॥

3 ప్రాప్తఫలము విడువబోదు తృప్తిగలుగ మేలురా-సుప్తి
జాగరములు నెచట గుప్తమౌనో దెలియరా ॥ఉన్నది॥

4 తెలివిగలిగి యున్ననీవు కలుపరింత లేపిరా - నిలకడగల
యోగ్యులకును అలపలేమి లేదురా ॥ఉన్నది॥

5 యమునిబారిలో సజిక్కి శ్రీమలనొందవలదురా- క్రిమము
దప్పి మెలగువారిని భవములపాల్జేయురా ॥ఉన్నది॥

6 దేహమునను దేహినరయు యూహగలుగ జాలురా -
నూహకములబోవరాదు అహమునణచ లేవురా ॥ఉన్నది॥

7 దృష్టికావల నీవనెవరో స్పష్టపరచి చూడరా - సృష్టియెల్ల
గాంచితాను దృష్టవంతుడైరిరా ॥ఉన్నది॥

8 భయములెల్ల విడుపగురుడు - నయముగా బోధించెరా-
దైవరూపమనుచు మనకు ధర్మములను దెలిపెరా ॥ఉన్నది॥

9 తోచితోచకున్న నీకు గోచరమిటుగాదురా - దాచియున్న
ధనమునీవు జూచి సుఖము జెందరా ॥ఉన్నది॥

10 యీశుడైన దరియాగురుడే క్లేశములను బాపురా- మోస
మేమి లేదటంచు ఖాశీందాసు దలచుచుండురా ॥ఉన్నది॥

## 52. తత్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 వందానమయ్యా శ్రీ గురుచంద్రా వందానమయ్యా -
వందాన మిదెగొనుమీ బంధారహితా నీదు - సుందార
చరణార విందములనుగొలుతు- అందుయుందనరాక నీవే
యందు లేకను యుందువని - బుధు లెందరో నీసేవ జేయుచు
విందుగా వినుతించిరటభువి ॥వందాన॥

2 నినుదలతునయ్యా భువనములందు ఘనుడవీవయ్యా- అణు మాత్రమైన చిదాత్మను-గనుమార్గమును దెలుప మూలమై ముజ్జగంబులు - యనుపమాన యభేద్య యాశ్రిత జన సుపోష జగద్విలక్షణ క్షణికమా దేహాద్యవస్తుల దునుము దోషవిదూర నీకిదె ॥వందాన॥

3 పావనమయ్యా నీచరితాము సేవానమయ్యా - కోవిధనుత పరమగోప్యమా నీమహిమ - కేవలానందమై కీర్తింపబడు చుండ - భావమున పరిశుద్ధులెల్లరు బాయకను నిన్నెస్మ రింపుచు-సావధానముగాను శాశ్వత సౌఖ్యమును బడ యుదురు స్థిరులై ॥వందాన॥

4 మరువబోనయ్యా నీకృపగలుగు తెరవెన్వరయ్యా - పౌర పూలన్నియుదీర్చు వేదవేద్యుడవనుచు - మరుగుజొచ్చిన నన్ను మన్నింపక నెవరు - ధరను దరియా గురునిరూపము దాల్చి భక్తులబ్రోవనీవై యురుగుదెంచితి వనుచు-భాశీం పరముజేరెదు తెరవుగోరెదు ॥వందాన॥

## 53 తత్వము

(నాదనామక్రియ - ఏక తాళము)

1 గురుకరుణకు సమమైనభాగ్యమిక ధరలో నెదకినగలదా - యిదె తెరవనుచును వినవలదా సత్ పురుషులసంగతిగాదా గన రాదా-మురునకమదిలో నిల్పినవారలు మహనీయులు జనుమార్గముగందురు ॥గురు॥

2 సందియములు బోనడచినవారికి ముందుభయంబులు లేవు-
సుఖమిందేయుని గనగలవూ-భువి మందమతివి నీవుగావు-
యిటు రావు- ఆందముగనుయానందమయుడవై-యుందువు
నీకే బంధములుండవు ॥గురు॥

3 నూటిదప్పకను మాటినడుమను-బోటియున్నదటుచూడూ-
యాబాటనునడచియుగూడూ-జంజాటములను దిగనాడు-
అదెతోడు - చోటిచ్చును పెడవాదములకు - నీతోటివార
లతో కూటము జేయుము ॥గురు॥

4 అంతరజ్ఞప్తిచె నిలచి ఆత్మరాముని చెంతను నిలచినజాల -
బహుసంతోషంబవు మేలు - యిహచింతలన్నిటిదోలు -
వివిధాలుగల పంతంబులు-బోజూచిన వారలె - శాంతినిల
యులై శాశ్వితుగలతురు ॥గురు॥

5 పరలోకమునకు బాంధవుడవు శ్రీదరియాగురువరు సేవా -
నిజధర్మంబులకు త్రోవా - సర్వార్థమిదేయునలేవా - విన
రావా-అరమరలేకను ఖాశీందాసుస తెరవుదీర్చగల వేద
సారమా ॥గురు॥

## 54. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 యోగమును సాధింపదెలియునురా - భవబంధమిడుటకు
బాగుగను భావింపవలె వినరా ॥యోగ॥

2 యోగమనగా వేరెలేదు-భోగులకుగవరాదు సర్వత్యాగు
లైతె గాని దెలియదు-యాగమాంతంబైనసౌఖ్యము
॥యోగ॥

3 కర్మవశులకు గానరానిదిరా-నిష్కర్ములైతే-మర్మమున
గను భాగ్యమిదియేరా-దుర్మార్గంబుల ద్రుంచి కేవల ధర్మ
సూత్రింబెరుగువారికి-నిర్మలంబై నిత్యసుఖమై నిర్వికారుల
నీతిమార్గము ॥యోగ॥

4 యెంతవారలో యెరుగగలదిదిరా - సువిచారులకుబహు
సంతసంబై సాధ్యపడినదిరా - మంతనంబుల దొరుకబోనిది
మహితమై మర్యాదగలదై-సంతకూట భ్రాంతులన్నియు
సమయజేసె సత్యాగుణులిల ॥యోగ॥

5 నిశ్చితులకిది నియమమైనదిరా - నిత్యానుభవమున-పశ్చి
మాంతర వీధినున్నదిరా - దుశ్చరితులు గోరరానిది
దూష్యమేమియు లేనిదని ముని - కశ్యపబ్రహ్మాదులాదిగ
ఘనముగను భావింపబడిన సు ॥యోగ॥

6 హృదయమున నే పదిలపరచునురా - యితరులకు దెలియని
విధమిదే వివరింపబడినదిరా - వదలకను తనలో నితానె
ముదమునను గను మోక్షమార్గము-విదితమై విపరీతముల
కును వేరుగానున్నట్టి వేద్యము ॥యోగ॥

7 ధరనుదరియా హంసేశ్వర సద్గురుని - కరుణామృతంబై
వెరపులను బాపుటకు యీభువిని - సరసమై సర్వాత్మ
కంబై సాధనముల కసాధ్యమవుచును-నిరవయవమై శ్రీకోం
దాసుకు వెరపుదీర్చెడు విధముగలిగి ॥యోగ॥

## 55. తత్త్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 చింతింపవలదు శ్రీధరునికృపజాలుదుర్-వంతలనుగూర్చెను
వాంఛలనియేలన్ - వింతవింతలుగలుగు విధమైనమాయ
నీవెంతమాత్రముజేర్చ నెరవుఘటియించున్ ||చింతిం||

2 చెప్పనలవిగాని చేష్టలను గల్పించి - ముప్పతిప్పలుఁబెట్టి
ముంచగలభ్రాంతిన్-విప్పఁజేవిడదోర్రియు-హీలుగాకుండినను
తప్పత్రోవలబెట్టి తబ్బిబ్బుజేయున్ ||చింతిం||

3 లేనిజగమునుజూచి హానియునిదలపకను-పూనికలదనిబలుక
న్యాయంబుగాదె - మానితంబుగ దీనియుర్వ్యాదగనువారు-
కానిపనులనుగాంచి కష్టపడియెదరు ||చింతిం||

4 తొల్లిజన్మమున జేయు ఫలమనుభవించుటకు-గలిగినవి జన్మ
లని కలవరము తెలసి - తెలివిచే భవములను తెగటార్చు
టకు గురుని సవిశేషదృష్టియే సార్థకమనుచు ||చింతిం||

5 ధరను దరియూనుగని దయవలన శ్రీశం - తనహృదయ
గుహాలోన దైవమునుదలచి - దురితములుయిక తొలగి
పోవునటంచు-తిరుచుగాధ్యానింప తలచేరు పరుషన్
||చింతిం||

## 56. తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 దేశికప్రభు గొలువరారె మనకు వేసటాలేమి లేవన రే -
ఆసించి భువిలోన యీషణంబులజిక్కి మోసపోయిన

ఘము - లేశమైనను లేదు - భాసురంబౌ పరమతత్వ విలా
సమును విచారించి నిత్యము - క్లేశరహితంబైన యీశుని జూచి
మరువక సుఖాకరంబని ॥దేశి॥

2 భూతపంచకమైన జగము దీనిచేత నెవరికి దెలియదనుము -
జాతకమాదిగ విషయవ్రాతములను గప్పి - భూతలంబున మనకు
జాతకంబును గాదు - లో - తెరంగును గాంచువారికి జ్యోతి
రూపంబనుచు నొకటై - ఖ్యాతిగను గనుపించు గురుకృప
చేత దెలియును దెలియుటకుసటు ॥దేశి॥

3 లింగాంగ విధమెరుగకున్న సర్వసంగరహితంబౌటసున్న -
మంగళప్రదమై తెరంగు వెరిగెదమున్న - శృంగాటకమున
మెలుంగవలెననిశము - యీ గితులకీవిధము తెలియు ప్రసంగ
ముల భావింపబడదీ - సంగతిని గనుగొనుటకును గురుపుంగ
వుని దయ గలుగవలెనిక ॥దేశి॥

4 మూడు యేరులు గలియు చోటా మనము గూడియుండు పట
నదియే కాటా - వేమారు తోడ పై మేడాలో నిలచిన చేకియు
గలదందు తోడై నశుభముల వీడునా - జాడ దెలిసిన జాలు
నిక మనవాడ గలిపిన ఫలమా - వైభవము జూచుటకు తానె
నీడయై నిజమెరుగువారల తోడుగా నున్నావు జగమున
॥దేశి॥

5 సార్థకమైన సర్వార్థములను గూర్చ్ - వ్యర్థములను వదలు
వ్యవహారము బూనగవలెను - తీర్థయాత్రలు నిండియుండిన
దివ్యస్థలమీ దేహమనుచును - అర్థులను రక్షింప దరియా
అప్తుడై యున్నాడు దెలియ - పార్థితుండై యుండె ఖాశీం ॥దేశి॥

# 57 తత్త్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 పరమామృతంబౌచు బరగుపరమాత్ముడు నా - తరమా
వర్ణింప భువినీ దెలియ - నిరుపమానందమై నిర్వికార
మవుచు - తరుగుమరుగేమిలేని అంతరంబులుమిగిలి కేవల-
ధార్మికులు గనుదారియై-శ్రీకరముగను కళ్యాణయుతమై
కారణాత్ముల కరుణచేగను ॥పర॥

2 అంతయుందనరాక ఎందుజూచినను - యింపొందియున్నది
నిండుగా విషయానందమేమియుగాక - బంధరహితంబౌచు
అందారికందదుగా-సందియంబులువీడి పరసుఖ మందగోరిన
వారికెల్లను - ముందు వెనుకనరాకనతంట - నందియున్న
యాత్మరూపము ॥పర॥

3 దేహిదేహములను తెలివివిచేయుచుని తెలియు - యూహా
పోహాలు లేనిదీ-సర్వామోహాములనువీడి - ద్రోహచింతన
లేని సాహసము మరీనదీ-బాహుబలములకందరాకను కూహా
కపు విద్యలచె తెలియుక-యిహాముపరముచు వివరమెరుగక
విశ్వరూపంబై నదదియే ॥పర॥

4 ధరనుదరియాగురుని కరుణచేతను-పరమునరయుటకు తెర
వాయెను-మరువకను ఖాశీం మర్యాదగాపాడ- దురితములు
దూరమాను ॥పర॥

## 58. త త్వ ము

(శంకరాభరణము - ఏక తాళము)

1 దేవదేవుని తెలియ లేవా-నీవు కావరమున నీవుగా నకున్నావు-నీ వెవరో నిన్నెరుగరావా - సర్వజీవులు నీవనుచు నీ వెంగబోవ ॥దేవ॥

2 సతమూ సర్వము విడచి వ్యత్యస్తములు జూపు విషయముల బారి - ఆత్యాసగలిగినను సుఖమునుగోరి - మృత్యుభయమును లేక మరతువట కోరి ॥దేవ॥

3 భక్తిశ్రద్ధలు గలిగియున్న బంధ ముక్తులు నెరుగని పరమాత్ముడున్న-యుక్తమానే తెలియవన్నా-మాయాశక్తి సహితమైన జగములున్నా ॥దేవ॥

4 ఆరాటములు పొందబోకు సకలాధారుని ధ్యానంబె దరియౌను నీకు-పేరాశలను జిక్కి చెడకు యీధరణి ధన్యులకు తారియగా తనకు ॥దేవ॥

5 ధరను దరియాగురుని కరుణను నీవు భావమందుననుంచి పాల్రించియున్నా- ఏమారు లేకుండ ఎపుడు సర్వాత్మాగముతో భాసిమందునను ॥దేవ॥

## 59. త త్వ ము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 ననుకడ తేర్చుమో ఘనమగు దేవా - వినయముతో నిను వినుతించెదాను ॥నను॥

2 మాయావాదముమని మదిలో నను నే - బాయక దయతోను పాలించగదే ॥నను॥

3 ఎన్నాళ్ళకు నను సన్నుతి జేయక - మన్నన గలదే మహనీయ భువి ॥నను॥

4 ఘట్టిగ నీ పద కమలము లెదలో - పట్టుగ నిల్పియు ప్రార్థన జేతును ॥నను॥

5 సమయమిదే నా స్తవమును గైకొని - సుమతులగముగాను క్రియముగ నిల్పియు ॥నను॥

6 అందరిలో నను కుందగ జేయకు - నందనమయ్యా సుందర మూర్తి ॥నను॥

7 దిక్కు నీవె నా దీనత బాపవె - చక్కని స్వామి నన్ను చిక్కుల బెట్టక ॥నను॥

8 తెలిసి తెలియక నను మెలగితి ధరలో - తులువ యనుచు నన్ను కలవర పెట్టక ॥నను॥

9 అసత్యోద్ధారక కోపము చేయకు - నాపై దయతో దాపున జేర్చియు ॥నను॥

10 బాధలపాలౌ భవములనుంచకు - వేదవేద్య నిన్ను కాదన నెవ్వరు ॥నను॥

11 దాసపోషణ శ్రీకరియా గురువర - మోసము చేయక ఆశించితిని నిన్ను ॥నను॥

12 ఖాకీందాసుని వేసట బాపవె - యీశుదేవని నే దోసిలొగ్గితిని ॥నను॥

## 60 తత్త్వము

(బేహాగ్ రాగము - మిశ్రగతి)

1 అన్నిరూపములవుచు నగుపడెడు దేహముల - నున్నపర
మాత్మ తా నొక్కడెగాదా - భిన్నమై దోచుచును భీతి
గల్పింపునవి - నున్నగాకను వేరె నున్నదనగలవా ॥అన్ని॥

2 ఆదిఅంత్యముగలిగి అపరాధముల మునిగి - మాధవునిగన
కున్న మర్యాదగలదా - పాదుకొని పరతత్త్వశోధనకు
దూరమై - నాడనీదనుమాయ వేదనలేలా ॥అన్ని॥

3 ధన్యత్వ మొందరించి ధరణీధవుని సేవ - అన్యమెరుగనిబోధ
కాధారమౌను - నూన్యులకుగనరాని శులభసూత్రింబిది-
మాన్యులకుగనగలుగు మర్యాదయవు ॥అన్ని॥

4 భక్తపరాదీను భగవాన్ అనిమునులు-ముక్తికొరకై చాల
మోదముదలచు-వ్యక్తిగలిగియుభువి యీశుడవై యీశు
గొన-భక్తితోసర్వేశు బాలింపనవును ॥అన్ని॥

5 దివచంద్రతారలకు దిగ్దేవతల కాది - దేవుడవని మునులు
దెల్పువాక్యములు-వివరింప వేరులేదను యీశ్వరులకును
కవులకల్పన లవు ఋషుల ॥అన్ని॥

6 దరియాహుశేన్ షా గురుదైవమౌనుచు-నీ తలపులోనుంచి
నను దరియానను మూ-వెరపులేదిక నాకు వ్యాప్తమైగురుని
మరుపులేకనుగొల్తు మర్యాదతోను ॥అన్ని॥

7 ఖాశింధాసుని గాసిదీర్చె (శ్రీ) గురురూపంబై యిలనూ
అన్నిటయున్న ఆరాత్మను తనలో యున్నదైవమును
జూచెన్ ॥అన్ని॥

## 61. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 వందనంబిదెజేతు గురుదేవా నాపైని దయతో బంధముల
బరిమార్ప నిటు రావా- ఎందు వెదకిననీవె పర్మానందమయుఁడ
వటంచు నిర్మలు లందముగ నినుగూడి విషయములందు
జేరక నిత్యసుఖులై-యుందురని నినుముందు దలచెదను గత
ద్రోహములను - క్రిందుపరచెదననుచు గొలచెదను -
మందుడనను మర్యాద దెలియని మానవుడనని నన్ను జూడక-
పొందుగను నీచరణ సన్నిధి- నందజేయవె సుందరాంగ
॥వంద॥

2 పరమపావనమైన నినుజేరి నీకంటెనితరము నరయఁను
నిజమెరిగి నినుజేరి-పరువుబారక యింద్రియంబుల పద్ధతిని
గురు తెరిగి నీపై గురిచే- మాయా నటనలన్నియు గోర
కను బ్రహ్మానుభవమున - భరితులై భవవారధిని గడచి
నీలోగలచెదు- తెరవిదేయని ధీయుతులుజూచి కరుణగల్గి
తెల్పువాక్యము - స్థిరమటంచు నమ్మినీకృప నరయుభాగ్య
మొసంగుటకునినుమంటకను మదిలోననిల్పియు ॥వంద॥

3 నమ్మరానిది దేహమనిదెలసి దేహాభిమానము సమ్మతింపక
సాధువై నిలచీ - యిమ్మహీస్థలమునను గురువరు సమ్మతిని
గని స్వార్థమును నెగజిమ్మి - చిన్మయులవుచు హాయిని
నెమ్మదిగ బారియుచును జగమును - బొమ్మలాటగ జూచి

నిలచిరిగా-అవివేకమెప్పుడుక్రిమ్మరీయకగనతగాంచిరిగా -
నమ్మినమ్మక నుండుసంశయ నిమ్ముగను జేర్చకను నీలో-
తన్మయత్వము నొంది శాశ్వత ధర్ములన ధర్మాత్ములైరని
॥వంద॥

4 అన్నినీవై యున్న నిజమెరిగి సకలార్థ సాక్షిగ నెన్నినీకథ
లానుటకు మరిగి-భిన్న భిన్నములైనమాయను - యెన్న
దైనను జూడనేరక యున్ననతోనిను జేర నెంచియు-వన్నెలకు
మిగిలున్న నిన్నే యెన్నుచును విశ్వంబులోపలను-విబుధాళి
మరువక నున్నవారిని విన్నదాదిగను- వున్నతోన్నతమైన
నీవె నన్ను దయతో బ్రోవగలిగిన - కన్నతండ్రివటంచు
నెరిగియు ఘట్టిగా నీ భజనజేయుచు ॥వంద॥

5 ఆశజెందియు దోసిలొగ్గితిని శ్రీసద్గురువ ప్రభో నీరమానులు
లేనిదెవిగితిని - మోసమేమియు జేయకూ నాగాసిదీర్చెద
వనుచు నమ్మియు - భాసురంబై వెలయు నీకృప జేసినీ
నామామృతంబును-దాసదాసుడనొచుగోలుచును-దరియా
హుస్సేన్ షా దేశికుడవని మదిలొ మరువకను - వేసటలు
లేనట్టి నిన్నెడబాసినను ఫలమేమిలేదని దోషములు
దొలగుటకు-ఖాశీం దాసుడను నీదయనుగోరియు ॥వంద॥

## ౧౨ తత్వము

(నాదనామక్రియ - ఆదితాళం)

1 స్వయంభవుడవై భయంబుబాపెడు-దయామూర్తివని యుం
దురు - రయంబునను రక్షించుటకును మహానీయుడవని
గందురు ॥స్వయం-

2 చరాచరంబుల కాధారంబౌ స్వామివి నీవనియందురు -
విరాగభక్తుల మొరాలకించె నిరామయుడవని గందురు -
పరాకులేక సుపాలన జేసే ప్రభుడవునీవనియందురు- మొరాల
కించియు విరామమొసగే మూర్తివినీవనియందురు-గణింప
నీవేఘనుండవని నీ గుణంబులేగనుచుందురూ ॥స్వా॥

3 గుణాతీతమై గురుతుదెలుపు సద్గురుడవు నీవనియందురు -
గణింప నీవె ఘనుండవని నీ గుణంబులేగనుచుందురు -
సదానీభజన ముదంబుగూర్చుట యుదార్ధమని బుధులం
దురు - నిదానమున నీకథల్ వినుచు నిదె సుధామయంబని
గందురు ॥స్వా॥

4 ఆత్మానాత్మల జాడదెలియుటే యధికంబనిఘనులందురు-
ప్రత్యక్షంబని భావములోపల భాగవతులుగనుచుందురు
॥స్వా॥

5 ధరలో దరియూ గురువరుసేవయె ధన్యతగలదనియందురు -
వెరువకు భాశీం దాసునికిదే వేడుకయని ఘనులందురు
॥స్వా॥

## 63. తత్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 మహానీయ నీకృపయె మానవాళిబ్రోవ మర్యాదగల
దాయెను-వివరింప నిది బహు జన్మ ఫలమాయెను- మహాన
మున నినుదలచు సత్ పురుష శ్రేణిలో- వివరింపుచుందువని

వేడుక చెబుధులు - అహమునణచియు యాత్మసుఖమున-
యిహాపరంబుల రోశి నీవె - భువనముల పాలింతువపు నీ
స్తవమునను భవరహితులైరట ॥మహా॥

2 అంగవిలక్షణ మంగళ ప్రభ నీవె సంగాము లేకుండువు
సర్వాత్ముడవై భంగ మేమియు జెందవు-రంగుమీరిన నీతె
రంగు గను వారల పొంగుచు నీకథలె-శృంగారముగ వినుచు
జంగమస్థావరములందున-నింగిపోలిక వెలుగునీఘనసంగమున
సర్వార్థములు గొని సంతసింపరె సాహసులునై ॥మహా॥

3 అన్నిరూపములకు ఆధారమైయున్న నిన్న - యెన్నుచు
సర్వమునీవె ననుచు భిన్నపరచక ననిశమూ-మన్ననతో
నీదు సన్నిధిబాయకయున్నవారలెనిన్నుగన్న వారౌదురు-
తన్ను దెలియనివారు నీభువి నెన్నిటికినిను దెలియబోరని-
భిన్నమాయావిలాసముతిన్నగావిడదీయ మేలౌ ॥మహా॥

4 దండిగ నీకళల నుండజూచినవారె - నిండి నీలోనుందురు
యితరముగనక - కుండలాగ్రముగందురు-పండితులెల్ల నీ
యుండజేరియుగాదె-మొండివాదములెల్లఖండించిఘనులైరి-
మండలత్రియములను మీరియు - ఖండమై వెలుగొందు
నిష్కళ నుండి వీడక నీపదములు - మెండుగాగని మెలగు
చుందురు ॥మహా॥

5 వాశీగ దరియా గురుదేశిక మూర్తివై వేసాట లేకుందువు
భక్తుల హృదయ నివాసివై వెలుగొందువు - మోసాము

లేని నిర్వాసనగల సుఖము భాసియుండిన విషయవాసన గలదని - ఆశచే ఖాశీందాసుని వేసటలు బాయుటకు నిది యభ్యాసమని దినదినము మరువక ॥మహా॥

## 64 ద్విపదార్థములు

(శంకరాభరణము - ఆదితాళము)

సద్గికతోడను వాంఛలు వీడి - శుద్ధత్వమున పరశోధన జేసి
అద్దములో నీడ నరయుచందమున - సిద్ధులై దివ్యాత్మ
చిత్తంబులోన ॥బద్ధత లేక గందురూ॥
బ్రహ్మానుభవులై యిద్ధర వెలయుచుందురు - కద్దూ లేదను
పట్టి రద్దూల పాలుగాక - హద్దూగ నిలచి నిశ్చయార్థులై
యనవరతము ॥బద్ధత లేక గందురు॥

## 65

సూటిగా మనసు సుషిరమున జేర్చి బాటవీడక కలుష
జంజనులౌచు - బూటక జగమని పొందుగోరకను నాటక
ధారుని నయములో గాంచి ॥కూటాము వీడకుండేరు॥
కుశలులై సుజనగోష్ఠినిగూడియుండేరు - ఆట పాటలనైన
ఆత్మానుభవమువీడక మేటిపదవి గోరిలితి - సాటిలేకున్న
దని ॥కూటాము వీడకుండేరు॥

## 66

నిజతత్త్వ మెరిగియు నిర్మలులౌచు కుజనులగూడక కోవిధ
వంద్యు - భజన జేయుచు చాల భక్తి శ్రద్ధలతో

విజితేంద్రియత్వమున వెలయుచు తాము ॥గజిబిజిలేక గందురూ॥

ఘనులౌచు నెంగు విజన స్థలమునందురు-అజహరి రుద్రు లకు ఆధారమైనవాని - సుజనూలుతమలోజూచి సుఖ రూపులవుచు నెవుడు ॥గజిబిజిలేక గందురు॥

67

(శ్రీ)కరంబౌ గురుని సేవింపుచుండి లోకవార్తలు మరచి లోకేశుగాంచి - పాకమెరిగిన వారి పద్ధతుల్ వినుచు ఏకాంతమున పరము వీక్షింపగలిగి ॥శోకామోహాము జెందారు॥

శుభగులై సత్యలోకాము నందె నిలచేరు-చేకొని గురుని యాజ్ఞసిద్ధిగలిగినవారు రాకపోకాలు లేని-ఏకామహా పదవి గనుచు ॥శోకామోహాము జెందారు॥

## 68. తత్వము

(నాదనామక్రియ - ఏకతాళము)

1 గురు కరుణామృతము నంద గోరిన నరుల దురితము లన్నియు దొలగునె మనసా- హృదయమందున గురుని వడలకయున్న పదిలమహా పరతత్వమొదవునె మనసా ॥గురు॥

2 ఆరుచక్రముల యందమరినహంస - పాదుదెలిసినభవము బడద్రోయుమనసా-కూటస్థానమునందు గురినిల్పియున్న-దీటులేని పరము దిక్కౌనె మనసా ॥గురు॥

3 కలవంటి సంసార కలవరములలో తలపుంచకను పరుని దలుపావె మనసా- వెలిలోను వ్యాపించు విశ్వేశుకృపచె బలమైనమాయాను బడద్రోయుమనసా ॥గురు॥

4 అంగవిలక్షణుసంగతిదెలసి- భంగాముగాకున్న భయమేమి మనసా-బాసులబ్రోచెడు దరియాగురువరుని శాసనంబును విడువ జనదె ఓమనసా ॥గురు॥

5 దోసిలొగ్గిన ఖాశీందాసు యెల్లప్పుడు - దేశికుని సేవయే ఆశించెమనసా ॥గురు॥

## 69, తత్త్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 గురునికరుణ బడయువారలు నిజతత్త్వమెరిగి - పరమపదవి చేరుధీరులు-నిరతమానందాబ్ధిలోన నిలచి నీతిఖ్యంతులౌచు- తరుగులేని సుఖముగలిగి-ధన్యులైరి ధాత్రిలోన ॥గురుని॥

2 తలపులుడుగు తావుజేరియు తమలోన వెలుగు - కలిమిగోరి కలతదీరియు - వెలిని లోను ఏకమవుచు వెలయుసర్వ మయునిగలసి - మెలగివిషయరహితులౌచు మెళకువాత్మో మేలుగనిరి ॥గురుని॥

3 నాదమున వినోదమందియు ఆద్యంతమనని - బోధగలిగి మోదమందియు - నాదినీవి యనెడు మాయ పాదువీడి భావమితర శోధలను జొరక పరమ సాధులై భవబంధ మిడిరి ॥గురుని॥

4 హాయిగలుగుజపమెరిగియు-అభ్యాసమున విధేయులవ్వుచు బాయ కుండియు - మాయ మవుటకిదియు సాయమైన మార్గమనుచు - ధీయుతులఖిలాత్మ్మగాంచి కాయములను గానరెపుడు ॥గురు ని॥

5 పెక్కురూపులైనజగమున సర్వేశ్వరుండు - ఒక్కరూపు డనుచు నెరిగిన-జక్కవడును జన్మఫలము చిక్కులేమి లేవ టంచు - నుక్కువత్తో దరియాగురుండు మర్మమెరుకపరచె ఖాశీం ॥గురుని॥

## 70. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 శ్రీకరంబగు దేశికప్రభుని పదపద్మములు గన లేక విరుగుట వ్యర్థమాయువని - రాకపోకలు లేని పదవి నిరాకరించిన వారికెవ్వరు - లోకభ్రాంతియెగాని మరియే లోకమున విశ్రాంతి గలుగదు ॥శ్రీక॥

2 ఆదిమధ్యాంతములులేకున్న నిగమాంతవేద్యుని - మోద మునగనసుఖముగలదన్నా-పాదుకొనిబ్రహ్మాండమునకును యాదరంబై సకలదిశలను - వేదవేత్తల యనుభవంబున బోధపడు నిజతత్వమెరుగుము ॥శ్రీక॥

3 చూపు రూపము లొకటియా విధము నీలోన గలిగిన వ్యాపకుని గను తెరవు యిదెయనుము - లోపమేమియు లేక యాపరలోకమున జేరుంటివా-యేపాపములు నీదరికి రావని - తేపతేపకు తెలియుచుండుము ॥శ్రీక॥

4 హృదయమున పద్మముపదిలపరచియును పదలకను నీవా సదయు
కృప గాంచియును మెలగినను-కామరుడపడి కామాదివృత్తులు
వదల గలవీ విధము నెరిగియు - అమరుబెమరును లేక
శాశ్వతపు సదనమును విడబోకుమనిశము ॥శీక॥

5 నాశికాగ్రప్రకాశియాదరియా గురుదేవుగొలచిన మోస
మేమియులేదు నిజమరయ - భాసురంబగు సర్వసము
నుల్లాసివై భజియించ క్లేశము బాసి చన భవనాశమా యిదె
నాశనంబన వినవె ఖాళీం ॥శీకరంబగు॥

## 71. తత్వము

(కళ్యాణిరాగము - మిశ్రగతి)

1 వినరే బుధజనులార విశ్వాత్ముకథను-పనిబూనియునువారె
పరిశుద్ధులిలను ॥విన॥

2 ఆదిఅంత్యములేని యానందమయుడు - వాదబేధము లేక
పరమైయున్నాడు॥విన॥

3 లోకాలోకము లేమిగ్గాకయున్నాడు - శోకమోహములచే
శుష్కింపబోడు॥విన॥

4 అసమానమై తానె యలరుచున్నాడు - దిశలెల్ల పరికింప
వశము కాబోడు ॥విన॥

5 సర్వశక్తివహించి సాకుచున్నాడు - దుర్వివాదములచే
దొరకకున్నాడు॥విన॥

6 సగుణనిర్గుణములకు సాక్షియైనాడు - పగలు రేయునరాని
పరమాత్ముడతడు ॥విన॥

7 నాశరహితంబైన నారాయణుండు - దేశికు కరుణచే దెలియు నున్నాడు ॥విన॥

8 దరియాగురుకృపగలుగ దయయుంచినాడు - వరదుడను చును ఖాశీం వదలకున్నాడు ॥విన॥

## 72. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

శ్రీరామ రామరామ శ్రితగుణస్తోమ శ్రీరామ రామరామ ॥శ్రీరామ॥

1 శ్రీరామ రామయని యేమానవుండైన కారుణ్యముగ ఎంతో ప్రేమతో బిలచితె-నీమనిష్టలు లేక ఎప్పుడు స్వానుభవమున జూచు వారల - కామితార్థంబుల నొసంగుచు ప్రేమతో రక్షింతువయ్యా ॥శ్రీరామ॥

2 ఏకాంతమందు జేరి శ్రీరామయని ప్రేమతో స్మరణ జేయ- ఏకాకారముతోడ ఎల్లప్రొద్దులయందు-చీకాకు లేకుండ చేరి యుందువు రామ-ముందు వెనుకను సందు లేకను సందియంబు లేక ఎప్పుడు-ఆనందముగ నినుగొలచువారల డెందమందున జేరి యుందువు ॥శ్రీరామ॥

3 బాహ్యత్రిపుటిని మరచి ఎప్పుడునూ శ్రీరామ యనిస్మరణ జేసిన శాంతినిత్తువయా- అంతరత్రిపుటిని జేరనివ్వక సంతతము నినుగొలచి నప్పుడు ధ్యేయమగు పరమాత్మరూపై వ్యాపకంబై యుందువయ్యా ॥శ్రీరామ॥

4 అంతరాంతర త్రిపుటియందు నా లక్ష్యార్థమునుంచి సృష్టిపర
చిన జ్ఞానదృష్టికి-నావృత్తులిక లేక కేవలాత్ముండ వగుచు
ఎప్పుడు బయలు బ్రహ్మంబగుచు నీవే ద్వయము లేకను
యుందువయ్యా ॥శ్రీరామ॥

5 వాచకంబున రామయనియును శ్రీరామ నిన్ను మానసంబున
చెదర నివ్వకను- జ్ఞానమందున జ్ఞప్తినుంచుక జ్ఞప్తికూడ
మరచియుంతట-తాను నేనను వెరుక లేకను ప్రత్యగాత్ముండ
వగుదువయ్యా ॥శ్రీరామ॥

6 రామరూపమె తంగెళ్ళపుష్పంబు భక్తుల కెల్లను స్వానుభ
వమై తెల్ప ఆపుష్పంబు-అనుభవంబే యనుచు నెప్పుడు వప్పు
గాదరియాను వేగమె ఘట్టిగను దెల్పుదువు రామా ॥శ్రీరా॥

## 73. తత్త్వము

(బేగడరాగము - మిశ్రగతి)

1 ఏది ఎటుల జరుగనౌనో యెరుగ నెవరి తరముగాదు -
వాదులాడ ఫలము గలదె వసుధ నెంతవారికైన ॥ఏది॥

2 పూర్వ పుణ్య పాప ఫలము కార్యరూపమై జనించు -
నిర్వహింతువనకు నీవు సర్వమయుని కరుణగాక ॥ఏది॥

3 పుట్టి భువినిబడియు మరల గిట్టువరకు ఖర్మఫలము - యిట్టి
దనగరాదు దీని దిట్టపరుపబోకు మెందు ॥ఏది॥

4 మానవ జన్మంబు ప్రభుని ధ్యానమునకు గలిగెననుచు -
జ్ఞానమొంది మరువనీకు స్వానుభవంబు విడదు ॥ఏది॥

5 జనన మరణ దుఃఖములను వెనుక ద్రోయు వాడుగాదె -
ఘనులటంచు పలుకు శ్రుతుల వినయమున భజింపవలదె
॥ఏది॥

6 గురుని కరుణ వలన తనదు గుర్తు దెలియవలెను గాని -
తెరుచు శాస్త్రములను జదువ తన్నెరుగ గలరె భువిలో
॥ఏది॥

7 తన్ను దెలియకున్న మాయ ఎన్నడైన విడువబోదు -
భిన్నమైన మార్గములకు యెన్నబోవు యెప్పుడైన ॥ఏది॥

8 చపల గుణములన్ని వీడి నిపుణతతో నిన్నుగాంచ - సఫల
మాను జన్మఫలము అపరిమితానందమమురు ॥ఏది॥

9 వాసిగను దరియా హుస్సేన్‌షా దేశికుని సత్కరుణ వడసి -
దోసిలొగ్గి ఖాశీమా నీ వాసించుము అదియె మేలు ॥ఏది॥

## 74, తత్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 భావాతీతంబైనది సద్గురుమహిమ భవములంటకయున్నది-
కావారములుమాని ఘనులానందముబూని నీవునేనగాని
తావుజేరిననిదియె ॥భావా॥

2 వెలిలోనిర్మలమైనది సద్గురుమహిమ కలకాలమునునున్నది-
తులలేని పరసౌఖ్యమొనగూర్చి దృఢమైనబలమొసగి భవ
బంధముల బాపుచునున్నాది ॥భావా॥

3 అన్నిటతాన్నైనది-సద్గురుమహిమ యెన్నవలవియుగానిది-మాన్నవత్రో తను తా గన్నవారలవరమై సున్నైనమాయ తో నెన్నడు గలియక ॥భావా॥

4 అండబాయకనున్నది-సద్గురుమహిమ నిండినిజమైయున్నది-యెండమావులరీతినుండుజగమునుగనక-దండివారలమదిలో దయజూపె ధర్మమై ॥భావా॥

5 నెరవులన్ని దీర్చేది-సద్గురుమహిమ వేదావేద్యంబైనది - చరితామై దరియాగురు కరుణాకటాక్షమని-ధరణు భాశిం దాసు శరణనుచు మరువానది ॥భావా॥

## 75. తత్త్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 నిన్ను దలచెద దేవ దేవా-నన్ను మన్నించి బ్రోవనిటు రావా - ఎన్న శక్యముగాని విశ్వపాలన నీవె-కన్న బిడ్డల రీతి కరుణతో జూతువట ॥నిన్ను॥

2 కపట వాంఛలలోన బొరలి-నీవు కృపజూడకను మాయ వదలి - విపరీతములచేత విర్రవీగుచు భువిని-అపరాధినైతి నన్నాజ్ఞలో నిలుపుమని ॥నిన్ను॥

3 కల్ల జగమని దెలియలేక-పట్టి కలుషములజిక్కి- నినుగనక - ఆల్లిబిల్లిగ దిరిగి ఆయాసమున నీవె - చల్లగను రక్షింప స్వామి నను వెరవుత ॥నిన్ను॥

4 ఎందరిని గాచితోవో మున్ను-ఇప్పుడు ఎందరుండిరో గొలువ నిన్ను - అందరిలో నేనొకడ నతిదీనుడను- విషయ బంధములు వెడలించి భవము బాపెద వనుచు ॥నిన్ను॥

5 సర్వ రూపకుడ వీవనుచు - బుధులు యుర్విస్థలిని బలుక వినుచు-నిర్విచారంబుననునీవె సర్వంబనుచు-దుర్వివాదము విడువ దోడ్పడుదువని నమ్మి ॥నిను॥

6 అంతరాత్ముడవైన నీవు-ఘనము వింత వింతల కెల్లపాదు - సంతోషమున నిన్ను స్వాంతమున పూజింప-చింతలన్నియు బాపి చెంత జేర్చెద వనుచు ॥నిన్ను॥

7 ధరను దరియా గురుని సేవా-సర్వధర్మములను తెలియుటకు త్రోవ - మరువక ఖాశిం మానసంబున నీదు-స్మరణ జేయగ పాపమతి సమయునంచు ॥నిన్ను॥

## 76. తత్వము

(మిశ్రగతి - నాదనామక్రియ)

1 గురువరుని సేవా-పరమార్థమును గురుతెరుగు త్రోవ- అరలేక ననిశము మరువాక జేయుచును - స్థిరులైన వారలై యీదురితాబ్ధి తరియించి - పరమ పదవికి జేరు భాగ్యము బడయగల సద్భక్తులని మును-వరుసగా మహనీయులెల్లరు ఒక్కరీతిగ బలుక వినమె ॥గురు॥

2 యింగితపరులు యిష్టాయిష్టములులేని బుధులు - మంగళకరమై చెలంగు సర్వాధారు సంగతిగని-విషయ ప్రసంగ

మేమియు లేక-హెచ్చుతగ్గులను గనటంచు మఱువక ఆత్మరూపము
ననుసుకొంటకై-భంగ మేమియు లేక శిష్యుల పాదముల బాలించుచు
రెప్పుడు ॥గురువరుని॥

3 ఆదిఅంత్యము నుగాకను వెలిగే-బోధారూపమును శోధింప
గురుదేవు యాధారమేగాక-మేధావులకు యితర సాధాన
మేమాను - నాదినీదని బలుకరాకను గాధలేమియు లేని
స్వాత్రభ గోదవల పాల్గొని పరమ-సుధామయుంబని గొలు
చుటకుగద ॥గురువరుని॥

4 అతివినయమునను సేవింప సద్గతి గాంచనగును-మతిమంతులా
త్మార్థహితమెఱుంగగోర-శ్రీసతియే సర్వము దెల్పు క్షితిపై
నవతరించి-పతిత పావనమైన మార్గము - శృతిహితంబుగ
జెల్పి దయతో-పతనమేమియు లేని నిర్మల వ్రతముజూపిన
వారె గురులని ॥గురువరుని॥

5 పతితపావనము శ్రీగురు దరియా పాదసేవనము-అతివినయ
మున తానా కాశా తీతంబైన-పరమాత్మ సేవించి బంధంబు
లనుత్రుంచి-పరము జెందుచునుండు ఖాళీ వదలకను-తన
హృదయమందున వదిలపరచెను భక్తితో గురుని॥గురువ॥

## 77. తత్వము

(మిశ్రగతి - ఆనందభైరవి)

1 గురునాధు సేవా తత్పరులైన - తరియింప తెరవౌను-
గురిగాంచుమా పరమానంద భరితమా భజియింపుమా -
వెరవులన్నియుదీర్చి ఈశ్వరుకరుణానుస్థిరమై వెలుగగమరి

యేదురితాములున్నవె - తరుణమిదె నీవరసి నిర్మల తావు
జూచియు ధైర్యమున యేకోరతలేకున్నట్టి సత్పథ యిరవు
జేసుక నున్న మేలా ॥గురు॥

2 తెలిపినంతయెనీవు తెలివిలోజూచియుకలతలన్ని యువీడవె-
నిజతత్వార్థములవిజేసుకగూడవె - పలుభ్రాంతులనుబోవ
ఫలమేమిగలుగదు-వెలుపలలోపల వెలిగేపరాత్పరు తలవు
లను దలచియు - సుధామృతధారలను గ్రోలుచు-భవాం
బుధి మెళుకువతో నీదంగ గలిగిన-తెలివియె తెలివియన
జెల్లును ॥గురునాథు॥

3 అతిరహస్యమైన శ్రీహరికథలు విని కన- మతిమంతులైరి
భువినీ-సర్వాత్మసంగతి దెలియగలరీయవనీ- అతులితమహా
పదవి వెదకిజూచెను మలిన హితవుగలసినవారి జతనుండుట
యెగాని - పతితులకుగనరాని సత్యవ్రతులు దీనిని స్వాను
భవమున-గతియటంచు నెరుంగువారలె-క్షితినిధన్యాత్మ
లయ్యేదరు ॥గురునాథు॥

4 గంగయమునలమధ్యసంగములో నీవువంగిస్నానముజేయవే-
పరమాత్ముని తొంగిచూచుకొని హాయియే - అంగలింగై
క్యమె అమృతపదవియనిపొంగిమహాత్ములు భోగ్యులయ్యేద
రిలను - ఇంగితుల గలిగినను గద నిస్సంగులై బరగుటకు
నిర్మల సంగతిని విడబాయకను భవసంగమును జేరగా
వలదిక ॥గురునాథు॥

5 దాసుల బ్రోచుటకై తెగినపనియైన శ్రీదేశికు మదినెంచవే సుజనులుగూడి మోసపుమాటలనుత్యజించవె - వేసటలేనట్టి విధముగాయె యెరిగిన గాసిగలుగగబోదు - కలలోనైననునీవు ఆశలన్నియు విడచి దరియాదేశిక ప్రభుజేర అఘములుబాసి సర్వాసుధీపదవిని వాసిగా గనవవును ఖాశీం॥గురు॥

## 78 తత్త్వము

(శంకరాభరణము - ఆది తాళము)

1 మానసమా గురుపాదతీర్థములు మరువక గ్రోలిన మర్త్యుడవునిక - జ్ఞానవశంబున ఘనునిగానకను - హీనగతితో నీవేలచెడెదవయో ॥మానసమా॥

2 మక్కువతోడుత మాధవుపదములు దిక్కనినమ్మితె చిక్కులువిడునో ॥మానసమా॥

3 జారతనంబున వారకాంతలతో జేరి సుఖించిన దారిదెలియదిక -నారాయణయని నామముదలచిన ఘోరకలుషములు దూరమవునుగదె ॥మానసమా॥

4 యిందుగాను దరియాగురుచరణము లందంబున యానందించెదు-సందియుంబు సర్వంబు సమసునో ॥మానస॥

5 దోషదోషములు వేసట లటంచెను భాసురాత్మకుని పఠియుంచును - నీఆశపాశములుకోయ నిర్మలాప్రకాశము వాసిగగల్గును ఖాశీమా ॥మానసమా॥

## 79. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 రామా నీదగునామమేమాని వర్ణింతు పామారత్వము
బాపరా - సామజా వరదూడవనుచు చక్కగా నామదిని
నిల్పి - నీమముతో నీనామ మెప్పుడు వేమరక భజియిం
పుచుంటినీ ॥రామా॥

2 మును ప్రహ్లాదుని బ్రోచి ఘనయశము వడసిన అనఘ
మూర్తి వీవెగా - దినదినము నీసత్యకథలను వినుచు మన
మున దలచుచుండెడు-మనుజులకు యికజన్మ లేదని వినమె
ఆర్యులు దెలుపుచుండగ ॥రామా॥

3 మురహారియనుచు నీదరిజేరి యుంటిని కరుణా నాపై యుం
చరా - పరమపావన నీదునామము సతతమును మదిదలచు
చుంటిని-అరమరేలనో బ్రోచుటకు నీయభిమతంబని దెల్ప
వేరా ॥రామా॥

4 దాతావు నీవని దరిజేరియుంటిని పాతాకములు బాపరా -
పతితపావననీదునామము సతతమును మదిదలచు చుంటిని-
క్షితిని పావరప్పాలెమందునయతులితంబుగ వెలసియుండిన
॥రామా॥

5 దాసుడ ననుచు నీదాపుజేరియుంటి వాసుదేవా బ్రోవరా-
వేమరక నీనామమెప్పుడు ఆశచె మదిదలచుచుంటిని-ఖాశీ
మును దయనేలు దొరవని దోసిలొగ్గితి గాసి మాన్పరా
॥రామానీదగు॥

## 80. తత్త్వము.

(భైరవిరాగం. ఆదితాళం.)

1 ఓ న్నమశ్శివాయను మంత్రం నాపాపములను తెగద్రుంచెనురా - నమశ్శివా యని నామనస్సునందున నాగురుమూర్తి నాకు తెల్పెరా ॥ఓన్నమ॥

2 నా యనుబీజాక్షరము భూస్థానంబై యుండెనురా - గణపతి కెప్పుడు స్వానుభూతియై గమ్యంబై దనరారుచుండురా ॥ఓన్నమ॥

3 మాయను దెల్పిన యక్షరము మాయాతీతంబై నదిరా - యిమ్ముస్స్వాధిష్టంబున కిరవై నలువకు నెప్పుడు నానందింపుచు ॥ఓన్నమ॥

4 శి దెల్పినయీయాస్థిగ నామంస్థిదయియున్న దిఘున నామం - మణిపూరకమున మహనీయంబై వప్పుగ విష్ణుకు వందన మొసగుచు ॥ఓన్నమ॥

5 వరూపంబై వచ్చెనురా వైరాగ్యంబై దనరెనురా - వైరాగ్యంబన భ్రమరహితంబని రుద్రునకెప్పుడు- రూఢిగ మ్రొక్కుచు-ననాహతంబున నాదరింపుచును ॥ఓన్నమ॥

6 యావంతైన తేజమురా ఎల్లరుకును బోధింపరురా - క్షేత్రజ్ఞుడనుజీవుడు ఎప్పుడు కంఠంబున వలుకులు వచియింపుచు ॥ఓన్నమ॥

7 ఓంకారంబై దనరెనురా శ్రీగురుస్థానంబనవినరా - ఆరు
చక్రిముల కావలయున్నది తెరచిచూచిన తానైయున్న
నేతి నేతియని సీలోయున్నది శ్రీగురుతంగళ్యాళ్యాలు తెల్పిరి
||ఓన్నము||

8 మంత్రార్థంబని దెల్పెనురా సుబ్బదాసుసద్గురునూత్రి-దిని
నెప్పాడు ధ్యాన్నమొనర్చిన తిరిగిపుట్టరని దరియుచుదెల్పెను
||ఓన్నము||

## 81. తత్వము

(శంకరాభరణము - ఏకతాళము)

1 నిండీఅన్నిటయున్నదీ సద్గురుకరుణ నిగమాతీతంబైనది -
తాను నేననియేటి భేదాము లేనట్టి - తావున యున్నట్టి
తత్వజ్ఞులైనట్టి ||నిండీ||

2 హృదయాంతమైనాదదీ సద్గురుకరుణ నిటలాంతమైనదదీ -
జ్ఞానజ్ఞానములకు తావులేకనుయెల్లా స్వానుభవులాకెల్ల -
తావూనయున్నాది ||నిండీ||

3 బాధాలేకున్నాదదీ సద్గురుకరుణా బోధారూపంబైనది -
సాధానములునాల్గు తెలియనేర్చియున్న - వేదవేద్యులకు
బోధమైయున్నాది ||నిండీ||

4 ఖండమేమియుకానిదీ సద్గురుకరుణ దండివారికైనది -అండ
బాయకనుండి ఖండలాగ్రమునుండి - పండాగ సద్గురు
పండీ యున్నాదదీ ||నిండీ||

5 చావుపుట్టుకవుకాసిది యెప్పుడు వక్కతీరుగ యున్నాదది-
నీవారశోకమునబిండి యున్నవారి భావమందున తానై
పండూగై యున్నాది ॥నిండి॥

6 దండివారు గన్నది సద్గురు మకాశ్యవాసీ రీతిగ నున్నది -
మండితముగ ఖాశీం మహనీయులెప్పుడు-భావాభావామైన
బయలు తానైనాది ॥నిండి॥

7 సద్గురుకరుణాయిది ఎప్పుడుతన స్వాంతమందునయున్నది-
గురుకృపలేనట్టి మనుజసంఘములకు తెలియశక్యముగాని
దరియారు బోధించె ॥నిండి॥

## 82. తత్త్వము

(శంకరాభరణము–మిశ్రగతి)

1 నీకు నములిలగలరె ఖాశీంపా నిత్యవక్రాశ చేకొనవె-నను
కృపనుఖాశీంపా ॥నీకు॥

2 జోకతోడుత నిన్ను దలచెడు పాకమెరిగిన భక్తజనులను-
సాకగల సర్వాత్ముడవు-నీసదన మేనకలార్ధమయమా॥నీకు

3 వాచకంబున తెల్పుచుందువయా- ఖాశీంవలీపా మాన
సంబున ఆజ్ఞయిస్తువయా- ఆజ్ఞకూడలేనిదంచు వునికినీలో
చూపుచూను- పరమభక్తుల హృదయమూలో స్థాపితంబై
యుందువయ్యా ॥నీకు॥

4 బోధయందున శుకునివతుగాను-ఖాశీంవలీపా నిష్ఠయందున
ధృవునిచూపును- ఐక్యమందున జ్ఞప్తిలేకను అంతరంబున
నీవెయయ్యును-ఏత్తట్టుచూచిన అట్టెతోచుచు ఏమిలేకను
యుందువయ్యా ॥నీకు॥

5 వనరుగా ఆజ్ఞేయమందూన ఖాశీంవలీపా వప్పగాను ఆజ్ఞ
యిచ్చుచును-దనరుచును తాపత్రియంబుల తగులకెప్పుడు

లక్ష్యమందున - మేటి శిఖరములను నీవై సాటిలేక ను
స్వామివి గను ॥నీకు॥

6 నీలతోయద మధ్య మందున - భాసించలిపా నిరవుగాను
సౌజ్ఞ యిచ్చుచును-తుదయు మొదలు లేక నీవై సదయు
డవై యుండగాను-నీవు నేనను గురుతేని తావునీవని దరియ
కొసగిన ॥నీకు॥

1. మంగళహారతి

(తోడిరాగము. మిశ్రగతి)

1 మంగళముగురు దేవా మమ్మేలుటకు రావ॥జయమంగళము॥
సంగరహిత పీవ ప్రసంగము నను లేవా ॥జయ॥

2 నింగిపోలికనుండి భవభంగములు లేకుండి - నింగితులలో
నుండి విశ్వాత్మవైతివండి ॥జయ॥

3 ఏకమైననీవు యీలోకమున గనరావు - సాక నేర్చినావు
సజ్జనులను గన్నావు ॥జయ॥

4 ఆయక మలములలో ఆధారమైతి విటులో-సూరిజనులమదిలో
సుఖరూపువైతి విలలో ॥జయ॥

5 రక్షకుడై నదరియ గురు శిక్షగలుగుటరయ - మోక్షమార్గ
మిదియా దీక్ష విడకగలియ ॥జయ॥

6 ధర్మపథమటంచు భాసిందాసు నిన్ను గొలుచు - మర్మమై
నివసించు నీమార్గమెరుకపరచు ॥జయ॥

2. మంగళహారతి.

(శహాన్ రాగము_మిశ్రగతి)

1 మంగళహారతులివ్వరే గురు దేవునకును॥మంగళ॥
మంగళహారతులివ్వరె లింగభంగమైనగురుని - సంగము
నను విషయముల నెరుంగరాని సంగ తెరిగి ॥మంగళ॥

2 సాటిగలిగి సాటిదాటియు మహాత్ములలోన బోటియున్న
చోటు దెలిసియు - మేటిశిఖరమునను గురునితోటిగలియు
బాట దెలిసి-దేవుతేని ప్రభుడటంచు మాటిమాటికిని స్మరించి
||మంగళ||

3 దీక్షగలిగి రక్షకుండని వీక్షించి సర్వాపేక్ష లెల్లవీడ మేలని-
శిక్షగలిగి మోక్షదాత పక్షమునను నిలువ మనకు- అక్ష
యమహా సుఖమొసంగు పక్షపాత రహితుడనుచు ||మంగళ

4 చింతచింత లేమిలేకను ఆనందమయుడె - అంతరాత్మగాను
నిలచేను-పంతములకు తావులేని శాంతిగలిగి స్వాంతమునను-
భ్రాంతిరహితమైన దేవుచెంత జేరి చింతవీడి ||మంగళ||

5 యెల్లలోకములకు తానై విశ్వాత్ముడనుచు యుల్లము
లలోనుండు దేవుడై-చల్లనై సత్కృపనుగోరు యెల్లమానవు
లను బ్రోవ-తల్లిదండ్రి దాతయగుచు ధర్మములను దెలుపు
ననుచు ||మంగళ||

6 ధరను కుందువారిపుణ్యమునను భక్తులను బ్రోచు దరియు
గురుడె దైవమానన- వెరుకగలిగి వేదవేద్య స్మరణజేయు
మేలటంచు-మరువులేక ఖాశింధాను శరణుజేయు శాశ్వతు
నకు ||మంగళహారతులివ్వరె||

### 3. మంగళహారతి.

(శంకరాభరణము - మిశ్రగతి)

1 శ్రీకరముగ వెల్గు చిన్మయరూపును ప్రాపాకమైయుండు
బ్రహ్మమునకూ -రాకాపోకలుచూడా యేకమైయుండు -
నిరాకారమూర్తియా లోకానుధ్యానకు ||మంగళ||

2 అరమరిలేనట్టి ఆర్యవరులకు నెల్ల స్థిరమైన పదవనుచు తేట పరచీ - భరియించిసర్వము భ్రమరూపమూను మాన్పి- గురుతేమియులేని గురువర్యునకునూ ॥మంగ॥

3 మండలంబుల నెల్ల దండిగధరియించి అండజేసువారి నాద రించి - ఖండాముగాకయూ ఖండరూపము నాపై నిండు చంద్రుని వలెనుండు మహనీయునకునూ ॥మంగళము॥

4 మోదములరగ తాను పాదుదెల్పియు వట్టి గాధాలనెల్లాను కడకుద్రోచి- వేదాంతవేద్యుడై సాధుజనులకు నెల్లా బోధ పరచిన దరియా పుణ్యమూర్తికిని ॥మంగ॥

5 దాసాదాసుడైన ఖాశిమున్బ్రోచె యీశూడవైన విధం దెల్పి-మోసమేమియులేనభ్యాసము చేయించి గాసిదీర్చి నట్టి కరుణాకరుణాకూ ॥మంగళము॥

## పూజపాట.

(కాంభోజిరాగం-ఆటతాళం)

1 పూజసేయురె సద్గురుదేవు పూజసేయురె ॥పూజ॥
పూజసేయురె మంచిపుణ్యాత్ములై మీరు - రాజితమహా మహారాజరాజో గురుని ॥పూజ॥

2 ముర్యోటిజలకముచె ముందుజలకము వార్చి - వెయ్యి రేకుల మధ్యవెలయు సర్వాత్మునకు ॥పూజసేయరె॥

3 సత్వమనియెడు మంచిచలువ వస్త్రములు - మహాత్మున కర్పించి మర్యాదతో గురుని ॥పూజ॥

4 సందియములులేని గంధంబు నిటుదెచ్చి - అందంబుగను మేన నలది నిశ్చితు లవుచు ॥పూజ॥

5 శాంతమానిగ మంచిసద్గుణంబులు పుష్ప - బంతులుగను కూర్చి పరమాత్మపైనుంచి ॥పూజ॥

6 కామాది శత్రుల కదలకుండగబట్టి - నీమముతోడను ధూమమొనర్చియు ॥పూజ॥

7 న్యూనంబులేని సుజ్ఞానంబనియెడుజ్యోతి - పూని వెల్గించిన పూజ్యుడౌ దేశికున ॥పూజ॥

8 అహాముని స్ఫురియించు యజ్ఞానమును దెచ్చి - మహా నైవేద్యముజేసి మర్యాదతో గురుని ॥పూజ॥

9 కుడియెడమలబట్టి కుంభకంబుననిల్పి - తడబడకను నిదియె విడియంబనుచు నిచ్చి ॥పూజ॥

10 నేర్పరితనమను కర్పూరమును గురుని - కర్పణమనియును హారతిగను నిల్పి ॥పూజ॥

11 అరలేక దరియాగురు చరణాబ్జముల కొరగి - మరువకను ఖాశింమదినిల్పి మహనీయు ॥పూజ॥

## 2 పూజపాట.

(ధన్యాశిరాగం-ఆటతాళం)

1 పూజింతు గురురాయ పుణ్యస్వరూప - శ్రీరాజాధిరాజ మహారాజమహనీయ ॥పూజింతు॥

2 వాసనత్రయములుదీసి గంధముజేసి - దేశికప్రియ మీ దేహముపై నలది ॥పూజింతు॥

3 సుగుణములన్నిటి సుమమాలగాగూర్చి - సగుణుడవు నీకు హారముగాను ॥పూజింతు॥

4 తాపత్రయములను రగులక నేప్రొద్దు - నీపాదములకును ధూపముగను వేసి ॥పూజింతు॥

5 మనసేంద్రియములను మరలించి నినుజూడ - ఘనమైన
జ్ఞానమును దీపముగ బెట్టి ॥పూజింతు॥

6 నేను నేనను దోచ హాసిగలిగించేడు - మేనిగుణములు
మాని నైవేద్యమిడి ॥పూజింతు॥

7 దరియాగురువరు దేవు కరుణవహించినయట్టి - పరిపూర్ణులను
గలసి భక్తగ్రంధులతోడ ॥పూజింతు॥

8 ఖాశీందాసుని వేసటలనుదీర్చి పోషించి దయనేలు -
యీశుడె గురుడనుచు ॥పూజింతు॥

## 1. జోలపాట

(లాతిపాటమాదరి-మిశ్రగతి)

1 జోజోజో గురురాయ జోజోజో మహనీయ - జోజోజో
సుఖరాయ జోజోజో సదయా ॥జో॥

2 నీవారశోకముననిలచి వర్తింపభావంబునబుధులు ప్రస్తుతి
యొనర్ప - కేవలుడవై భువిని కీర్తిని వహింప - నీవేగా
భవములను నిమిషమున ద్రుంప ॥జో॥

3 దిశలెల్లనిండియును దివ్యులకుద్రోచి - వశమైలివని నిన్ను
వర్ణింప నెంచి విసుగుజెందని భక్తవితతినిటుగాంచి - రక్షకు
లనుజేయుదు విరాగమునసుంచి ॥జో॥

4 సాధనంబులు నాల్గు స్తంభములుగాను - వేదాచతుష్టయ
మను త్రాళ్ళతోను - మోదమలర గురునిబోధ తొట్టిగను
సాధనంబునగూర్చి సఖులు లందరును ॥జో॥

5 పరమాత్మరూపమై ప్రభలు నినునిలపి - స్థిరముగానుంచె
దరు దీనతనుబాపి - తెరవులన్నియుబ్రోవు విధములను
జూపి - కరుణించెదవునీలో ఘనముగాగలపి ॥జో॥

6 క్షితిని దరియాపురుడై శివరూపుడనుచు- గతతమును మది
లోను సాక్షిగాగనుచు- వెతలన్నియు బాయుటకు విధమి దే
యనుచు-వ్రతముగను ఖాళీం హితవుగా దలచు ॥జో॥

1 మేలుకొలుపు.



(భూపాళరాగం-ఆదితాళం)

1 సాక్షివై జగముల వీక్షింపుచు బుధులరక్షించ గురుదేవా



మేలుకో॥

2 పక్షపాతము లేని ప్రభుడవు నీవనుచు దీక్షగలిగున్నారు॥ మే
3 నిండుసమాధిలో పండియున్నా నీవు పండితులను బ్రోవ ॥ మే
4 యుండ జేరినవారి ఆదరించెదుకొరకు దండిదైవమునీవే ॥ మే
5 మేరుశైలముపైని ధీరుడవై నీవు వేరులేకున్నావు మేలుకో॥
6 కారణపతి వనుచు కాంక్షించి భక్తులు కాచియున్నా రయ్యా ॥ మేలుకో॥
7 లోకలోకము లేమిగాకను నీవైయె యేకమైయున్నావు ॥ మే
8 సాకెదవని జనులాకొని నీకృపకు చేకొనియున్నారు ॥ మే
9 జగములసృష్టించి జగతిభావముగాక విగిలినీవున్నావు ॥ మే
10 దిశలెల్లదిగనాడి విగతకల్మషులెల్ల సుగతి గనన్నారు॥ మే
11 వాసిగదరియా గురువరుడవై నీవిల్లుభాసిల్లుచున్నావు ॥ మే
12 ఆసించి తంగెళ్ళదాసు నీసేవాకై దోసిలొగ్గున్నాడు ॥ మే॥

2, మేలుకొలుపు.

(భూపాళరాగం-మిశ్రగతి)

1 సత్యమవుచు సర్వేశ్వరునిజేయుచు సాదుబృందము - నిత్య
ముక్తిని గోరుచును భువినిలచియున్నారు గురుపతి ॥ మే॥

2 ఆపదోద్ధారకుడవనుచును తాపసోత్తములెల్లనిన్ను - తేప
తేపకు దలచుచూను నీదాపుననున్నారు గురుపతీ ॥మే

3 భిన్నమేమియుగాక నీవె అన్నిరూపములైతి వనుచు
ఆపన్నులై నీపాదసేవను బాయకున్నారు గురుపతీ ॥మే

4 మేరుశిఖరమందు నిలచినధీరుడవు నీవనుచు భక్తులు -
వేరుసేయక నీదుకృపకై వేచియున్నారు గురుపతీ ॥మే।

5 తలపులుడిగేచోటనీవె దాగియున్నా వనుచు దెలిసియు-
మెళుకువతో బుధులెల్ల నినుగని మెలగుచున్నారు గురు
పతీ ॥మేలుకో॥

6 సదయహృదయ నివాసనీదగు సదనమున సర్వంబుగలదీ-
వదలకను నిన్నాశ్రయించిన కదలకున్నావు గురుపతీ ॥మే।

7 యెల్ల లోకములనుభవించె వేదవేద్యుడ వనుచు నిన్నె-
యుల్లమున యూహించి విషయము లొల్లకున్నావు
గురుపతీ ॥మేలుకో॥

8 వాసిగను దరియాహుశ్శైన్‌షా దేశికుడవని దీక్ష జేయుచు-
ఖాశీమయ్యాయె నీవటంచును కాచియున్నాఁడుగురుపతీ ॥మే॥

—:గద్య:—

ఇది శ్రీ దరియా హుశ్శైన్ షా ఖాదరి దేశిక సుజ్ఞానసుత
శ్రీ ఖాశీం వలీ షా ఖాదరి దేశిక ప్రణీతంబైన
పరమామృతంబను గ్రంథము సమాప్తము:
ఓం శాంతిః శాంతిః శాంతిః.